శ్రీ

# నిర్వచన సంగ్రహ రామాయణము





రచయిత:

ఈమని వేంకటకృష్ణయ్య

యల్లయపాళెం

శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానమువారి

"ఆర్థిక సహాయమున"

ముద్రింపబడినది.

# తొలి పలుకు

భక్తాగ్రేసరులారా !

ఈ చిఱుత కబ్బంపు మొలక మా పెదతండ్రిగారైన యీమని జానకీ రామశర్మగారి హృదయ క్షేత్రముననుద్భవించినది. బాలకాండములో "శివధనుర్భంగము" వఱకాతనిచే వ్రాయబడినది. అనంతరము వ్యాధిగ్రస్తులై శేషభాగముఁ బూర్తిజేయఁ జాలక పరమపదమును జెందిరి.

తదాదిగ నాకీఘొత్తమును బూర్తిచేయవలెనను సంపూర్ణాభిమానము కలిగి, నాకున్నస్వల్పజ్ఞానముతో నేనిది పూర్తిచేయగలనా ? లేనా ? యను విచక్షణఁగూడ చేయక ప్రారంభించితిని. శ్రీరామకటాక్షవీక్షణ పరంపరాగత పరిజ్ఞానమువలనను మా పెద తండ్రిగారి యనుగ్రహమువలనను తుదకు పూర్తిచేసితిని.

పూర్వ కవుల పద్ధతివలెగాక, యీగ్రంధములోని విశేషమేమన గ్రంథమంతయు నిర్వచనము. షట్కాండలును షడ్విధవృత్తసంచయముచేఁ బూర్తి చేయఁబడినవి.

అప్పటినుండి నీగ్రంథమును ముద్రించు ప్రయత్నములుచేసియు విఫలమనోరథుడనై కొంతకాలమాప్రయత్నమును విరమించియుంటిని. కొందఱు మిత్రులప్రోత్సాహముచే గత సంవత్సరము శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానము వారికి ఆర్థికసహాయమునకై విజ్ఞప్తినిపంపుకొనుటయు వారందులకంగీకరించి ధనసహాయము నేయుటయు జరిగినది. వారికి సర్వదా, సర్వథా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

* ఈ గ్రంథము ముద్రణలో తమ సంపూర్ణ సహాయసహకారము లందించి మాకెంతో చేదోడు వాదోడుగ నున్న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ రిజిష్ట్రారుగారైన శ్రీ కె. చంద్రశేఖర రెడ్డిగారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును బఠించి, కొందఱిచ్చిన యమూల్యాభిప్రాయములను గ్రంథారంభమునఁజేర్చియున్నాను. పెద్దలగు భక్తజనులందఱు నాశీర్వదించెదరని నా నమ్మకము.

సుబుద్ధులగు వారలకీ గ్రంథము తేనెపెర, పనసతొళ్ళ ద్రాక్షగుత్తి.

చ॥ అమరమెఱుంగనయ్య మఱియాంధ్రసుశబ్దపుచొప్పెఱుంగ నే
విమలప్రబంధసంచయము విన్నదిలేదు బుధాళిదర్శనం
బమరినదన్నగాదు సుగుణాంచితపండితవర్యులార ! మీ
సుమనములన్దలంచి నెరసుల్గలవేని గణింపకుండుడీ !

బుధజనవిధేయుడు,

ఈమని వేంకటకృష్ణయ్య

యల్లయపాళెము

## ఈ గ్రంథముపైఁ పెద్దలొసగిన యభిప్రాయములు :

ఈ "రామాయణము" నామూలాగ్రముగఁ బరిశీలించితిని. సాంఘికోన్నతిఁ బ్రసాదించులోకోత్తరమైన యితివృత్తము. శైలి సరళము. అన్వయము సౌలభ్యము. లలితమధుర సంస్కృత పద విన్యాస విలసితము. కవిత యిరువురిదైనఁగను గొనరానంత కలయి కతో నొప్పుచున్నది. ఈ గ్రంథమును బూరించిన కవి చిన్నవాడ య్యును ప్రౌఢకవులతో సమానముగఁ గవనమల్లినాడు. ఇతనికి నుజ్జ్వల భవిష్యత్తున్నదని యాశించి, యాశీస్సునిచ్చు చున్నాను.

విద్వాన్ : రావిరెడ్డి నారాయణరెడ్డి
(ప్రధానాంధ్ర పండితులు రిటైర్డు)
నెల్లూరు

భో భో ! విద్వదగ్రేసరా : ఈమన్యుపనామ్నా వేంకటకృష్ణ శర్మణా విరచిత "నిర్వచన సంగ్రహరామాయణ" మామూల చూడ మద్రాక్షం. బాలస్యాపేః తస్యకవేః కవితా స్వభావమధురా కోమలపద గుంఫితా పరీవర్తీ త్యేదతీవ మోదాస్మః అనేకగుణభూయిష్ఠాపి స్వభావ మాధుర్య రహితా కవితా సద్వృత్త రహితేన ప్రశంసాస్పదం భవతి. అస్యబాలకవేః కవితాయాంధారా శుద్ధిశ్చ సులలిత మేతత్కనక సుగంధ న్యాయమనుసరతి. విశ్వరక్షక శ్రీకృష్ణపరమాత్మాకవేః యితోధికాం కవితా శక్తిందత్వా దీర్ఘాయురనుగ్రహో త్వితా్య శాస్మహే॥

పైడిమర్రి చంద్రశేఖరశాస్త్రి
తర్క వేదాంత విద్వాన్
ఖమ్మం

విద్వత్కవివరులార ! సాహితీ పరులారా !

"నిర్వచన సంగ్రహరామాయణము" అను పేరు గల యీ కావ్యము కవిగారు దయతో నొసంగుటచే తద్గ్రథిత రసాస్వాదనము సేయు భాగ్యము లభించినది. వీరు వయసునఁ జిన్నవారయ్యును, సాహిత్యానుభవమున మిన్నలై, ప్రౌఢ కవులలో నెన్నఁదగినవారనుట కీపొత్తము తార్కాణము. నాతికఠినమై, సమాన ప్రయోగిత సంస్కృతాంధ్ర సమాసఘటితమై శబ్దార్థాలంకార రంజితమైన యీ కావ్యము సర్వజనపఠనీయము. షట్కాండలును, షడ్విధవృత్తసంచయముచే రచింపబడుట, వీరి మధురానర్గళ కవితాధారకు, సాహిత్యరంగమునందు వీరికిఁగల యనుపమాన పరిశ్రమను దేటతెల్లమొనర్చుచున్నది. శ్రీరామచంద్రమూర్తి నిజకరుణా కటాక్ష వీక్షణములచేఁ గవిగారికి దీర్ఘాయురారోగ్యములిచ్చుగాక ! వేంకటకృష్ణశర్మగారూ !

మ॥ రసవచ్ఛబ్ద ప్రయోగచాతురికళా రాజత్సుపద్యావళీ
ప్రసవానీక వినిర్గతోత్పరిమళ ప్రాధాన్యసంయుక్తమై
యసమానాంచిత శైలిసంయుతమునై యాద్యంత మాధుర్యమై
రసముంగ్రక్కుచునుండెఁద్వద్రచితమౌ రామాయణ 'గ్రంథమున్'

సుధీజనవిధేయుడు,

చతుర్వేదుల ప్రభాకరశాస్త్రి బి. కాం.
హైదరాబాదు.

కవి చిన్నవాడయ్యుఁ బూర్వకవులతో సమానమగు కవితఁ జెప్పినాడు. గ్రంథమంతయు గ్రంథకర్తచేఁ బూర్తిగఁ జదివించుకొని వింటిని. చాల బాగున్నది. లలితపద భూయిష్ఠమై షట్కాండలును షడ్విధవృత్త సంచయముచేఁ బూర్తిచేయఁబడుటఁగడుంగడు ముదావహము. భగవానుఁడే తద్గ్రంథకర్త కాయురారోగ్య సంపదలనిచ్చుగాక !

గుమ్మా నారాయణశాస్త్రి
సంస్కృత పండితుడు
యల్లయపాళెము

# ప్రార్థనాది పద్యమంజరి

శా॥ శ్రీకైవల్యపదప్రలబ్ధికొఱకై సేవింతు మాయావిధా
స్తోకాకల్ప చరాచరాన్విత జగత్త్రాణ స్థితాత్మోదరున్
లోకాధీశు నిరీశు యోగిజనలోలున్ భక్తమందారు స
త్యాకారు న్నిగమాంత వేద్యుని యశోదాసూనుఁ "గృష్ణాకృతిన్"

క॥ శ్రీలక్ష్మీనారాయణ
లీలావిర్భూత నిఖిల లేఖామోద
శ్రీలుర సీతారాముల
లాలిత పదపద్మయుగములను నుతియింతున్

చ॥ అరయ ననేకజాతికుసుమావళులన్ తులసీదళంబులం
ధరమిడి పూజసేసెడివిధం బదితప్పనరాదుగాని నే
నరుదుగ వేఱువేఱఁ గుసుమార్చనఁజేసినయట్లు వృత్తముల్
వరుసగ నొక్కఁడొక్కఁడుగ భాగములారిటిఁజేయఁ బూర్తిగన్

ఉ॥ భాసురమైన దాశరథి భవ్యచరిత్రను సంగ్రహంబునన్
వేసటలోర్చి నూతనకవీశ్వరమండలిమెచ్చఁ జేయుచున్
దాసులఁగాచు నీశ్వరునిధర్మవు నాశ మొనర్చుపట్టు నా
భూసురుడైన సత్కవియుఁ బొల్పుగఁబూర్తిగఁజేయ నంతటన్

మ॥ సకలప్రాణి హృదంబుజాతముల భాస్వల్లీలమైవెల్గు నా
యకలంకుండగు బ్రహ్మమూర్తిని తదీయంబైనలోకంబునన్

ప్రకటాశ్చర్యవిధంబుఁదోపఁగొనగన్ బాలుండనౌనేను శే
షకథంజెప్పఁగఁబూని మాధవుదయన్ సంపూర్ణ మొప్ప న్భవిన్

సీ॥ జానకీరామాఖ్యఁ జరితార్థుఁడైనట్టి
ఘనుని మా పెదతండ్రిఁ గరముమెఱయఁ
గరములుముకుళించి గాఢంబుగా మ్రొక్కి
తక్కటిసుకవులఁ దనరఁగొల్చి
వైకుంఠవాసుఁడై వఱలుచుండెడిదేవు
పాదపద్మంబులు భక్తిఁదలచి
మద్గురూత్తముల నమస్కృతశతములఁ
బరితృప్తులనుజేసి పరమతోష

తే॥ గీ॥ మునను బట్టితిఁ బొత్తముఁ బూర్తిఁజేయ
స్వర్గలోకముఁజేరిన శర్మకెపుడు
శాంతిఁజేకూరు గాత! దోషంబులున్న
నొప్పులుగఁజేసికొనుడు వినోదమలర

—(•)—

# ఆంజనేయస్తుతి

ఉ॥ శ్రీరమణీయవేష కబళీకృతపూష నిరస్తదోష దో
స్సారవిశేష భోగివరసన్నుతభాష జగద్ధితైష ఘో
రారిసమూహశోష ప్లవగాన్వయభూష బుధాళితోష సీ
తారమణీగవేష జితతామరసాజమనీష మారుతీ॥

# వేంకటేశస్తవము

చ॥ వరదుని యేడుకొండల నివాసుని యవ్యయు భక్తరక్షణా
భరణుని కామితార్థదుని భావభవారినుతాంఘ్రిపద్మునిన్
పరమపవిత్రనాముని యపారకృపాంబుధి నాదిదేవునిన్
"తిరుమలవేంకటేశ్వరు" నుతింతును యస్మదభీష్టసిద్ధికై

# సాయిబాబా ప్రార్థన.

చ॥ సరసిజనాభురూపుని విచారవిహీనుని శిష్యకోటిసం
భరితుని నిత్యతోషుని యపారదయామతినిన్ ఫకీరునిన్
వరమగు "షిర్డి" పట్టణనివాసుని మామకమానసంబునన్
కరమనురక్తిఁ గొల్చెదను కామితసిద్ధుని "సాయిదేవునిన్"

భక్తపాదరేణువు,
ఈమని వేంకటకృష్ణయ్య
యల్లయపాళెం.

# శ్రీ రామాష్టకమ్॥

శ్రీమత్కాకుత్స్థవంశేన్దుం శ్రీకరంసేవితామరం
రాజీవలోచనంరామం ముహుర్ముహురహంభజే॥
అయోధ్యాపురి నేతారం అజ్ఞానాంధతమోపహం
అవ్యయానన్దపదదం రామంముహురహంభజే॥
కల్యాణగుణసంపన్నం కపర్ధిజపితాహ్వయమ్
కౌసల్యానన్దజలధిం రామంముహురహంభజే॥
చారులక్షణసర్వాంగం చండాంశుకులమండనం
చరాచరజగన్నాథం రామంముహురహంభజే॥
టంకారజ్యారవామాత్ర ఘూర్ణమానమహోదధిమ్
దంభాసురాబ్జమాతంగం రామంముహురహంభజే॥
పంక్తికంఠాద్రిదంభోళిం పావనంపాపశోషణం
భుక్తిముక్తిప్రదాతారం రామంముహురహంభజే॥
యజ్ఞవిఘ్నమరారిఘ్నం యశోవ్యాప్తత్రివిష్టపమ్
యమయాతనవిధ్వంసం రామంముహురహంభజే॥
శాంతస్వాంతంసుప్రసన్నం శ్యామాఙ్గంశర్మదాయకం
శారదాభ్రప్రభాకీర్తిం రామంముహురహంభజే॥

ఇతివర్గాష్టకం రామసంగతంయః
పఠేన్నరః సర్వపాపవినిర్ముక్తం
తతోయాతి పరాంగతిం

# బాలకాండ



క॥ కోసల దేశంబిందున।
భాసిల్లు నయోధ్యయనగ వరనగరము।జి
ద్వాసవరమై। యోధా
గ్రేసర ధామంబయి మహికిన్మణినిభమై

క॥ ఆనగరము దశరథభూ
జానియనన్ భానుకులుఁడు సంతతకరుణా
మానాధీనస్వాంతముఁ
బూని పుడమినేలుచుండె ముదమొదవంగన్

క॥ ఆతనిచేతోవృత్తికిఁ
బ్రీతిగసనవరతభక్తి విస్తృతమతులై
పూతచరిత్రలు సతుల
ఖ్యాతలు సల్లక్షణాన్వితాకారమణుల్.

క॥ కౌసల్యయన సుమిత్రయు
వాసిగఁగైకేయియనగ భార్యాత్రయమా
మానతి భారతి హిమగిరి
జాసతి కెనయనగ సుగుణసంపదనలరున్

క॥ వితరణఖనియగు దశరధ
పతి హితమునసారతంబు పరమార్థముగన్
మతిఁదలచి మెలగుచుందురు
మతిమంతులు మంత్రు లరులమన్మజ్ఞులునై

క॥ హరిదరము వాసి దశరథ
నృపతి యాదరముఁ జేసి నగరరాజంబుల్
విరివిగఁ జరిపించెనోయను,
వెరవునఁ గరినికర మొప్పు వేడుకనపటన్

క॥ సురవరువాహనకులమున
చిరముగ జన్మించి హరిణశ్రేష్ఠగమనమున్
నరకుగొననగునె మనకను
పరువున హరులలరు నధికఘాసురజవతన్

క॥ సురగిరిశిఖరముఁ బోలెడి
యరదంబులపంక్తులొప్పు నప్పురిలోనన్
కరువలిఁ గరములఁ బట్టెడి
వరవీరభటాళి యందువసియింత్రుఁ దగన్

క॥ అప్పురిఁగల యుప్పరిగలు
నుప్పరమును నొరసి నొప్పులొలికెడుపలుపుర్
గప్పుఁగజందునిదుప్పియుఁ
గప్పును విడి మెప్పుఁగలుగు కాంతిన్ జెందున్

క॥ కోరక కుట్మల సుమఫల
భారాధిక నమ్రవక్రపు పాదపతతులున్
భూరిలతాసుమసౌరభ
సారంబై నిష్కుటాళి సంపదలలరున్

క॥ అజునైన మెప్పరచ్చటి
ద్విజులు మందిందిటవులేని వృద్ధుండనుచున్
గజనిర్జరరిపుజిష్ణుతు
భజియించరు చరమవృష్టివాడని రాజుల్

క॥ ఆక్షయధనవర్గములకు
సుక్షయమగు వైశ్యులచట శోభింత్రుఁదగన్
యక్షేశునైన నేలుదు
రక్షణభృతినొసంగి యాదరణమునన్

క॥ హాలముఖసంలబ్ధశ్రీ
విలసిత సౌభాగ్యగరిమ వితరణగుణమున్
ఆలపూర్వభిక్షభైక్ష్యము
సులువుగమాన్పంగలట్టి శూద్రజనంబుల్

క॥ గురుడువసిష్ఠుండు పురం
దరుడుదశరథుఁడు సుపర్వనదిసరయువు స్వ
ర్పురియునుయయోధ్యయని యెం
తురు పరమమునులు విధూతదోషస్థలిగన్

క॥ దిగధశవరపురస్థితి
యగణితవిభవాభిరామమైన యయోధ్యా
నగరంబు నేలుచుండెను
జగతీశుడు దశరథుండు సచ్చరితమతిన్

క॥ వితరణఖనియన దశరథ
పతిఁ బొగడిరి సర్వదేశవాసులధీశుల్
శ్రితవితతి విహితతతియున్
మతిమంతు డుదాత్తు డధికమాన్యుండనుచున్

క॥ రాజతభోగఖ్యాతులఁ
బూజితమైయెసగుచుండఁ బుత్రోదయ స
ద్భాజితయోగముఁ గలుగక
నేజన్మము ధన్యమొందు నిందునుసందున్

క॥ అనిచింతించుచు జనపతి
మనమునఁదనయాభిలాష మల్లడిగొనగన్
వనజభవోద్భవు కులగురు
మునివరుని వసిష్ఠుఁగాంచి మ్రొక్కిటులనియెన్

క॥ అనఘ గృహస్థాశ్రమమున
కెనయగు నాశ్రమముఁగలదె నెందును మఱియున్
తనయయుతంబగుబోఁద
ఘ్నతను వర్ణింపఁదర మె కంజజపుత్రా!

క॥ వరచతురంగబలంబులుఁ
దరుణులు రాజ్యంబు హితులుఁదగుమంత్రివరుల్
విరివిగనుండియు సుతులను
వరభాగ్యముకొఱతఁగలిగె వగపుజనించెన్

క॥ కావున సుతజన్మము నా
కేవిధిఁబడయంగనగునో నేర్పడ మీరున్
దేవునిపై భారంబున
గావింపుడు పుత్రలాభకార్యము నాచేన్

క॥ అనవిని వసిష్ఠసంయమి
మనముననంతయును నెఱిగి మనుజాధిపునిన్
కనిపల్కె రవికులోత్తమ
తనయులుఁగల్గుదురునీకుఁ దథ్యంబనఘా!

క॥ వినుపుత్రకామసవనం
బను యజ్ఞముసేయుమయ్య యచ్యుతుకరుణన్
తనయులుతప్పకఁగల్గుదు
రనయము సంతోషవార్ధియందున దేలఁగా

క॥ అవాక్యము విని నంతనె
భూవరుమన మదధియటుల బొంగి వసిష్ఠున్
భూవిభుధో త్తమ మమ్మున్
భావిశుభప్రాప్తిఁగూర్చి పాలింపఁగదే

క॥ అన మౌని సంతసమునన్
మనుజాధిప ఋశ్యశృంగమౌనివరేణ్యున్
వనితాసహితంబుగ న
య్యనఘుని మఖమునకుఁబిల్వనగును శుభంబుల్

క॥ అని ఋశ్యశృంగుచరితము
జనతికి న్దెలియఁదెల్పిసవనమొనర్పన్
తనయులుఁగీర్తియు సౌఖ్యము
ఘనపుణ్యంబమరు విగతకల్మషయుతమై

క॥ కావున నాలస్యంబిక
గావింపక స త్తతంతుఁ గావింపుమొగిన్
శ్రీవిభుడు మిమ్ముఁ గృప సం
భావించునల దధ్యమింత పరపురదారీ!

క॥ మునిమృదుల మధురసూక్తుల
విని మనుజవరేణ్యుడనియె విప్రోత్తమ! నీ
వనుపునొనర్తు మధీప్సిత
మునమూనత వెలయఁజేయుముసదయహృదయా!

క॥ అనిపల్కి మునికివందన
మొనరిచి తత్సవనమునకు నుత్తమదివసం
బును నిర్ణయింపు మనఘా!
మనుకులపతిమకుటమంజు మణిరుచిచరణా!

కII అనమౌని సంతసమునన్
పనిఁబూని తదర్థములను ప్రారంభింపన్
యనువగు శుభదినమెల్లి య
యని తత్తద్యత్నములకు నమ్మునియరిగెన్.

కII అంతట దశరథపతి య
భ్యంతర మందిరము సొచ్చి యాగోదంతం
బంతయు గులకాంతలకున్
సంతసమందగఁ దెల్పె సరసవిధోక్తిన్

కII ఏమ్మట సరయూతటమం
దమ్మహితాధ్వరము సేయ ననువగునమున్
యిమ్ముగను యాగశాలల
నమ్మునివర్యుండొనర్ప నాజ్ఞనొసంగెన్

కII ఆసవనశాలయంతయు
భాసిల్లె సమస్తవస్తువారము జేతన్
భూసురవనితాతతితో
వాసిగనృప పత్ని మిత్ర వందిజనముతోన్

కII అందమై వెలసెడి సుఖ
సుందిరమున మనుజవరుఁడు మంగళరవముల్
విందుగ సెలగగ శుభదిన
మందుఁ ప్రవేశంబు సేసె నాప్తగణముతోన్

కII సకలామోదంబుగ న
య్యకలంకుఁడు యాగశాలయందు వసిష్ఠున్
సుకరుని ఋశ్యశృంగుని
ప్రకటితముగఁ బూజచేసి ప్రారంభించెన్

క॥ విధివంతమగుచు సవనము
ప్రధితంబై వెలయ విప్రబహుళాహుతులన్
అధికజ్వాలల ననలుడు
బుధనుతుడై భూరితేజమున బెంపొందెన్

క॥ దశరథఋత్విక్కులచే
భృశభక్తిం బిల్వఁబడిన బృందారకులున్
దశవదను బాధలెల్లను
విశదముగ విరించిఁగూడి వినిపించునెడన్.

క॥ వారిజనాభుఁడు శ్రీహరి
వారికిఁబొడసూప నపుడవారిభక్తిన్
వారలు సన్నుతులు సమ
సారమ్ములొనర్చి సంక్తికంతునిబాధల్

క॥ వినిపించిన వైకుంఠుడు
విని తలపంకించి పల్కె వినుడీ యసురుల్
వనజజువరమున దనుజుడు
ఘనకల్మషమాచరించెఁ గడుగర్వితుడై

క॥ నేనీదనుజునిఁదునుమగ
భూనాథునిగర్భమందుఁ బుట్టెదఁబ్రీతిన్
మానవుడనగుచు మీరు, ని
దానం బోకయింతఁదాల్పఁదగుఁజిత్తములన్

క॥ అనిపల్కి తిరోహితులై
చనుదెంచిరి వారు సవనసంస్థలికి నొగిన్
అనలజ్వాలల నాహుతు
లనయము భూసురులువేల్వ నందుజ్జ్వలుడై

క॥ వరపాయసపాత్రంబును
కరములధరియించి యొక్కఁడు దతికరుణన్
నరపతినిఁబిల్చి నీకుల
తరుణులకిమ్మంచు మఱియుఁడగనిట్లనియెన్

క॥ నలువురుతనయులునీకుం
జెలువుగఁగల్గుదురు ధీనసిద్ధము నృపతీ!
విలసితమగు దివ్యాన్నము
వెలయును దైవాజ్ఞదీనివిధమిది కొమ్మా.

క॥ వినయము గుతుకము సంభ్రమ
మును ముప్పిరివడినమనము ముందుకుఁద్రోయన్
జనపతి యంజలిఁగీలిం
చిన కరయుగ్మమును సాచెఁజెందినభక్తిన్

క॥ వరదుడయి వేదపురుషుఁడుఁ
జిరునగవున నృపతిఁగనుచు ఁజేతులఁబెట్టెన్
పరమార్థపాయసాన్విత
వరపాత్రను నంతఁబుష్పవర్షముఁగురిసెన్

క॥ అందఱు నీయుత్సవమును
నందంబుగఁ జూచి పొగడి యానందాశ్రుల్
చిందుపరంపర ఁగురియగ
బృందారకనుతు డదృశ్యవేషమునొందెన్

క॥ అంతట మతిమంతుఁడు భూ
కాంతుడు దశరథుఁడు దనదుకాంతలకునొగిన్
చింతతలబ్ధార్థమును
స్వాంతత నొసగంగఁదలచి భాగములొసరన్

క॥ సగమున్ సిగములో సగమును
సగమందలి సగముఁజేసి సతులకునిచ్చెన్
మిగిలినదాని సుమిత్రకు
జగతీపతి యధికమిచ్చె సాదరమతితోన్

క॥ వారలుఁ బానముఁజేసిన
వారంబులు నెలలుగడువ భారములయ్యెన్
వారలగర్భంబుల సుర
వారారాధితుఁడుఁ బ్రీతి వాసముసేయన్

క॥ మధుమాసముశుక్ల నవమిని
బుధవాసర మదితిఋక్ష పూర్ణోచ్చములం
బ్రథితగ్రహ పంచకమున్
బుధనుత! కర్కటకరాశిఁ బుణ్యాహమునన్

క॥ కోసలనృపసుత. సుతుఁగనె
వాసవనిభుఁ గేకయాత్మ జాత్మజుఁగాంచెన్
భాసుర పుంయమళంబును
నాసుదతి సుమిత్రవడసె నహ్నాక్రమతన్

క॥ రాజిత ధనధాన్యంబులు
భోజనములు వస్త్రములును బొందుగనిచ్చెన్
భూజనముల కవ్వారిగ
నాజిమనంబలరి సుతులనందినకతనన్

క॥ ఈరీతి సుతచతుష్టయ
మారాజవరుండు గాంచియధికప్రీతిన్
వారికి సర్వారిష్టని
వారణముగ జాతకర్మ వారకఁజేసెన్

క॥ వెలయగ శిశురత్నంబుల
లలితుల శ్రీరామ భరత లక్ష్మణ శత్రు
ఘ్నులనన్ వ్యవహారాహ్వయ
ములు నామకరణములొప్ప భూపతిఁజేసెన్

క॥ దినదినముఁ గువలయాప్తుని
యనువున నారాజసుతులు సతులప్రభలన్
ఘనవృద్ధి నొందుచుంటిరి
కనువారి కఖండకౌతుకశ్రీఁ దనరన్

క॥ నిగమోక్తవిధుల సుతులకు
జగతీశవరుండొనర్చెచౌలోన్నయనం
బగణిత వైభవమమరగ
జగతీసురవరులు మిగులసమ్మదమందన్

క॥ గురునొద్దఁజదివి వెలసిరి
విరివిగ నర్థములఁతోడ వేదనిచయమున్
వరరథగజహయులెక్కియుఁ
దురమునఁ బరవీరవతులఁ ద్రుంచి జయింపన్

క॥ రాజిత రుచి శక్తి మతిన్
రాజ కుమారులను మఱియు రాజకుమారున్
రాజకుమారులు మీరిరి
రాజును సంతోషసలిలరాశినిఁ దేలన్

క॥ అంతట నొకదివసంబున
సంతసమున రాజు నిండుసభయందుండన్
అంతకసముడగు మునిజన
కాంతుఁడుం గౌశికుడు రాజుకడకరుదెంచెన్

క॥ పూజించి సేమమడిగిన
యాజింగని మౌనిపల్కె యనఘ మదీయం
బౌజన్న మమరశాత్రవ
తేజంబున దర్శచంద్రదీధితి నొప్పెన్

క॥ విను మంతరాయమొదవెను
దనుజులమర్దించి మఖము దగరక్షింపన్
మనుజాధిప భవదాత్మజు
ననఘుని శ్రీరామచంద్రు ననుపుమునాతోన్

క॥ అనవిని హృదయము ఝల్లన
జనపతి యిట్లనియె మౌనిచంద్రమ! నన్ని
యనువున బరీక్షసేయగ
ననియెదవనితలతు లేక యన్యమొ భ్రమయో।

క॥ రాముడె నాప్రాణంబౌ
రాముడె ధర్మార్థఫలము రాముడె తపమున్
రాముడె పరమపదంబును
రామునిఁబంపుటకు నంతరంగముఁగుందున్

క॥ నేవచ్చి దనుజసముదయ
కావరమడగించి క్రతువుఁగాచెద ననినన్
భూవల్లభుఁగని కౌశికు
డీవిధమునఁబల్కె రోషహృదయస్ఫురణన్

క॥ శతయాగఫలమునొసగె న
హితుడగుఁ గౌశికునకప్పు డినకులుఁడుదయన్
ధృతియాగమొందు నోమక
హితుడగు గౌశికునిదూతె నినకులుడదయన్

క॥ తనయుని నింటనెయుంచుము
ఘనమహనీయాస్త్రసమితిఁగానక రిపులం
జెనకక కఠోరధనువు
ల్దునుమక జాల్ద్రొక్కక శుభదూరుగ నృపతి!

క॥ అనిలేచి నిప్పులురలెడి
కనుగవ నీక్షించి రాజుకంపమునొందన్
మునికులతిలకుండలిగెను
జనులెల్లఁ గృతాంతభీతి సంక్షోభింపన్

క॥ అదిగని వసిష్ఠమౌనియుఁ
హృదయస్థితభయమువాపి యుర్వీశునితో
సదమలమంగళమొదవును
గదలింపుము సుతుని నిపుడ గాధిజుతోడన్

క॥ అనవిని రాముని లక్ష్మణు
ననఘుల నర్కేందుసముల నాత్మజులనొగిన్
యనువుగనంపెను జనపతి
మునిపతి కనలుడిగి మోదమున గొనియాడన్

క॥ పరమశివువెనుక గణపతి
శరజన్ములుఁ జనెడులీల శరచాపములన్
కరములఁదాలిచి నృపసుతు
లరుదుగఁ గౌశికునివెంటనరిగిరి వరుసన్

క॥ సురదుందుభి నినదంబులు
విరివానలజల్లు లపుడు విరివిగఁగనుచున్
వరభావికాలశుభములు
స్థిరమని మదిఁదలచి సంతసించెను బతియున్

క॥ బలయను నతిబలయను వి
ద్యలు శ్రమభయంకరములు నధ్వశ్రమహం
బులు నుపదేశంబొనరిచె
నలఘుమతిం గౌశికుం డనాగతవిదుడై

క॥ తనవెంట రామలక్ష్మణు
లనఘులుఁ జనుదేర వారికటనటఁగల త
ద్వనముల యాశ్రమకథలను
వినిపించుచుఁ బోవుచుండె వింతలుఁగలుగన్

క॥ అటఁజని వారలుఁగాంచిరి
పటుతర భయదాట్టహాస భాసుర గర్జా
ర్భట చటులాకృతి భ్రుకుటీ
తట నటనవికటనిటలను దారుణయక్షిన్

క॥ విశ్వామిత్రునిపనుపున
విశ్వామిత్రను మహోగ్ర విఘ్నక్రతుఘ్నన్
విశ్వంబుసంతసిల స
ప్తాశ్వకులుం డపుడుఁ దాటకాహ్వయఁగూల్చెన్

క॥ అదిగని సురచోదితుడై
పదిలంబుగ జృంభకాది బహుశాస్త్రములన్
ముదమున రామునకిచ్చెను
కదనమున నజేయపదవిఁ గ్రాలగమునియున్

క॥ అంతట మునిసందోహము
వంతలుడిగి యెదురువచ్చి వారక వీరిఁ
సంతసమునఁ బూజించి త
దంతికముననొప్పు కౌశికాశ్రమమునకున్

క॥ కొనియాడుచుఁ జనుదేరఁగ
మునివరసంఘములుఁ దనదుముంగలఁబతినం
దనులు వెనుకనడువఁగ న
మ్మునివరుఁడు విధూతదీనముఖుడై చేరెన్

క॥ అంతట సురమునికోటులు
సంతసిలన్ రాజవరులు సన్నుతులిడగన్
చింతితయధ్వరము నిర
త్యంతరమౌననుచు మునిజనాగ్రణిఁదలచెన్

క॥ బోవన జన్నముజనఁగగ
మారీచసుబాహునామ మదసురరిపుడు
ర్వారముఁ గవిసిన ఋత్వి
గ్ఘోరంబుగ రాముడుగ్రపావకసముడై

క॥ ధీరత మనుజాస్త్రంబున
మారీచునినబ్ధిఁద్రోసి మదమునఁబై పై
దూరుసుబాహుని తద్ధిత
వారంబులఁగూల్చి యనుజవరునితో మెఱసెన్

క॥ మునిసంఘంబులుఁ గౌశిక
దినకులులంజుట్టుముట్టి యెంతయుమోదం
బునదీవించిరి యక్షతు
లని తోషించిరి నుతించిరధికప్రీతిన్

క॥ సవనము యథోక్తవిధిఁజన
నవభృథస్నానంబొనర్చి యమ్మునిరామున్
రవికులతిలకునిఁబలికెను
సవినయగంభీరమధుర సారవచనముల్

క॥ క్రతురక్షణమొనరిచి నన్
క్షితినిఁ గృతార్థతను వెలయఁజేసితి మిథిలా
పతిక్రతువుఁ గాంచఁబోదము
యతులాధిక శౌర్యనిర్జితారాతిచయా!

క॥ విని సుస్మితవదనుండై
మునివరునకు మ్రొక్కి సకలమునులు నుతింపన్
మనుకులులు జనకుసవనముఁ
గనువేడుకనొప్పిరంతఁ గౌశికుఁడు దగన్

క॥ మునిసంఘపరీవృతుడై
వనజాక్షుఁడు రాము డగ్రభాగము నడువన్
కనిశకునంబుల మునిసతిఁ
గనుశుభబుంచెదనుదలచి కదలెన్ మునియున్

క॥ వారలుఁజనుచుండినడ
దారింబడియున్నబండ దశరథసుతుపై
మారుతముసోక వింతగ
మారమణీరూపవిజిత మానినియయ్యెన్

క॥ అందఱు నివ్వెరఁజెందగ
సందర్భముఁదెలియఁదెల్పె సంయమివరు డీ
సుందరి గౌతముసతి సం
క్రందనుహేతువున శాపకలితగనయ్యెన్

క॥ శ్రీరామునికారణమున
వారిజదళనేత్రి కలుషవారితయయ్యెన్
భూరిదయానిధియగు నీ
వీరునికిన్ మాఱికలదె పృథ్వీస్థలిలోన్

క॥ ఆమౌనిసల్కు విని తరు
ణీమణిమునిరాడ్వధూటి నిస్తులసుగుణో
ద్దాము దయాధాముని శ్రీ
రాముని నుతియించెఁ బ్రీతిరమ్యార్థములన్

క॥ నీపాదరజము మాపుక
శాపోపలగాత్ర తాపశమనముఁ జేసెన్
నాపాలిదేవుడవు నీ
ప్రాపున విఖ్యాత లోకపావననైతిన్

క॥ అనివలగొని శ్రీరాముని
వినయమున ననుజ్ఞ వేడి వెడలు నహల్యా
వనజాక్షిఁజూడ గౌతమ
ముని యాగమనంబుఁజేసె ముదితహృదయుడై

క॥ వచ్చిన సచ్చరితునిఁగని
హెచ్చినకౌతుకము మెఱయ నినకులుఁడు మునుల్
అచ్చపుబత్తి సెలంగ వి
యచ్చరచయ మెదను మెచ్చ నర్చించిరొగిన్

క॥ అంతట నిజేశుపదముల
కెంతయు సద్భక్తిమ్రొక్కి యిట్లను బతితో
నింతి నితాంతదయానిధి
సంతతశ్రితపారిజాత శరణు మహాత్మా!

క॥ అనముని కనికరమున సతిఁ
గని కరమునఁగరముఁగూర్చి కరమొప్పగ నీ
దినమణికులతిలకుని రా
ముని చరణపరాగగర్భమున జనివగుటన్

క॥ ప్రకటిత పూతచరిత్రవు
సకలంకవు నై తివింకననియమ్ముని రా
జకుమారులఁ గీర్తించుచు
ముకురాననఁ గూడి యేగె మునులునుతింపన్

క॥ అంతట మునిబృందం బిడి
యంతయుఁ దిలకించి రామునంతికమునకున్
వింతఁదళు కొత్త వేఁజని
సంతసమునఁ బల్కిరిట్లు సమ్మతసూక్తుల్

క॥ మునిజన కంటకఁ గూల్చితి
ముని సవనముఁగాచి తమృతభుగ్గణమొప్పన్
మునిసతిని నుద్ధరించితి
మునికైరవ సోమ! రామ! భూపలలామా!

క॥ ఇటుఁ బొగడుచు జనకకుభృ
త్పుటభేదన సరణిఁబట్టి పోవుచునుండన్
యటవీగమన శ్రాంతికి
నట జటిలోటజ సువార్త లానందముగన్

క॥ వినిపించుచు మనుకులులకు
మునివర్యుఁడు కుశికసుతుఁడు ముందుగనడువన్
వినికని తనియుచు వెంటనఁ
జనుచుండిరి రాజసుతు లచంచల పధులై

క॥ చనిచని కాంచిరి బుధజన
వినుతంబై శక్రనగర విభవవిజితమై
ఘన యోధవీర భట గణ
వనపంక్తులఁగరుల హయల బలసిన మిధిలన్

క॥ కనిచొచ్చి నగరపై భవ
మును జూచుచుఁ బోవుచున్నమునులకు నెదురై
చనుదెంచి జనకజనపతి
వినయంబునఁ బూజసేసె వివిధ స్తుతులన్

క॥ అంతట మునిపతి ధరణీ
కాంతునిఁ కరుణార్ద్రదృష్టిఁ గనుగొని నృపతీ!
సంతసమె నీకు హితసా
మంతులకున్ బంధువుల కమాత్యజనులకున్

క॥ నావిని జనకుండిట్లను
తావక దర్శనము సకలధన్యత్వంబున్
గావించెఁ గొఱతకలదే!
భావి శుభప్రాప్తకాల భాగ్యోదయమై

క॥ అనిపల్కి మౌని మండల
మునకు న్వందనముఁజేసి ముదిత హృదయుడై
వినయాన్వితుడై మందిర
మునకుం దోడ్కొనుచుఁజనియె మునులన్నృపజులన్

క॥ అందఱ నుచితాసనములఁ
బొందుగఁ గూర్చుండఁజేసి పొలుపుగ మునిసం
క్రందను నిట్లను జనపతి
సుందరు లీ బాలు రెవరిసుతులు మహాత్మా!

క॥ నావిని కౌశికమునివరు
దీవిధమునఁబల్కె జనకన్పపతీ! యనఘా!
ధీవిభవుడైన దశరథ
భూవల యాధిపుని యాత్మపుత్రులు వీరల్

క॥ శ్రీరాఘుడు లక్ష్మణుడన
వీరలనామములు మఱియు వీరిలో జ్యేష్ఠం
డీరాముడు వీరాగ్రణి
సారబలుండనగ నెగడు సత్యవ్రతుడై

క॥ రక్కసిమేటులఁ దెక్కర
జక్కడచి మదధ్వరంబు సంరక్షించెన్
ఘుక్కంటివిల్లుఁ గనుగొన
నిక్కడ కేతించిరిపుడు నినకులతిలకుల్

క॥ ఇనకులులని విని కనుగొన
జనకుని కన్గవ విశాలసంస్థితి నొందెన్
ముని ధనువుఁజేర్కొనంగను
దనమన ముప్పొంగి బాష్పధారలు గురిసెన్

క॥ ఈ మహనీయుడు సులభుడె
మా మకజామాతయగుట వారివిధానం
బేమేమి తపముసల్పెనొ
యామహిత తపంబులేక నందగవశమే

క॥ శ్రీరామా హృత్పంజర
కీరంబై వెలయు చక్రి కిల్బిషమెల్లన్
వారించి శూలిధనువును
శ్రీరాముఁడు నెక్కువెట్టఁజేయుం గాతన్

క॥ అనితలచి శరభవసముల
ననుపమ బలయుతుల నంప నధికక్రమలన్
కొనితెచ్చిరి భవుధనువును
ననిశము బూజితసుమాళి సలరెడుదానిన్

క॥ అంతటః బురమున నాలుగు
చెంతలఁ గోలాహలంబుఁజేయుచు జనముల్
వింతలుఁగన జనుదెంచిరి
సంతసమున రాజసభకు సత్వరగతులై

క॥ విల్లెక్కు-బెట్టునట భూ
వల్లభుని కుమారుడంట వలరాజును దా
నొల్లడట రూపసంపదఁ
బిల్లండట చూడ వానిపెంపదియేమో!

క॥ ఈఃరీతి రాకుమారులు
హోరాహోరిగను బోరి రొంపక విల్లున్
తేరయినఁ జూడనోపక
పాఱిరి వీడెట్లుజేయఁ బాల్పడునొ గదే!

క॥ ఇతడైన జనకపతి వాం
ఛితమును సమకూర్చునేని క్షితితలమందున్
బ్రతిలేక వెలుగుచుండును
పతిసత్యవ్రతము నేడు ఫలితమునొందున్

క॥ అని పౌర జానపదముల
జననికరము నులివుఁగ్రమ్మె సభనెల్లెడలన్
మనమున హర్షంబెసగగ
ననువున నందఱునుజేరి రాయాయెడలన్

క॥ రాజులు రాజకుమారులు
రాజద్వేషములనలరి రాజసమొప్పన్
తేజోధికులై వచ్చిరి
భూజనములు సన్నుతింప భూరివిభవతన్

క॥ భాసుర చకోర నేత్రలు
నాసన్నసుధావిరాజి తాంతఃపురమం
దాసీనలై రి ముదమున
వాసవనిభు రాముఁ జంద్రవదనుం గనుచున్

క॥ నీలాలక భూబాలిక
శ్రీలీలన్ వెలగుచెల్వ స్మేరాస్యముతోన్
బాలేందుఫాల సుగుణా
వాల సరోజాక్షి సీత వారలనడుమన్

క॥ తనుఁజెలులుఁగొలువ వాతా
యనమార్గంబున నగపడు నతనుసురూపున్
మునిగణసంయుతు రాముని
నినవంశునిఁబూజసేసె దృఙ్నలినములన్

క॥ జనపదపురజనములతో
మునివరగణ రాజరాజ పుత్రులతోడన్
ఘనతరవైభవములతో
జనకునిసభయొప్పె మఘవుసభకెనయన్

క॥ సమయవిదుండగు నాసం
యమిపతిఁగనిపల్కె నింకనాలోచనయే
ల మహాభృచ్చాపునిచా
పము, నెక్కిడు నుత్సవంబుఁ బాలింపుటకు

క॥ ఆనవిని వినయాన్వితుడై
ధనువునుపూజించి విధిహితంబుగ రాజున్
వినఁబల్కె జనకజనపతి
వినువారికి వింత భీతి వేడుకలొదవన్

క॥ ధను వెక్కుఁబెట్టఁగలిగెడి
జనపాలకవరుఁడు జనకజామాతయగున్
ధనువెక్కుఁబెట్టఁజాలని
జనవరమండలికి జనకజా మాతయగున్

క॥ పతిబర్హి వాక్యరవము నృ
పతిభోగిశ్రవణ రంధ్రఖాగముఁ జొరగన్
ధృతిఁదూలి వక్రగములై
యతిదీనంబడర బ్రతుకనరిగిరి పెలుచన్

క॥ కొందఱుఁదెంపువహించిరి
కొందఱుదరిఁజేరి కాంచి గొంకిరితమలోఁ
గొందఱు గుసగుసలాడిరి
కొందఱు నిరపేక్షసూక్తిఁగొనిరి యచలతన్

క॥ అందఱ ఛందముగని పతి
సుందరు మునిబృందసంస్థు శోభితు రామున్
డెందంబలరగఁగని యా
నందముమదిఁబొందఁ దపసినాథునిఁ గాంచెన్

క॥ అంతయుఁదెలిసినముని తన
యంతికముననున్న దశరథాత్మజు రామున్
కంతుజితరూపుఁగనుగొని
కంతుజితశరాసనంబుఁ గంటిదెవత్సా!

క॥ ధనుభిదుదర్శనము షే
దినిభృన్నివహమును వీతధీరులఁజేసెన్
వెనుకైరి వార లింతకుఁ
జనుదురె నీవొకడుఁదక్క శతమన్యునిభా!

క॥ లెమ్మా తడయకు శుభమగు
గొమ్మయీయుగ్రధనువుఁ గుతుకంబెసగన్
తెమ్మా చిరతరకీర్తిని
నిమ్మా సమ్మదము మాకు నినకులతిలకా!

క॥ అనిబలుకుమునికి వందన
మొనరించి శ్రీరాము డాత్మనొప్పుగ జననీ
జనకులను సంస్మరింపుచుఁ
జనె మదగజగమనలీల చాపస్థలికిన్

క॥ వెలయఁజిఱునవ్వు మోమున
వలనుగఁజని ధనువుఁగాంచి వసుధాధిపతుల్
చులకనఁదనుఁగనఁగనుచున్
వలువను మొలనమరబిగిచి ప్రత్యావీఢన్

క॥ రఘుకులు డుగ్రధనుస్సును
లఘులీలన్ గుణముఁగూర్చి లావుగలాగన్
మఘపుకరి చెఱకుతుంటను
లఘుగతిమెఱయంగవిఱుచులాగున విఱిగెన్

క॥ ధరఁగదిలె నొఱగెగిరులును
సురవతిఘూర్ణిల్లె నుదధి యూగెదిగిభముల్
దరగదిలె లోకమంతయు
హరధనుపునువిఱువ రఘువరాగ్రణిపెలుచన్

క॥ ఆరావము విలయాంబుద
ఘోరరవమ్మనుకరింప గుండియలవియన్
చేరగిలనొరగి రాసన
వారము లాధారమగుచు వసుధాధీశుల్

క॥ ఆరావము జనకుని హృద
యారామశుకస్వనంబు ననుపై చెలగన్
ఆరావము సీతాముత్ప్రే
రితమై వీనుగవకు విందొనఁగూర్చెన్

క॥ రుచిరస్మితరుచి నిచయా
విచలిత జిత చంద్రబింబవిధమై యొప్పన్
సుచరిత్రులు రఘురాముని
నబలాలోకనసుమాళి నర్చించిరొగిన్

క॥ కని పతి ముదమునఁ జనియా
జనపతిపసుతుని రామచంద్రునిఁ బ్రియమున్
వినయముఁ జెనగొన నిట్లనెఁ
గనుగవ నానందబాష్పకణములు దొరగన్

క॥ మనసున కగోచరము త్వ
ద్ఘనతేజ మమోఘ మప్రధర్ష్య మచింత్యం
బనివార్య మనిర్వాచ్యం
బనిమిషపుంగవునికైన నలవియె పొగడన్

క॥ విను "వీర్యశుల్క" యనినా
తనయవివాహమునుగూర్చి ధారుణిజనముల్
వినఁబలికిన నాప్రతినం
బనఘ భవత్కృపను సఫలమయ్యెను నిపుడన్

క॥ అనిమౌనిఁ జూచి దశరథ
జనపతి కీశుభప్రవృత్తి జవగతిఁ జని నా
మనవినొనర్చ నయోధ్యకు
బనిచెద మద్బంధువృద్ధవరుల సచివులన్

క॥ అనిబల్కు జనకుమధురో
క్తి నివిని జనకునిఁగనంగ దివ్యసమయమిం
దొనఁగూడెననుచు మనముల
ఘనకౌతుకవంతులైరి కాకుత్స్థవరుల్

క॥ జనకుని పల్కులువిని తమ
కనువగుమార్గములఁజనిరి యవనీపతులున్
మనుకులుల మునుల హితులన్
ఘనకౌతుకదృష్టిఁబఱపి కడు కుతుకమునన్

క॥ అంతటను జనకజనపతి
సంతసమందుచును బెండ్లిఁజాటం బంచెన్
వింతఁదఱకొత్త ప్రజలకు
వంతలుడిగి వారలెల్ల వచ్చిరిసభకున్

క॥ జనకుని పనుపుననరిగిన
ఘనభటులు నయోధ్యకేగి కాకుత్స్థుని పెం
డ్లినకులతిలకున కంతయు
వినిపించిరి వేడ్కలొదవ విగతశ్రములై

క॥ మఱియును వారివలన సొం
పెఱయంగా తాటకాది భీమాసురులన్
కఱకుశరములను జదిపిన
నెఱితత్తద్గాథలన్ని నేర్పునవినగన్

క॥ కని పౌరజానపదులను
ఘనమంత్రుల హితుల సుతుల గాటపుప్రేమన్
మనఘునఁదలచినవారల
జనకుని ప్రోలునకునంపె సమ్మదలీలన్

క॥ కాంచనరుచి నొప్పారుచు
నంచితముగ రత్నఖచితమై యొప్పెడి య
క్కాంచన రథంబు నెక్కియు
బంచద్వయరథుఁడు వోయె బహుబలయుతుడై

క॥ దశరథపృథివీపతినిఁ గని
భృశభక్తి నమస్కరించి ప్రేమాన్వితుడై
దశరథునిసఖుడు జనకుడు
విశదంబుగ నెదురువచ్చె వీతాఘుండై

క॥ అందఱు మునులును శిష్యుల
నందఱతోఁగూడివచ్చి రచటకువేడ్కన్
క్రందుగ వీతెంచెను శుభ
మందంగ సుమంగళాది ధ్వను లపుడచటన్

క॥ సురుచిర తోరణయుతమై
విరివిగఁ జెన్నలరునట్టి వివిధపుఁజేతల్
వరమఘువు సభకు నీడుగ
బరిచారికవరులొనర్చి రతిభాసురతన్

క॥ ఉత్తరఫల్గుని గూడిన
యుత్తమదివసంబు మిగులయోగ్యంబని ర
త్యుత్తమ మునివరులందఱుఁ
జిత్తములందలంచి పెండ్లిసేయగ నపుడున్

క॥ ఘనుడు వసిష్ఠుడు మఱియును
ఘనుడు శతానందు డపుడు ఘనమగుపటిమన్
మనమున ముదమొదవంగా
వినిపించిరి వంశజనుల వీర్యగుణములన్

క॥ భూసుర కేసరులందఱు
భాసురముగ వేదఋక్పఠనము సేయన్
వాసికినెక్కిన రమణులు
నాసమయంబునను బల్కులాడిరి లీలన్

క॥ రాముని నొకపీఠంబునఁ
బ్రేమన్నివసింపఁజేసి వేదికలోనన్
భామామణులలో మణియగు
రామప్రియ సీత నపుడలంకృతి నెసగన్

క॥ శుభలగ్నంబగు సమయము
విభవంబుగరాగ నపుడు వినయస్మితుడై
యిభరాజగమనకంఠము
శుభమాంగల్యంబుచేత శోభగఁజేసెన్

క॥ భరతునకును లక్ష్మణునకుఁ
వరశత్రుఘ్నునకు నపుడవారితశోభన్
వరుసగ మాండవి యూర్మిళ
మఱియును శ్రుతకీర్తి నపుడు మానుగనొసగెన్

క॥ నలుగురు బలికిరి ధరనా
నలుగురుసోదరులఁగరము నవ్యస్ఫురణన్
నలుగురుఁబలికిరి ధరలో
సలలిత మతి దాన వహన క్షాంతుల కెనయన్

క॥ పూతచరిత్రుఁడు జనకుడు
చేతోమోదంబుతోడ శీఘ్రముఁగాగన్
నీతిపథంబున సుతలకు
నాతతముగ సైన్యమాది యరణములిచ్చెన్

క॥ ఆరమణుల నట్లంపియు
శూరమణుడు వారిపై నిమోహంబున్
ర్వారమగు దుఃఖమందెను
నారయవిజితేంద్రియత్వమందియు

క॥ జనకజనంయుక్తుండై
జనకుండగు దశరథుండు సమ్మోదిం
జనపతిరాము డయోధ్యకు
జనములువినుతింప మిగులజవశతిఁ

క॥ మధ్యేమార్గంబున దిన
మధ్యందగు సూర్యుఁబోలి మహనీ
యోధ్యగమనాభిలాషిగ
సధ్యయనము సేయు భృగుకులాధిపుఁ గ

క॥ ఇంతలో రఘురామునిఁగని
గంతులువేయుచును రేణుకాదేవిసుతుఁ
దంతయునెఱింగెఁ గావునఁ
గంతుజితునిఁబోలు నన్నుఁ గదనము

క॥ జయలక్ష్మిం గొనినప్పుడు
నియమంబుగ నేసునిన్ను నేర్పుగవిడ
దయతో నేగెద మంచును
రయమునదగ్గరిస రాజు రామునిడాగన్

క॥ భార్గవరాముండప్పుడు
మార్గంబున నెదురువచ్చు మహిమమునెఱి
ద్వర్గదమనుడగు రాము డ
నర్గళవాక్పటిమమెఱయ దగనిట్లనిమో

కll నాపేరురాముఁడందురుఁ
భూపాలకగర్వహరణ బుధనుతశీలా!
కోపింపక మీచరితము
నేపారగఁదెల్పు మిపు డనిందితచరితా!

కll అని రామవిభుఁడు సెప్పిన
సునయోక్తుల కాత్మనలరి చూడీవిల్లున్
ధనువుబలముఁ గనుగొనుమని
యినవంశునినాజ్ఞసేసె నింపుగనపుడున్

కll శ్రీరాము డతనివింటినిఁ
గోరికతోఁజేతధీసికొనుసంతలో ని
స్సారంబయ్యెను నదియు
న్నారాముని సత్త్వమెల్ల నాకర్షింపన్

కll కని రాముడు రాముస నతి
ఘనమోదముతోడ నిట్లుఁగనుగొని ప్రేమన్
ఇనకులజలనిధిచంద్రమ
విను నీ ఘనజన్మమింక వృద్ధినిఁగాంచున్

కll మదమునఁగదలిన రక్కసి
కదుపులఁబెక్కురను నీవు కదనములోనన్
మదమణచి త్రుంచిఁవైతువు
విదితంబుగఁగౌశికుండు ప్రేరేపింపన్

కll అని భృగుకులనిధిముఖ్యుఁడు
వినయంబున రఘుకులాబ్ధివిధునికరము నీ
డ్కొని వెస హిమగిరికరిగెను
కనుగవ నానందబాష్పకణములురాలన్

క॥ అంతట రఘురాముడుఁదన
యంతికముననున్న ప్రజలనడిగి రయమునన్
సంతోషితుడై నిజశ్రీ
మంతంబగుఁ బురమునొచ్చె భటనివహముతోన్

క॥ వచ్చిన సచ్చరితునిఁగని
హెచ్చినకౌతుకముతోడ నినకులవరుపై
ముచ్చటలుఁదీర పౌరులు
నెచ్చెలులును గుసుమవర్షనివహముతోడన్

క॥ పూజించి సేమమడిగిరి
భూజననందితునిమిగుల భూసుతఁబ్రీతిన్
సౌజన్యధనుఁడు రాముఁడు
తేజముతోఁజెప్పెఁ దనదు తీయనిగాథల్

క॥ ఈరీతి సుగుణచరితుఁడు
శ్రీరమణింబెండ్లియాడి చెన్నొందుచు వి
స్ఫారిత బహుసుఖలీలన్
వారమ్ములు నెలలుగడువవచ్చెనునంతన్

"బాలకాండము—సంపూర్ణము"

# అయోధ్యా కాండము

ఉ॥ శ్రీరఘురాముని న్విమలశీతమయూఖునిఁగేరు నెమ్మొగం
బారమణీయమై కలుగువాని దినేశ్వరసూను నంగదు
న్నారసిబ్రోచి ముఖ్యకపినాథులకెల్లను దోడునీడయై
పేరిమిఁగన్నయట్టి రఘువీరుని నెప్డు భజింతు నామదిన్

ఉ॥ అప్పుడుఁబెద్దవాడగుచు నన్నిపనుల్వేసఁజేయలేక యా
గొప్పదియైన రాజ్యమునకు న్ఘనునెవ్వని రాజుఁజేసెదన్
ముప్పునఁగాలకింకరులు మూగకమున్న రయంబున న్ఘనుల్
యొప్పుగఁజెప్పరయ్య సుగుణోన్నతులార! కృపాగరిష్ఠులై

ఉ॥ ఇట్టిప్రశ స్తశేముషివిశేషపుఁబల్కులు మౌనులందఱున్
గట్టిమనంబుతోడవిని కాయజసన్నిభు శ్రీరఘూ త్తమున్
పట్టముఁగట్టుమంచు నతిప్రార్థితులై తెలియంగఁజెప్ప న
ప్పట్టునవచ్చె దాశరధి ప్రస్ఫుటవేగపదారవిందుఁడై

॥ వచ్చినరాజనందను నవారితవాక్కుసుమాళితోడ నే
ర్పచ్చుపడంగ దీవనలుబాగుగఁజేసి ప్రసన్నచిత్తులై
ముచ్చటఁగొల్పుచున్న రఘుపుంగవుతో జనకుండు నిన్ను నే
మచ్చటికంబులేక యుపపట్టముఁగట్టఁదలంచె నాపుడున్

॥ రాజును నేడువేడుదుఁదిరంబుగ నేను భయంబుతోడుతన్
మోజులుదీఱ మ్రొక్కెద నమోఘవదస్కుఁడనై వచించెదన్
భ్రాజితమైన రాజ్యమునభారము నాకుఁగనంగ దుఃఖమౌ
నోజననాధ! నేను విముఖుండను దానికిఁబ్రస్తుతంబునన్

ఉ॥ నాపుడు రాజచంద్రుడును నావిధమంతయుగు త్రైలింగి మే
ధావియు బ్రహ్మపుత్రుడునునైన వసిష్ఠునిఁబిల్వనంపి స
భావితపుత్రువాక్యముల పద్ధతిఁజెప్ప నతండు రామునిన్
వావిరినొప్పగింప పరపట్టణమంతయు నందితంబుగన్

ఉ॥ రాజిత ముఖ్యవస్తునికరంబులచే నగరంతయున్ సుశో
భ్రాజితతోరణాది ఘనపల్లవ నామ ఫల ప్రదీప్తిచే
భూజననందనీయమయి పొల్పగుచుండె నయోధ్యయప్పు
రాజులలోన మేటియగు రాము పట్టమహోత్సవంబునన్

ఉ॥ జక్కవఁబోలు చన్గవయుఁ జక్కని స్వచ్ఛ సుదంతపంక్తి
మొక్కలువోని బాహువుల మాపువపుంద్వితయంబుఁగల్గి
పెక్కుచు ముగ్ధలంత రమణీయులునౌ మగవారుఁగూడగ
యక్కరుణాబ్ధి రామవసుధాధిపుఁగాంచిరి వేడ్కమీఱఁగన్.

ఉ॥ బంధులఁగూడి నవ్వులను భాసుర మిత్ర కళత్రకోటిచే
సంధిలుచుండ నోర్వక సభాసమయం బరుదెంచునంతటన్
"మంధర"నామ వక్రతరమానిస కైకరుదాసి యేమ్చను
న్నంధకటి ధ్ధనూ సుగుణఖండనుతీరును జెప్పెఁ గైకకున్

ఉ॥ కైకయు దానికి న్మిగులగర్వముఁజెందుచు దాసిఁదిట్టుచున్
లోకప్రశస్తనీయ ఘనగాథచరిత్రుఁడు రాముడెంతయున్
నాకనుజూడ మిక్కిలిగ నవ్వునవచ్చుచునున్నదిప్పు నీ
వాకొసనట్టి సర్వవిధవాక్యపరంపర విన్ననాపుడున్

ఉ॥ ఓసివిమూఢురాల విను మోహితఁబట్టి మదీయవాక్యముల్
భాసురరత్నసంఘటిత భవ్య వినూతన రోచితాల నం
త్రాన సురారియూథనికరంబునుగల్గు కిరీటరత్నముం
నీసుతునౌదలన్నిడక నీదుసపత్నిజుకిప్పనోర్తువే

ఉ॥ కావున నీవు శీఘ్రముగఁ గాంతునియొద్దకు నేగి నీకును
న్వావిరి యుద్ధమందిడిన భవ్యప్రసాదవరద్వయంబు నే
డావిధమొప్ప వేడు ప్రకటంబుగ నేడు నవీనభక్తితో
నావిభుడిచ్చు తప్పకను ఆతనికి న్ఘనప్రేమ నీపయిన్

ఉ॥ పంతముఁబూని వేడ్కఁ జెలిమంథరచెప్పిన వాక్యజాలమున్
సంతసమందగావిని ప్రశాంతమనఃకమలంబుఁగల్గి యా
కొంతనెయున్న భూవిభుని కొల్పగుచు న్వహరత్నదీప్తిమ
ద్దంతిపురంబు సొచ్చె జనులందఱు విస్మయమందిచూడగన్

ఉ॥ అక్కడ రాజ్యభార జనితాకుల సంవృత చేష్టుడై విభుం
డొక్కెడ మోహమువాంచి పెనుమూగిననిద్రఁ బరుండియున్నచో
నక్కమలాక్షి కైక నిజనందను బట్టముఁగట్టుబుద్ధిచే
నొక్కసులిప్తకాలమున నొప్పగ రాజునుమేలుకొల్పితాన్

ఉ॥ వచ్చినకార్యమంతయును బాగుగఁజెప్పి వరద్వయంబునున్
మచ్చికతోడఁదెల్పియను మానములేక ఘనుండు రామునిన్
అచ్చపుఁ గాననాది ఘనవాసునిగాఁ బదునాలుగేండ్లు ఏ
కొచ్చెములేక నీభరతపుత్రునిఁ బట్టముఁగట్టుమంచనన్

ఉ॥ ఓ కఠినాత్మురాల! వినుమోపికఁబట్టి మదీయవాక్యముల్
నాకుమనంబుఁగల్గునె జనాధిపసూను నరణ్యభూమికిన్
ప్రాకటఁమొప్పఁబంపగను బట్టణపౌరులకిష్టమౌనె నీ
వాకొనునట్టికోరిక ధృవమ్ముగనీచము ఎల్లవారికిన్

ఉ॥ రాముఁడె నాకు నేడుగడ రాముఁడె సర్వఫలప్రదాతయున్
రాముఁడె నాదుజీవనము రాముడె నాకులదైవతంబు నా
రాముఁడె నాకు ముక్తిదుఁడు రామునివీడి వసింపఁజాల నో
తామరసాక్షి! రామగుణధామునిఁ బంపగలేను గానకున్

ఉ॥ నాథుని పుత్రవత్సలత నాతనిమోహపరీతవాక్యము
ల్బాధగనుండె నామెకును ఱంకులకు న్ఘనవాక్కుఁబట్టునే
బోధనసేయ దుష్టునకు బుద్ధియుఁగల్గునె యంత నామె యా
రాధిత సర్వభూషణ విలాసములన్నిటిఁదీసి సత్వరన్

ఉ॥ కోపగృహంబుసొచ్చి యలగూనిది మంథరతోడఁగూడి సం
తాపభయాస్పదప్రకటితంబగు కంకటపైఁ బరుండియున్
భూపతిరాకఁగోరు చౌకమూలన నిద్రమునింగియుండె నా
పాపపురాజు సూను వరపట్టముఁగట్టడటంచు దూఱుచున్

ఉ॥ ఇట్టిది రామచంద్రపరు డెంతయువింతగ నూహఁజేయగన్
పట్టెను పంతమంచు విని మానినిఁగూడగఁజేరి యట్టులే
గట్టిమనంబుఁగల్గి యికగాటపునీకొమరున్ రయంబునన్
పట్టముఁగట్టుకొమ్మని యపారముదంబున వచ్చిచెప్పెనన్

ఉ॥ ఆసుతుఁదీయమాటలకు హర్షతరోల్లసదాననాబ్జయై
యాసతిపల్కె నట్లె విభునానతి వేగమె నీవు ఎల్లి సం
త్రాసమదేభసింహఘనదంబు సుఘోరవఘోటకాది ఘో
రాసుసమండుచోటికిఁ గరంబుగనేగుము సంతసంబునన్

ఉ॥ అంతటభర్తచెంతకు ముదంబునఁబోయి వినీతినిట్లనున్
వంతనుమాని రాముని నవారితబాహుబలాఢ్యు తప్పక
న్నంతిపురాసనుంచక వనంబులనుండగఁ బంపగావలెన్
చింతిల కింక కోర్కెనతిశీఘ్రవిధంబుగఁదీర్పు నాపుడున్

ఉ॥ తిన్నగలోనికేగి ఘనతీవ్రతరంబగు వంతఁగుందుచున్
యన్నవబోఁడిపంక మటియాత్మజువంక విశాలదృష్టితోఁ
గ్రన్నఁజూడ్కినిల్పి యతికష్టఁబల్కులుపల్కలేక చే
సన్నల రాముఁబిల్చి యతిసాంద్రదుఃఖనిరుద్ధకంఠుడై

ఉ॥ రామగుణాభిరామ దినరాజకులాంబుధిసోమ నీరద
శ్యామ ప్రియురాలితోడుత వెనన్వెను నీవు నరణ్యవర్తివై
నీమముమీఱఁబోయి ఘననిష్ఠతో నీపదునాల్గుఅబ్దముల్
ధామసుకీర్తిఁబొందియును తండ్రియనుజ్ఞను గోలుపున్పకన్

ఉ॥ ప్రేమముమీఱ నందునలరించి యతీశ్వరకోటికి న్భవ
న్నామసుకీర్తనాదు లనుమానములేక పఠించువారి క
ద్దామసుఖంబులిచ్చి యతిధర్మపుఁబద్ధతి వీడకెప్పుడున్
మామకపట్టణంబుఁ దరువాతనుజొచ్చుము వేడ్కమీఱగన్

ఉ॥ ఆసమయంబుగుర్తెఱిగి యన్నఁడుఁదోడుగనేగుదెంచె ధీ
భాసుఁడు లక్ష్మణుండును శుభప్రదమంచును మాతయొద్దకున్
హాసముఖాబ్జులై యరిగి యంతయుచంత సువంత దాపకన్
భాసురమొప్పఁజెప్పఁ దెనువాతహతి న్పడు వృక్షభాతిగన్

ఉ॥ లక్ష్మణుతల్లియు న్మఱియురామునితల్లియు నీవిధానమున్
సూక్ష్మముమీఱ గుర్తెఱుగశోకభరాకులితాంతరంగలై
పక్ష్మలలందు వేడియగువారిచుఁ బోరనఁ గారుచుండ నా
సూక్ష్మములైన కౌనులును జూడ్కికగోచరమై చలింపగ

ఉ॥ ఆసమయంబున న్భరతు డాతనితమ్ముఁడు పట్టణంబునుం
బాసియు మున్నుగా తనదుమామగృహంబునఁ బోయియుండుటన్
ఆసతి యట్టిఘోరమగునట్టిపను ల్నొనరించెఁగాని యా
యాసీసుమంతలేని గుణశీలుఁడు నాభరతుండునోర్చునే

ఉ॥ అందఱునార్తిఁజెందిరి రయంబున సోదరులందఱు న్కడున్
చిందరవందరైరి మునిసేవిత రామవియోగవార్ధిలోఁ
గుందుచు వ్రాలుచు న్పడుచుఁ గొంకుచుఁ బొంపిరిపోయి రట్టిసం
క్రందనసన్నిభు న్రఘువరాగ్రణి కాననవాసచర్యకున్

ఉ॥ కాంచనరత్నదివ్యమణి క్రసుదీధితులన్నివీడి ము
న్నంచితవల్కలంబులు ఘనంబుగఁదాల్చి సఖుల్కలంగగన్
నించినదుఃఖమందు జననీజనకుల్ వెతలందుచుండగ
న్నంచలవాహ శర్వ దివిజాధిపవంద్యుఁడు రాముడెంతయున్

ఉ॥ అప్పుడు రాముడేగుసమయంబునుజూచి భయార్తచిత్తయై
యెప్పుడు నెక్కడ న్విభుని నేనుఅకన్పడియించుచుండుఁదా
నప్పుడు లేచివచ్చి జనకాధిపనందన మోమువాంచగన్
ముప్పిరిఁగొన్నతోషమున భూపతిసూనుఁడు రాముడిట్లనెన్

ఉ॥ నిండుగఁదెల్పికొంటి విను నీరజహంసలుఁగూడియుండుట
న్మండితమైఁదనర్చు ఘనమాన్యతనొప్పు కొలంకులేద యా
చండతరోగ్ర ఖడ్గ వరసామజ సింహ వనంబులేద యిం
దుండుము నీవుఁదోషముననొప్పి నవాంబుజచారులోచనా!

ఉ॥ అన్నవిధంబుఁదానెఱిగి యాతనితమ్ముఁడు లక్ష్మణుండునున్
తిన్నగవచ్చి నిల్వఁబడి తియ్యనిమాటలఁ బ్రస్తుతించి య
త్యున్నతదీర్ఘమైన కరయుగ్మము ఫాలమునందిమిడ్చి సీ
తన్నవిధంబున స్తనదుయాగమనంబువచించ రాముడున్

ఉ॥ బాగుగవారిరాకకును భావమునందునఁ దోషమంది సం
యోగనిజాబల స్మృతియు నొప్పగ లక్ష్మణుఁగూడిరాగ వే
వేగఁ బురోహితాది ఘనమిత్రులఁదోడ జనంబుతోడ ను
ద్యోగవనంబుతీరును నిజోత్సుకమొప్ప వచించివెండియున్

ఉ॥ తల్లులకెల్ల మ్రొక్కి తనతండ్రికిఁ బ్రీతినమస్కరించి సం
ఫుల్లమనస్కుడై తనదుముఖ్యసుమంత్రులకెల్లఁ దెల్పనన్
ఉల్లములోనఁజింతిలుచు నూర్పులురాగ తలంగిరందఱున్
తెల్లనఁబోయి గప్డ నగధీరుఁడు రాముఁడు నిష్క్రమింపగన్

ఉ॥ భాసురరత్న కాంచనసమన్వితమై తనరారి భక్తిమై
భూసురకోటిచే మిగులఁ బుణ్యతరంబగు వాక్యసంస్తుతిన్
శ్రీసతికీడుకాదగు సుశీలచరిత్రయు సీతఁజూడఁ దే
రాసు చరిత్రుడైన రఘురాముని సూతుఁడుఁ దెచ్చిపెట్టగన్

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును మిథిలాపతినందనతోడఁగూడి యా
రామ లతాగృహాది విపులానగసంయుత భాసురంబునై
భీమసమాన రాత్రిచర భీతినిఁగొల్పు అరణ్యభూమి కు
ద్దామ విధంబుఁబోవ ఘనతర్పితులై రఘురామభక్తిచేన్

ఉ॥ ఆపురినుండు భక్తజనులందఱు నేకపథంబుఁగల్గి యా
పాపపుఁగైకఁ బల్కిన యపారసువక్రపు వాక్యజాలము
న్నాపగలేక రాజు వెతనందుచుఁ బాయగ దుఃఖమగ్నతన్
తాపముఁగల్గె మాకనుచుఁ దారు పరిష్కృతశోకచిత్తులై

ఉ॥ వెండియు వారుఁబోక రఘువీరు రథంబు పథంబుఁబట్టి యా
యండజయానలు న్వెస యువంచితయాన మతిక్రమింపగన్
మండితభంగసంగను రమావిభుపాద సుజాతఁ గాంచి యు
ద్దండశరాశిమున్గి వరతత్తటమందు వసించిరప్పుడున్

ఉ॥ అంత నయోధ్యపట్టణ ఘనప్రజలందఱు దీనభావులై
వంతనుగుంది బంధుజనవారములన్వెసఁగూడి మొత్తమై
చింతిలుచు న్సురారులనుజెండెడు రామునిఁబాయలేక వే
మంతనమాడి యాత్మపుర మార్గ సువీక్షితులైరి యందఱున్

ఉ॥ రాజకులాగ్రగణ్యుఁడు నరాతికులాటవి యగ్నిదేవుడున్
భూజనవందితుండు నతిపుణ్యసుశీలు డయోధ్యరాజుఁ దా
రాజిత జ్యేష్ఠపుత్రు రఘురామవియోగ ఘనాగ్నిఁ గ్రాగి సం
పూజనలొప్పఁ గైకొనుచుఁ బుణ్యదివంబునకేగెఁ జెచ్చెరన్

ఉ॥ పుత్రులు నల్గురుండియు నపుత్రునిమాడ్కి నొకండుచేరపన్
పాత్రతమీఱలేమికి సభాగ్యపు జీవితుడయ్యె రాజు ఆ
శత్రులకైనవద్దు ఘనజన్మశతంబులకైననెక్కడన్
పుత్రుని మానతీరమణి పూజ్యసురేఖలుఁదప్పనోపునే

ఉ॥ పట్టణమెల్లగల్లనియె భార్యల శోకరవంబుహెచ్చె నా
చుట్టుననున్నరాజులు విశుద్ధమనస్కుత నయ్యయోధ్యను
న్నెట్టననేగుదెంచి యొకనిర్ణయమొప్ప వసిష్ఠునాజ్ఞ న
ప్పట్టునఁ గైకయాత్మజుని యాతవిఁదమ్ముని బిల్వనంపగన్

ఉ॥ సంగతులన్ని పూర్ణముగ సారముఁదోడుగఁదెల్పి యేపున
న్నంగముభాతిఁ గోపమున నేత్రయుగంబునఁ గాంతులొప్పగన్
పొంగుచు మాటిమాటికిని బూతులుఁదిట్టుచుఁ దల్లిఁజూచి యో
యంగన! యెట్టి ఘోరవికృతాకృత కార్యముఁ జేసితిప్పుడున్

ఉ॥ ఎవ్వరు నీకుబోధ నతితీయగఁజేసిరి చెప్పునాకు నే
నెవ్విధినైన వారిని మదీయకఠోరసుశస్త్రకోటిచేఁ
గ్రొప్పునుమాన్పి రాఘవుని కోమలపాదసరోజ యుగ్మమున్
నవ్వుచు నాశ్రయించెదను నవ్యవిధంబగు దీనదృక్కులన్

ఉ॥ పౌరులవల్ల హెచ్చగు విపన్నపువాక్యము లాలకించి సీ
తారమణీన్దలంచి గుణధాముని రాముని యాత్మనిల్పి యే
పారగ వైదికక్రియలు భాసురమొప్పగఁజేసి తండ్రికిన్
భూరి యశంబుఁగూర్చె ఘనపుణ్యుఁడు నాభరతుండుఁ దమ్ముడున్

ఉ॥ ఇక్కడరాముడుండు వనతీరములంతయు పండ్లతోటల
న్నెక్కుడు రామణీయకత నించుచు సర్వఋతు ప్రసిద్ధమై
చక్కవకోయిలాది ఘనసారస బృందమనోహరధ్వనుల్
మక్కువమీఱవిన్చు జనమాన్యులు సీతతో సంతసంబునన్

ఉ॥ అ త్తఱి లక్ష్మణుండు జనకాధిపనందన రామచంద్రుడున్
చి త్తములోన దీనిఁగడచేరువిధంబు నుపాయమెద్ది యం
చి త్తఱి నెవ్వరిక్కడకుఁ జెల్వుగవత్తురు మాకనంగవే
త త్తరపాటుతో గుహుఁడుఁ దత్తటభూమికివచ్చెఁ జెచ్చెఱన్

ఉ॥ ఆగుహుఁగాంచుతోభృహదనాది వినిస్పృహుఁ జూచి యిట్లనున్
ఓగుహనామశేఖర నిజోజ్జ్వల సుందరనౌకగామివై
బాగుగ మమ్మునందఱ నవారితగంగను నుత్తరించు నీ
సొగసుజూడనట్టిదియె శుభ్రచరిత్ర ఘనుండవై యికన్

ఉ॥ ఆయినవంశు మాటలకు హర్షవికాససముత్సుకుండునై
పోయెను నావఁదెచ్చుటకుఁ బొల్పుగనింటికినాతడు న్మదిన్
హాయిగనావఁగొంచు జనులందఱు మెచ్చగ నాత్రయంబును
న్నాయనఘుండు భక్తి వివశాత్మకుడై తరియింపఁజేసిసన్

ఉ॥ నిన్నునుతింపశక్యమె మునీంద్రులకైనను రామచంద్ర నా
సన్నుతులాలకింపు మనసారనినున్ స్మరియించి వేడెదన్
పన్నగభూషణాది సురవందిత సంతత పాదపద్మ నా
కన్నులుఁ జల్లనయ్యెనని కంజదళాక్ష గుహుండు పల్కెనన్

ఉ॥ అమ్మునులెల్లవారికిని యా రఘువీరులు మ్రొక్కి చిత్రకూ
టమ్మునుజేరి తద్గుహలదాంబికము న్దిలకించుచుఁ సరో
జమ్ములఁజూచుచుండి సహజన్మునిభక్తికి సంతసించుచున్
అమ్మని యజ్ఞరక్షకు డుదారవిధంబుననుండె సీతతోఁ

ఉ॥ కేకయరాజనందన స్వకీయసుగ న్వెసఁజేసినట్టి యా
భీకరకృత్య మప్పుడు నవీనముగన్దలపోసి బాష్పముల్
ప్రాకటమొప్పఁగార నతిబాధతొ తల్లినిదూసి మంథరన్
ఆకఠినోక్తుల న్మిగుల నాభరతుండు శపించి వెందియుఁ

ఉ॥ పట్టణమందుఁ బౌరులను బాగుగ నా రఘురాముఁ గోరఁగా
దిట్టుచునున్న కొందఱిని తీవ్రశరాపశిపాలుఁ జేయుచున్
కట్టిడిబ్రహ్మచేసిన విఘట్టన కున్మదితోన చూచుచున్
ఎట్టులనైన నేను మనుజేశ్వరు రామునిఁ దెచ్చి సత్వరన్

ఉ॥ పట్టపురాజుఁ జేసెదను భద్రగజంబున నూరెగించెదన్
పట్టెదనేను ఛత్రమును మా రఘురామునకున్ ప్రియంబుగన్
నెట్టన రామవీరు పదనీరజ సంస్తుతిఁ జేయుచుండెదన్
పుట్టను రాజభోగముల మోహవిదూరుడనై క్రమంబునన్

ఉ॥ తల్లులనందఱి న్ఘనతఁ ద్రధమందు వేవసింపఁజేసి
గొల్లున సందడేద్వగను గూలుచు శోకపరీతచిత్తులై
పెల్లుగ నావసిష్ఠునిఁ బెద్దగఁజేకొని తారుఁదారె భూ
వల్లభుఁజూచువేడ్క నతివారణ సైన్య బలావహంబుతోన్

ఉ॥ మండిత దివ్యరత్నములు మానుగ నూత్నవినూత్న దీధితు
లెండుగనీనఁ ద్రధము మిక్కిలివేగమునన్ క్షణంబులో
చండతరాటవుల్గడచి దయ్యనగంగనుజేరె నంతలోఁ
జండతరాసిహస్తుడయి చక్కనినాగుహు డుగ్రమూర్తియై

ఉ॥ రాజ్యమునందునుంచ రఘురాముని యిష్టములేక కానలన్
రాజ్యము సేయుమంచు జనులందఱుఁ బల్కఁగ ధూర్తమూర్తి
పూజ్యుని రామచంద్రుని యభోగ్యవనంబులఁ గయ్యమాడుఁ
భోజ్యమెనీకు నిద్ధరణిభో! భరతుండ! యనంగనాతడున్

ఉ॥ బంధులతోడ నేను నతిభాసురతన్ రఘురాముఁ గ్రమ్మఱఁ
సంధిలునట్లుఁజేసి భువిజాతసయుక్తముగాన యోధ్యకున్
బంధములన్నిపోవ బహువారసు వందనముల్ఘొనర్చి యే
నంధుడఁగాను దీసికొనునట్టి విధంబున వచ్చితిప్పుడున్

ఉ॥ ఆరమణీయమైన భరతప్రభుమాటలునమ్మి చెచ్చెఱన్
కారుణికాగ్రగణ్యుడు నగణ్యసుపుణ్యుడు నట్టియాగుహుం
డారఘురామసోదరు ఘనమ్ముగ నన్నదిదాటఁజేసె సీ
తారమణీమణిం గని భుజదర్పితు నారఘురామభక్తునిన్

ఉ॥ రాముడు లక్ష్మణుండు దినరాజశుభోదయకాలమందు సౌ
దామనిఁబోలుజీవనముఁ దథ్యముమిథ్యనితోఁదలంచుచున్
నీమముమీఱ పల్పిరిలనేర్పుగ సంధ్యలు నగ్నిహోత్రముల్
యామహనీయలక్ష్మణుఁడు నంతట, దాభరతాగమంబునున్

ఉ॥ కాంచి మహోగ్రకోపుడయి కార్ముకము న్తగనెక్కునెట్టి య
భ్యంచితబాహువిక్రమ మపారగతిన్మహిసుల్లసిల్ల నే
బించిచెలంగదె న్నిపుడుఁ జిత్రగతి న్భరతున్నన న్నృపుం
డంచితబుద్ధి రామనరపాలుఁడు వల్దనెఁ దమ్ముకృత్యమున్

ఉ॥ దాపటికంబులేక భరతానుజుడప్డు గధంబుతిగ్గి తా
భూపతిఁజూచువేడ్క తనముంగలసైన్యమునట్టెనిల్పి తా
పోపకృశాననుండగుచుఁ బుణ్యచరిత్రుని రాముఁజూచె సీ
తాపతిరాముడు న్తనదుతమ్మునిఁ గౌగిటఁజేర్చి యిట్లనెన్

ఉ॥ అందఱు సేమవంతులె ఘనంబుగఁబట్టణమందు నెప్పుడున్
యందఱుఁబుత్రపౌత్ర ప్రముఖానుజులందఱు భద్రులేజగ
ద్వందితవిక్రమాఢ్య! సుశుభంబుగ వచ్చినతీరుఁజెప్పవే
వందనమమ్మ తల్లులకవారిగ మాకునునిండుదీవనల్

ఉ॥ అన్నకుమ్రొక్కి తమ్ముఁడు ఘనంబుగనందఱిబాగుఁదెల్పి యా
సన్నుపస్థితుండగు ప్రశాంతుని లక్ష్మణుఁజేరదీసి తా
విన్నదనంబుఁదోపగ భువీశ్వరుచావునుదెల్ప నందఱా
పన్నమనస్కులై భువిని బాధలమూర్ఛమునింగి రత్తఱిన్

ఉ॥ ఇద్దఱుతమ్ము లున్మిగులనీగెడుదుఃఖమునందు సోలుచున్
పెద్దయుఁ దండ్రియుందనకుఁబ్రీతుఁడు మిక్కిలిదైవతంబునై
తద్దయునొప్పురాజు ఘనదంబగు స్వర్గముఁజేరెనన్నచో
నిద్దఱుసోదరుల్ఘనజలీయుత యక్షతచారుహస్తులై

ఉ॥ శాశ్వతపుణ్యలోకమున సౌఖ్యముగల్గఁదలంచి యాద్వయం
బీశ్వరునిందలంచి తమవీరుఁడుఁదండ్రికిఁదర్పణాదులన్
విశ్వములోనిరాజకులవీరులు మిక్కిలిసన్నుతింపగా
నశ్వరదేహముందలచి నందితచిత్తముతోడఁజేయగన్

ఉ॥ ఈవిధిరాఘవలక్ష్మణులు నింపుగఁదండ్రికిఁదీర్చి పిమ్మటన్
వేవిహితప్రకారమున వేదసుకర్మలనాచరింపగన్
భూవిదితుండుఁగైకవరపుత్రుఁడు నాభరతుండు సంజలిన్
తావకపాదపద్మములె తద్దయుదిక్కగునాకు నెప్పుడున్

ఉ॥ కావుననీవు నేడుమదిఁ గౌతుకమార నయోధ్యలోనుసం
భావితరాజ్యపద్ధతిని పట్టముఁగట్టుకొనీంద్రభోగముల్
భూవివరంబుజాత నతిపూతచరిత్ర సుశీల సీతతో
నావుడు రాముడు న్మిగులనవ్యవిధంబగు వాగ్విజృంభణన్

ఉ॥ నాడు సమస్తదేవతలునందఱు సర్వప్రజల్వినంగ నే
పాడునరణ్యభూమికి యపారగతింజని సంచరించెదన్
వేడుకతోడఁబల్కితిని విశ్వమునందున హేయరాజ్యమున్
నేడుతగంగఁగోరగను నీప్రజలందఱు నన్నుఁదిట్టరే

ఉ॥ ఆతతమైన రాజ్యవిభవాతిశయంబునకన్న మేలగున్
భాతిగనిట్టివాసము ధృవంబుగనావుడుఁ దమ్మతిట్లనున్
ప్రీతిగ నట్లె సత్యపదవీయతనొప్పి వనింజరింపుమో
పూతచరిత్ర! యిమ్మ ఘనపుణ్యతనొప్పెడు నీదుపాదుకల్

ఉ॥ సామజయానలు న్మృగుల సారసనేత్రలునైన పల్లులున్
ప్రేమతరంగలింప రఘువీరుని మిక్కిలిఁబ్రస్తుతింప నా
శ్రీమహితుండు పూజ్యుడు వసిష్ఠమునీంద్రుననుజ్ఞఁజేసి యు
ద్దామయశోవిశాలమును దద్దయునొప్పెడి పాదుకద్వయిన్

ఉ॥ ఆభరతుండు సంతసిల నందఱు మౌనులు హర్షయుక్తులై
భూభరణాదికృత్యముల పొల్పుగ నారఘురామభక్తునిన్
వేభరియింపుమంచు బృధివీపతులందఱు సన్నుతింప శ్రీ
దాభములైనవానిని ముదంబుననిచ్చెఁ గృపాగరిష్ఠుడై

ఉ॥ భాసురవేదమంత్రముల బాగుగవానిని పూజసేసి వి
త్రాససురారియూధము విరాజిలు రాఘవపాదుకావళిన్
వేసతిఁగూడిపోయి యలపీఠమునందువసింపఁజేసె నా
రాసుతుడైనతమ్ముడును రామునిపాదయుగాబ్జభృంగమై

ఉ॥ పారములేనితోషమున పాదుక లన్ఘనసింహపీఠిపై
దారసుపుత్రవంతుడయి తద్దయుభక్తివసింపఁజేసె నౌ
రౌర దయాగుణాంబుధియు రామునితమ్ముని యాసుకృత్యమున్
యారమణీయపౌరులు సుదారమనంబునఁ బ్రస్తుతింపగన్

ఉ॥ అంతట రామచంద్రుడు ముదంబునలక్ష్మణుసన్నుతించి సం
క్రాంతమనస్కుడై సతితోఁగ్రక్కున నెల్లిటనుండిలేచి వి
శ్రాంతిఁగనుంగొనంగ మునిరాజులపత్నులఁగొల్చి నిచ్చలున్
చింతలడంచి నేర్చెదము శీతలవాగమృతోక్తనీతులన్

ఉ॥ ఆహవరంగ సుప్రతిభ హస్తపరాక్రమ విక్రమోన్నతుల్
మోహతళావిదూర ఘనముఖ్య మనస్సరసీరుహుల్ వినం
దేహులునైన రాఘవులు దీప్తపరిస్ఫుట బాణహస్తులై
యాహర్యదేవతాదు లమితంబుగ సంస్తుతులొప్పఁజేయగన్

ఉ॥ కాననగంధవాహవశ కానులిమేనులు హాయిఁజెందగ
న్నాననకాంతిపూరిత దిశావలయంబగు రాముదేవియున్
మానితసచ్చరిత్రుఁడుసుపుత్రుడునౌ వరలక్ష్మణుండు భూ
జానిని వెంబడించుచునుచక్కన నత్రిమహర్షిఁగాంచినన్

ఉ॥ వచ్చినయాత్రయంబును నవార్యపరాక్రమ భూరిధైర్య లా
త్యచ్ఛతరప్రశస్త గుణధుర్యులు సీతనుఁగాంచి సేమముల్
యచ్చపుఁబ్రేమతోనడిగి యర్ఘ్యసుపాద్యవిధుల్గొనర్చి తా
ముచ్చటలాడుచుండెను యమోఘవచస్కుఁడు నత్రిదేవుడున్

ఉ॥ పూజయొనర్చువేళను సుపుష్పమయాది సుగంధవస్తువుల్
భ్రాజితవృత్తిఁదీసుకొనివచ్చిన యాయనసూయ భక్తిమై
పూజనుగాంచి తోషమునఁబుణ్యతరంబగు పాతివ్రత్య స
ద్వ్యాజ సుబుద్ధిఁజెప్పె సమయోచితనీతుల వాక్చమత్కృతిన్

ఉ॥ ధర్మములోనినీతులను తార్కికవాదములోనితర్కమున్
మర్మసుసాయకాది ఘనవారణభేదన యుద్ధశాస్త్రమున్
మర్మములాదిగాఁదెలిపి మన్ననఁజేసియు రామచంద్రునిన్
శర్మకదాయివై మిగులసన్నుతికెక్కుమటంచు వెంటియున్

ఉ॥ నీవలన న్విరాధరజనీచరవర్యులు రామచంద్రుకే
ల్పావకసన్నిభోత్కట శరావళిఁదామని మ్రగ్గువారుగా
తావకకోర్కెఁజేసియును దద్దశకంఠుడు బంధువర్గమున్
పావనమైన రామశరపావకపంక్తుల దగ్ధుడౌనికన్

ఉ॥ అత్రిమహర్షివీడ్కొని ముదంబునఁగాననవాసులై తగన్
పత్రముల న్ఫలంబుల నభంగ సుపక్వ సుమాంసభక్షులై
చిత్రవిచిత్రమైన వనశేముషికి న్మదిలోనఁ బొంగుచున్
పాత్రతమీటకెప్పుడును వర్తిలుచుండిరి తంత్రియానతిన్.

"అయోధ్యాకాండ - సంపూర్ణము"

# అరణ్యకాండము



చ॥ నగుమొగమొప్ప రత్నమయనవ్యకిరీటముఁ గాంతులీన భ
ద్రగుడగుచు న్నిశాచరయరాతిసుపంక్తుల నాజిఁ జంపుచున్
భగవదనుగ్రహంబిడుచు భక్తులపాలిటి కల్పవృక్షమై
నెగడెడు భానువంశవరనీరధిచంద్రుఁడు మమ్ము నేలుతన్

చ॥ అటవినిఁ బోవుచు న్మిగులగాఁ గమనీయసుపుష్పగుచ్ఛ వి
స్ఫుటతర గంధవాహ పరిశోభితమార్గము లన్నిఁ జూచుచు
న్నటనటభీతిమైఁ దిరుగునట్టి మృగంబులఁ బట్టి యాడుచున్
వటతరుజాలఛాయల నవారితసుశ్రములై వసించుచున్

చ॥ జలజలఁ బాఱు నేఱులను చక్కనిదివ్యవిలోకులై వడిన్
ఫలసముదాయమున్దినుచు భవ్యతరంబగువాక్ప్రశస్తతన్
యలయక పూర్వరాజుల లసచ్చరితంబులుఁ జెప్పికొంచు సం
ధ్యలను త్రివేళల న్తగనొనర్చుచు ముగ్గురుఁ బాదచారులై

చ॥ దశరథరాజనందనులు దర్శితదివ్యమునీంద్రులై మనో
దశలనెఱుంగుచున్ వివిధధర్మసుయుక్తములై తనర్చు యా
పశుమరణాదికృత్యములు బాగుగఁ జూచుచు విశ్రమించుచున్
దశముఖుఁ జంపుకారణవిధాయకులై చనివేడ్కతోడుతన్

చ॥ కనిరి కుమారులిద్దఱు నకాతరులై కమనీయభంగ సం
జనిత మనోహరల్లలివిశాల మృదంగసుశబ్దవంత న
ర్తన సుమహోత్సవాగత కలాపకలాపిసమూహ కాంతిసు
ఘ నశుకకోకిలాది వరకంఠసమావృత దివ్యదీర్ఘికన్

చ॥ ఆదియునం బెద్దకాలము నిశాచర ముఖ్యసురక్షితంబునై
పదిలముగాఁ గనుంతు ముటిపాంథజనంబులభీతిఁగొల్పుచు
న్నదితకఠోరవాయునినదోద్ధత నాసికభీకరాషడున్
మునితనృమాంసభక్షకుఁడు మూర్ఖుఁడుఁ గోపుఁడుఁ బెద్దదానికిన్

చ॥ పరగువిరాధనామమునవాడును ముఖ్యయతీంద్రుల న్భయో
త్కరమగుబాధల న్సతముఘట్టనసేయుచు నేశిపించుఁ దా
వమసదినక్రమంబునను వారినిభక్షణసేయుచుండ వే
నరుదుగఁ బూర్ణమయ్యె వనమంతయు మారిసుసంగిసట్లుగాన్

చ॥ భయమునఁ బోయి శేషజనవర్గము రామునితోఁట రాక్షసా
న్వయముతెఱంగుసెప్పిన నవారితవిక్రమబాహుధుర్యుఁడై
రయమున నన్నరాశను విరాధునిఁజేరఁగఁబోవునంత దు
ర్ణయపథవృత్తిహెచ్చ వెసరామునిడగ్గఱి వాడెదుర్కొనెన్

చ॥ ఇరువురుఁబోరికర్దుఁ బెనుసీసున బెబ్బులిజంటమాడ్కి ఘో
రరణపథంబుఁగోరుచు పరాక్రమసంయుతభీకరాకృతిన్
సురుచిరబాణజాలనికషోద్ధతి రోదసినిండవెల్గుచున్
కరమనురక్తి రాముడును ఘస్మరుడు న్పటురోషమంతుపై

చ॥ అడుగులురెండుపెట్టి జనకాధిపునల్లుడు రాక్షసాధమున్
కటిదిబలంబుమీఱ భుజగాస్త్రమునింపుగసంధిసేయగన్
తడబడి రక్కసుండును బదంబడిఁగాంచుచు సొమ్మసిల్లగన్
మెడనదిత్రుంచెలీలగ నిమేషమున న్మదమంద నందఱున్

చ॥ విరధునిఁజంపి వానికులమెల్లనుబూర్తిగఁబాడుసేయ కం
ధరములుఁద్రెంపి చేతులనుదగ్ధముఁజేసియు గొళ్ళడుల్లగన్
వరతరబాహుజాలమును బ్రక్కలుఁజేసియు నంతఁబోక తా
మరకొలను న్సపుష్పముగ భస్మముఁజేసెను సాయకావళిన్

చ॥ అవరజుఁడైన లక్ష్మణుఁడు యన్నపరాక్రమమెల్లఁ జెప్పుచున్
వివిధములైన సంస్తుతుల వేయివిధంబుల నుగ్గడింపగన్
రవికులచంద్రుఁ డప్డుఁ గనులారఁగఁ దమ్మునిఁ గౌఁగిలించి వే
దవిదుఁడ వీవు నీబలముఁ దప్పకఁ జూపుము భావిపోరులన్

చ॥ అనుచును మెల్ల మెల్లగను నచ్చోటు వాయఁ దలంచి సీతతో
వినయము మీఱఁ దెల్పిన వివేకములా యనసూయవాక్యముల్
మనమున నుంచుమంచు జనమాన్యులు రాఘవులంత నంతఁ ద
ద్వనమును బాసి పోయి రలభక్తులకోరికఁ దీర్చువారలై

చ॥ వరమునిసీంద్రులుండి వరపావనమైఁ దనరారుచోటులన్
దురితలతాలవిత్రకులు దుష్కృతదూరులు ముక్తిదాయకుల్
వరజపవేదమంత్ర పరివార సుపాఠకులుండు దావులున్
తిరుగుచుఁ గాంచి రొక్కయెడ దీపితనాశరభంగుసంస్థలిన్

చ॥ సులలితశోభితంబగుచుఁ జూడ్కికిఁ దోషముఁ గూర్చుదాని స
త్యలఘులుఁ జొచ్చి రట్టియెడ నప్డు మునీంద్రుఁడు గాఢనిష్ఠతో
నిలువగఁ గొంత సేపటికి నివ్వెరఁబోవుచు వీరిఁ జూచి క
న్కొలుకుల నీరుఁగార రఘుకుంజరుతోడ వినీతి నిట్లనున్

చ॥ పరమకృపానిధే పతితపావనరామ యటంచు లక్ష్మణున్
కరమనురక్తిఁ గాంచి జనకాధిపుసత్సుతసీతఁ గాంచి వే
వరుసగ మీరు ముగ్గురును వచ్చినకార్యము నేనెఱుంగుదు
న్నరయఁగ దండ్రియానతి నరణ్యములన్ వసియించువారలే

చ॥ అనఘవినీతిమై నెఱిగి యమ్మునిదివ్యతపఃఫలంబునన్
తనకును భార్యకు న్మతియుఁ దమ్మునకున్ స్తగనిచ్చినట్టి యా
ఘనమగు దీవనల్ మిగులఁ గైకొని యాతనిచిత్తపూర్తికై
వనములనుండు కందములవారిగఁ దెలిన [illegible]

చ॥ అతనినిసంస్తుతించి మునులందఱుమిక్కిలిసన్నుతింప నా
తతఘనరాజ్యభోగములఁ దండ్రియనుజ్ఞనువీడి వేగసం
తతవనవాసమున్గనిన ధైర్యుఁడురాము డగస్త్యసన్మునీం
ద్రతతిగలట్టితావునకు లక్ష్మణుతోడుత నేగె వేడ్కతోన్

చ॥ జలనిధిలోనియాఘనరసంబును మిక్కిలికోపగించి తా
వలపటిచేతిగ్రుక్కతో యవారితసత్త్వముచేతఁద్రాగి యా
నిలిచినవింధ్యగర్వమును నీరుగఁజేసియు నన్నఁదమ్ములన్
సులలితమాయచేఁ గడిదిచూర్ణముఁజేసినయట్టి పూజ్యునిన్

చ॥ కరమనురక్తిఁగాంచి యునఘంబులువాయనమస్కరించి శ్రీ
కరమగునట్టితేజమును గన్నులఁజల్లగఁజూచి రందఱున్
యరయగ శిష్యసంతతికి నధ్యయనంబులుసెప్పుచుంటఁ దా
విరివిగవచ్చినట్టి రఘువీరులసంగతి విస్మరించియున్

చ॥ ఆటనొకలిప్తమాత్రమున నమ్మునివీరలవేడ్కఁగాంచి యు
ద్భటమగుతోషమంది పరితాపమువాయగ నాత్రయంబు నా
యుటజమునందు మిక్కిలిఁగనుంగొనుచున్ వెఱగంది మీరుఁయూ
యడవులకెట్లువచ్చితిరొ యద్భుతమయ్యెనునాసనాపుడున్

చ॥ ఘనుడవుఁగాదెయెప్పుడు నగస్త్యమునీంద్ర మదీయసత్కథన్
మనమునసీవు నేప్పగశుభంబుగఁజూచెద వైనఁజెప్పెదన్
ఘనుడగునాదుతండ్రి వెసఁగైకకునిచ్చినసద్వరంబులన్
వనములనుండగావలసె బ్రహ్మతనూభవ నీకుఁగ్రొత్తయే!

చ॥ అభయమొసంగవయ్య మునినాథ దయానిధి యన్న నాతడున్
యిభసురశత్రుసింహమ త్వదీయపరాక్రమమేనెఱుంగుదున్
విభవమెలర్ప మీయుగముఁ బెక్కనిశాచరులన్వధించి స
త్శుభములనొంది నాదువరసూక్ష్మసహాయముఁ గల్గఁజివ్వలోన్

చ॥ నగవరగర్వసంహరణనందితు డప్డుఁప్రశాంతబుద్ధితో
మొగమునహాసమొప్పగను ముగ్గురిఁబ్రేమతొ వీడుకొల్పి వే
నిగమసుమంత్రముల్వినుచు నింపుగఁబోవుచునుండ భీకరం
బుగ నటఁదోచెవారికిని బుద్ధికిదారుణమైనరూపుతోన్

చ॥ కరమునఖడ్గమొప్ప భుజగర్వము హెచ్చ ధరిత్రినంతయు
న్నరుగఁబాదఘట్టనల నల్లడిసేయుచుః క్రుద్ధచక్షులన్
పరదళకంటసోదరి శుభంబుగశూర్పణఖాఖ్యఁజూచి యా
సరసుఁడు మన్మథుండు సుమసాయకము ల్నిగిడింపఁజెచ్చెరన్

చ॥ అవనిని మానవాళికలుషాంతకు సుందరరూపు రామునిం
గవయగఁగోరి రూపమునుగ్రక్కునమార్చి విలాసబంధన
స్తవములఁజేసి వేడుకనిజార్థముఁదెల్పిన రాముడంత నీ
ధవుడనునేనుగాను వరధర్మపుఁబత్నితోఁగూడియుండుటన్

చ॥ మఱియునునీవు శీఘ్రముగ మాన్యుఁడుఁదమ్ముడు లక్ష్మణాఖ్యునిన్
విరవిరఁజేరి నీదుమనమైనసుకాంక్షను వేగఁదెల్పినన్
తిరముగనాతడిచ్చు భవదీయకరంబగుముద్దుమాట యం
చఱమరలేక దానిదగుభక్తినివీపునఁ దాలిఖించినన్

చ॥ అదియునురాముమాటల ఘనంబుగనమ్మి తదీయసోదరున్
ముదమొదవంగఁజేరగ నమోఘబలాఢ్యుడు లక్ష్మణుండు సొం
పొదవగఁబూజసేయుటకుఁ బువ్వులఁగోయఁపరీక్షఁజేసి దా
నిదినిడువీపుఁజూడగను నేర్పునవ్రాసినయన్నవైఖరిన్

చ॥ కనుగొనిసంతసించి భుజగర్వముమీఱగఁ గోపరూపుడై
దనుజనుజేరఁబిల్చి వరదక్షిణవామసుకర్ణము ల్వెస
న్ఘనమగునాసిక న్తనదుఖడ్గసుధారలఁగొంతఁజెక్కి తా
నునునిజసోదరున్గనియె నూత్నవిధంబగుహాసమొప్పగన్

చ॥ తలచినకృత్యమప్పుడె ముదంబుగఁజేసినయట్టిహనుమనిన్
సులలితకౌగిలిన్నిగిచి శౌర్యము మెచ్చగఁ బ్రస్తుతించి సీ
వలనమదీయకష్టములు బాధగలేవనిరాముడన్న యా
లలనయుసోదరుండును చిరంబుగనేగిరిరామచంద్రుతోన్

చ॥ అరుగుచువారుఁగోనలకు నద్రులకు న్వరగంధవారిశో
త్కరములు సుందుతావులకుఁగమ్మనిగాడ్పులు వచ్చుచోట్లకున్
సురుచిరపుష్పవాటికలఁ జూడ్కికినించెడు రామణీయతన్
నిరుపమగమ్యులై కనుచు నేగిరిసంతతహర్షచిత్తులై

చ॥ తనకునులక్ష్మణుండు ఘనదర్పితుఁడై తగఁజేసినట్టి ఖం
డనవరకర్ణనాసయయి డంబుగఁదద్వనయామినీచరుల్
వినగను యార్తరావములుఁబెల్లుగఁజేసిన మారుమ్రోగె నా
ఘనవనమంతయు న్నశనికర్కశభీకరనాదమోయనన్

చ॥ భయమునుగొల్పుశబ్దమును బంధురవృక్షవనంబుజంతుసం
చయములు నన్నియున్విని నిజాలయమార్గము లట్టెఁబట్టగన్
రయమున రాక్షసాధములు రామునిఁజేరిరిమోహరింప శ్రీ
జయమగునట్టి రాఘవునిబాణపుఁగీలల మ్రగ్గిపోవగన్

చ॥ త్రిశిరవిదూషణాదిఘనదేవవిరోధులు నాహవక్రియో
ద్దశవిధనేర్పరు ల్బహువిధాయకతంత్రసుమంత్రవేదులున్
విశదముమీఱ వారునతిభీకరరోషమున న్నిలన్పదు
ర్దశలసహస్రసంఖ్యల ముదంబునమార్కొనిరప్డురామునిన్

చ॥ అనుజునిపాయమున్గొనుచు నద్దివిజారులఁబెక్కుఁద్రుంచుచున్
మొనతలమందుఁజంపియు నమోఘసుసాయకరోచిజాల స
ద్ఘనమగునాకసంబును విచారితమైనటుల న్ప్రకోపుఁడై
కనుగవవహ్నికీలములుఁగ్రాలగ వారినిలీలఁజెండగన్

చ॥ పగిలినపుత్తెలు స్మృతియుబాధలనొందినయట్టిచేతులున్
నొగిలినపాదజానుకటి నూపురమధ్యతలాదిభాగము
ల్నగుపడకుండవోయిన సురారులకేతనరధ్యసారధుల్
నగరిపునన్నుతుండు బహూనప్యవిధంబగుపోరు సలి

చ॥ కదనమునందు రాఘవునిఁగంతుసుఁరూపుని నొ
విదితమనస్కులై రిపులువేడ్కలువోవగ ఖిన్న
పెదవులువాడ భీతులయి పెద్దయుఁగానగలేక య
న్వదనసరోజమందుఁగడునాఁటెపునవ్వన రాముడిట్లన

చ॥ అలసురశత్రులార వినుడందఱు మామకవాక్యసారము
యిలమిమునేపుమీఱ భవదీయులనందఱి నిప్డుఁబట్టి సొం
పలరగ భానునందనునిపట్టణమంపెదనంచు బాణసం
చలనముఁజేసి రాఘవుఁడు జక్కడగించెను శత్రుసేనలన్

చ॥ ఒకరినిదక్కకుండ సుగుణోన్నతఁడందఱిఁద్రుంచె రాముడం
చకవికలైన యాత్రిరులాదిగపైఁబడి మోహరింప యా
నకపణవాదిభేరులనినాదము లాకసమంటఁబర్వగన్
నకములఁజంపెనిద్దఱిని నందితచిత్తముతోడ రాముఁడున్

చ॥ ఖరుడును రామచంద్రుని యఖర్వపరాక్రమమొప్పమార్కొనన్
వరతరమైతనర్చు రిపుబాహుసువిక్రమమెద్దమెచ్చి భూ
వరుడును వహ్నియస్త్రమున బాగుగవానిప్రశస్తమస్తకం
బు రణతలంబునంబడగఁ బొల్చుగనేసినదేవతావళుల్

చ॥ ఇలపయిఁబూలవానఁగురియించిరిమిన్నునన్మ్రోండి దుందుభుల్
సెలగెను దిక్కులందున శచీపతిమిక్కిలిసంతసిల్లె స్వ
ర్గ్లలనలుహాయిగన్వివిధలాస్యములాడిరి మంగళాదిభా
షలుఁగడుహెచ్చె దైత్యజనసంఘము నొక్కెడనుక్కడంగగన్

ఉ॥ ఇదియటులుండ శూర్పణఖ యేచినదుఃఖముఁబొంగిపొర్లఁ ద
న్మదితలపోసి కుందితనవాడగురాక్షసవంశసత్ప్రభున్
విదితయశుండు రావణునివేడ్కఁ దాఁజేరి వినీతినిట్లనెన్
కదనమునందు నీవునలకంతువిరోధినినైన నొంపవే

ఉ॥ అటవినినేనుఁ గ్రుమ్మరుచు నక్కడఁగాంచితిసోదరద్వయిన్
కుటిలవినీలకోమలసుకుంతలయౌ నొకయంగనామణిన్
పటుతరపుష్పసాయకపుఁబంక్తుల మారుడునన్ను నేయగ
న్నటునిటుఁజూచి రాముగవయంజనునంతను నాతఁడిట్లనెన్

ఉ॥ కమలదళాయతాక్షి పటుకామమునన్నుఁగోరివచ్చుటల్
రమణనువేడుట ల్తగదు లజ్జవహించి మదీయసోదరున్
క్రమముగఁగోర నీదుమనకార్యముఁదీరునటొమ్మటంచు వే
గమునసుఁబాఱద్రోలిన యఘూరహితాత్మకుఁదమ్ముని న్వెసన్

ఉ॥ కనుగొని యాతనిన్ఘనత గమ్మగవేడిన నాదుశీలమున్
ఘనముగగుత్సించి యధికంబగుకోపపరీతచిత్తుడై
కనుఁగొనలందునిప్పుకలుఁగ్రమ్మగ నావగునాసకర్ణముల్
పెనుకరహేతిచేత నతిబిట్టుగఁగోసెను గోడువెట్టగన్

ఉ॥ క్షితిజవిరోధులిద్దరు సుదీప్తులుఁగోసలరాజనందనుల్
సతతమువారివెంటఁబరిచారికవృత్తి నిసల్పుసాధ్వి స
త్సతియగుసీత కావునఁబ్రశాంతమనంబగుబుద్ధి గల్గి నీ
వతులతమంబ జానకినివయ్యనఁదెమ్ము హరింపుతాపమున్

ఉ॥ అనిననిజానుజన్గని దశాననుడప్డుఁగలంగి పేర్మి స
ద్ఘనదకఠోరపత్త్రిసులఁదంత్రులువోవగ గర్జసేసి నీ
పనిని నిమేషమందునతిభద్రముగానిదెఁదీర్తునంచుఁ జె
ల్లినితనయింటికిం బనిచి లీలగఁదానుసుమాపయొద్దకున్

చ॥ పరుగునఁబోయి రాత్రిచరవర్యులఁదోడనమస్కరించి యా
పరమవిధేయ నాకు ఘనబంధుఁడవీవు మదీయవాక్యముల్
కరముగవేడ్కఁజేసి యతిగారవమొప్పగఁజేయుమింక నీ
శరణము నేనువేడితి ప్రసంగముసేయక చేయుమెమ్మెయిన్

చ॥ లలనలమీద నాకను దిరంబగుబుద్ధినిఁగల్గియుంట నీ
తలకునుబట్టుఁగావున ప్రతాపముమీఱగ నీవుపోయి భూ
తలమునసుండురామునతిధాముని దమ్ముని నీదుమాయచే
నిలపటనుండనీక మతినేర్పున నేనునుసీతఁదెచ్చెదన్

చ॥ త్వరగను పెళ్ళమున్న సతిబాధగనాతఁడు వానికిట్లనున్
దురితుఁడ నీవు రాఘవునిమాఱగఁజెల్లునె రాముఁడన్న నో
పరగవికుంఠధాము డతిపావనియామహలక్ష్మిసీతగా
నరసవిలోకనంబులఁబ్రకాంతివహించి యుమంగుకోరికన్

చ॥ అలమునియజ్ఞరక్షసమయంబున నేనును నాదుతమ్ముఁడున్
పలలమసృగ్రసంబు విహంఖాండములన్గురియింపఁగోపుడై
సులలితబాణజాలమునస్రుక్కగఁజేసె మదీయసోదరున్
జలనిధిపై చెనన్ను వడిసారసమిత్రకులుండు రాముఁడున్

చ॥ పటుతరమైన రామవిభుబాహుపరాక్రమమిట్టి దింక నే
నెటులనభీతిఁబోదువన నిగ్రహయాగ్రహదుర్నిరీక్ష్యుడై
చటులపుఖడ్గముగ్గొనియు ఁజంపుదునిన్ననిహంకరింప నీ
కటుకపుచావుకంటె పరమున్మరుపొంతనెచావుమేలగున్

చ॥ అనిదృఢచిత్తుఁడై యతనికంజలిసేసి సుబుద్ధులింక నీ
మనమునఁబట్టవంచు నలమారిచుడప్డు సువర్ణకాంతులం
దనరెడిజింకయాకృతిని దక్షిణమందునఁదాల్చి వేగ నా
యినకులుబుండుపంచవటికేగెను హర్షమునందటింపగన్

చ॥ జిగిఁగలమేనితోడ పరచిత్రవిచిత్రపురూపుతోడఁ దా
దెగడెడుచండభానుఘనదీధితితోడసుచక్షుల న్వటిన్
బిగువగుకాళ్ళతోడుతను పెద్దమృగంబయి గంతులేయుచు
న్నగులపడెసీతదృష్టికి ఘనంబగుఘూసమునద్దుమేయుచున్

చ॥ అదిగనిరాముభార్య యసురాంతకుతోడుతఁ దోషచిత్తయై
మదిఁగలకోర్కెనప్పుఁడు శుభంబుగఁదెల్ప వినీతిలక్ష్మణుం
డిదివిని వద్దువద్దు త్యజియింపుము రక్కసులిక్కడ న్మనో
విదితపుఁగామరూపులయి వేడ్కతొనుందురు హింససల్పుచున్

చ॥ జనకజయట్టిమాటలను సారవిహీనమనస్కయై మఱిం
దినిగమనింపనేరక నుతిందగఁజేయగ రామచంద్రుడున్
విని నిజభామయీప్సితమువేగమెతీర్పగఁ జాపహస్తుడై
తనయనుజన్మురక్షగను ధారుణినందనకప్పుఁజేసినన్

చ॥ వరమృగసింహఘోరవగవాదులఁజంపెడువేటగాని స
త్కరణిని రాముడప్డు ఘనకాననమందుఁజరించి జింకన
ప్పరమకృపుండుఁగానక తమంబునుగప్పకముందె రాక్షసుం
డురుజవమొప్పఁబోవుటను నొప్పుగఁగాంచి రయంబుఁదోడుతన్

చ॥ అటునిటుఁబోవుఁగొంతవఱకంతటఁగ్రుమ్మరు భీతిలేక త
త్తటములవొంతకేగుఁగడుదప్పికఁబొందినవానిచాడ్పునన్
యిటులపవిత్రవంశవరనీరధిచంద్రుని రామునప్డు యా
చటులుడురక్కసుండుఁగడుసంకటపెట్టెను ప్రాణభీతితోన్

చ॥ తడసినలగ్గుఁగాదనుచు దానవవీరునిఁజంపుబుద్ధిచే
వడితనబాణరాజము నవారిగఁజేతఁబరిగ్రహించి తా
నెడదలోఁబూజసేసి కడునీల్గి ముదంబుననేయ మారిచున్
తడబడునట్లుఁజేసి వితథంబుగఁజేసెను మస్తకంబునున్

చ॥ మరణమువేళవాడు నియమంబుగ లక్ష్మణు సీతనామముల్
స్మరణముఁజేసి బిగ్గఱగఁజచ్చిన సీతభయార్తచిత్తయై
కరముమఱందిఁగన్గొని పోకాలుమటంచును నాదునాధుడున్
శరణమువేడెనంచు నతిసాంద్రపుదుఃఖములోనఁదేలుచోన్

చ॥ పలికిననామెమాటలకు భావమునందున లేశమాత్రము
న్నలుకనుఁజెందకుండ వినుమోముదితా యనియిట్లుపల్కె న
జ్జలజవిశాలలోచనుఁడు శౌర్యజితారి ఘనుండునన్నకున్
యిలనొరుచేతఁజావుఁగలదే యననామెయురోషమగ్నతన్

చ॥ దురితుడనీవు నిక్కముగ దుష్టచరిత్రుడ వెల్ల వారికిన్
కరముగశాత్రవుండవు సకార్యమునీమదిలోనఁగన్పడున్
నిరతమురామనామమునునెమ్మదిఁజేసెడునన్ను నీవు యి
క్కరణినిఁగోరినావ యనగావిని లక్ష్మణుడిట్లనెత్తగన్

చ॥ హరిహరియెంతమాటఁదగనాడితివమ్మ వినంగనోప నీ
ఖరతరమైనవాక్యములు గ్రక్కునవేనుపసంహరింపు మీ
గురుతరకార్యమున్గొనుచు గొప్పగరామునియొద్దకేగెదన్
వగమగురేఖలన్విడిచివచ్చిన దోషముఁగల్గునీకనన్

చ॥ అనవినిసీత నెమ్మదినియర్కకులేశ్వరుఁబూజసేయుచున్
మనమునరాకఁగోరుచును మానుగనొప్పుచునుండె నంతఁద
ద్వనమునరామురోయుచును బాహుబలుండగులక్ష్మణుండునున్
కనుగొనలేక చింతిలుచు గ్రమ్మినభీతితొనుండె నత్తఱిన్

చ॥ అసురులనేత దివ్యబహుశాస్త్రపరంపరనింద్రజేత తా
మసలకరావణాసురుఁడు భవ్యసుపుష్పకయానుఁడై మదిన్
దొసగులువట్టనీక ఘనదోర్బలవీర్యము హెచ్చఁదానుఁదా
పసియయి సత్కమండలముఁబట్టెలునొప్పగ వచ్చెఁగానకున్

చ॥ సములగురామలక్ష్మణుల నౌచితియేర్పడ సీతదాఁపున
న్నదుదుగనుండనీక వెనవాపలఁదోలిన మాపుతెల్వికిన్
కరముగసంతసిల్లి వెనుకావరమొప్పగ రాముదేవితోఁ
దిరముయతీంద్రుఁబోలె భవతీయనిభిక్షముఁగోర నామెయున్

చ॥ సుమములుభిక్షఁగొంచు ఘనశోభితమైవిభునిందలంచుచున్
క్రమముగగీతగీచిన విరాజితసంస్థలిఁజేరునంతలో
రమణను యమ్మునీంద్రుఁడుఁగరంబుగదాటినఁగాని వద్దనన్
కమలనిభాక్షిగొంకుచు వికల్పముచేఁదరియించె రేఖలన్

చ॥ పరమపతివ్రత న్సతతభర్తృపదాబ్జసుబంధురంబునున్
కరుణగుణాఢ్యశీల నధికంబగుమన్మధతాపదగ్ధుడై
కరముఁబట్టి గ్రహించి యలకాధిపుఁబుష్పకమందువెట్టి తాఁ
బరియమహాత్మవాంఛతో నమానుషకార్యముసల్పె నాతడున్

చ॥ సకలప్రజాళిపోషకమనంబును నశ్వరసవ్వయంబుచే
వికలముఁగాగఁజేయు రఘువీరునినామముసంస్మరింపుచున్
శుకపికసారసధ్వనుల సుస్వరమొప్పగనేడ్చుచు న్మనం
బుకరిసప్రవృత్తినాల్చుటకు బుద్ధినిరావణుదర్వ్యదూఱుచున్

చ॥ నిరవరనేతవెంట నవనీసుతయుండుటఁగాంచి భక్తిచే
దశరథరాజుమిత్రుఁడను దద్దయుగావునఁజూడలేక యా
దశరథరాజుకోడలివిధాయకమున్గని యాజటాయువన్
విశదపతంగపుంగవుడు వేగమురావణుఁదానెదుర్కొనెన్

చ॥ ఘనమగుపంచలన్వొడిచి గర్జనసేయుచు (బైకివచ్చి భూ
జనములుసన్నుతింప తనపారపుకోఱలఁజక్కఁజేసి వే
మొనసతిప్రపంతముగఁబోవనుసల్పగఁజూచి రావణుం
డును నిరసించియుంచుటఁగనుంగడు దుష్కరమంచు వాలునన్

చ॥ నిజకరమందుఁబట్టి యతినేర్పుగనాతనిరెండుపక్షముల్
గజిబిజిసేయనెంచి బహుఘర్షణనిమ్మహిఁడుల్లఁజేసి స
ద్విజయపులక్ష్మిగొంచసురవీరుఁడులంకనుజేరెఁ బక్షియున్
భటనముసేయుచుండె బహుభంగులఁగోసలరాజపుత్రునిన్

చ॥ అటనొకచోట రాఘవుని నార్తశరణ్యవరేణ్యుఁజూచి వి
స్ఫుటముగునశ్రుబిందువులు పొంగుచుఁగౌరగఁగౌగిలించి త
త్తటమునఁజేరి రాముడును దమ్ముఁడులక్ష్మణసంయుతుండునై
యుటసువార్తలెల్లవిని యుద్భటకోపపరీతచిత్తుఁడై

చ॥ ఎటులనుదేకభార్యను వనిన్వెసనొంటరిపాటుదానిఁగా
గటికమునంబుతోడ జనకాధిపుఁబుత్రికవీడితయ్య యా
కుటిలనృమాంసభక్షకుని గూఢపువాక్కులనేలవింటివో
యిటులకునేలవచ్చితివో యేర్పడఁజెప్పుము నాకుఁదమ్ముడా

చ॥ అనవిని లక్ష్మణుండనియె నప్పుడురామునిఁగాంచి భీతితో
నినకులరాజరత్నమ త్వదీయసుపత్ని యరాతికూతలన్
వినిభయమంది నీకుఁబెనువేదనఁగల్గెనునంచుఁజెప్ప నే
వనరకుమన్నఁ దాఁబరుషవాక్యములాడిన వచ్చితిప్పుడున్

చ॥ భయమునుగొల్పుచున్నదన బాగుగఁదమ్మునిబుద్ధిఁదెల్సి యా
ద్వయమును బర్ణశాలకునవారిగఁబోవుచు మార్గమధ్య దు
శ్చయశకునంబులంగనుచు ఁజల్లగనేగుచుఁ దాళగేహస
న్నియమమునీంద్రులంగనుచు నేర్పుననాయుటజంబుచెంతకున్

చ॥ అరిగిన సీతజాడనిసుమంతయునేరక భీతినొందియున్
తెరువులనన్నిఁగాంచుచును దివ్యపథంబులఁబోయిచూచుచున్
వరమృగసింహసూకరగవాద్యఖిలాది తరక్షురాక్షసీ
ఖరపరివారతావులివి గ్రక్కునవెవ్వరుద్రుచ్చిలించిరో

చ॥ ఎవరిని నేను వేడుదు మదీప్సితమెట్లుసమాప్తమయ్యెడున్
ధనుడుసులక్ష్మణుండును వెతంబడిపొక్కెడువారలంచు నా
ఘవిజమదిన్వెలార్చుచును బూర్ణముగానిపుడెక్కడున్నదో
యవరజ! నేనుప్రాణములనాపగఁజాలను సీతలేనిచోన్

చ॥ అనుచును రామచంద్రుఁడు భయాకులసంవృతచిత్తుడై గలిం
చినవిషయంబులన్నియును సీతతోఁగూడిచరించుసంగతుల్
మనసుననొక్కతూరిగసమాగతమైన ఁదలంచి కుందుచున్
జనకునిసంస్మరింపుచును జక్కఁగఁగ్రైకనులోఁదలంచుచున్

చ॥ చలములుడిందివారిదగుశాలనువీడి యరణ్యవర్తులై
యలసటలేకఁజూచుచు పథంబులఁగాంచుచుఁ బోవుచుండగన్
బలమునుదగ్గి హీనముగభావమునందున రామునామమున్
పలిపెడిపక్షిపుంగవు విశాలగనుంగవఁజూచిరిద్దఱున్

చ॥ ముకుళితహస్తుడై ఘనతమ్రొక్కి శిరంబుమదీయనామము
త్యకుటిలబుద్ధిఁజేసెడి మహాత్ముఁడవెవ్వడవీవుఁదెల్పవే
నకకృశగాత్రయన్న జననాధునితోడుతనాతడిట్లనెన్
ప్రకుపితపంక్తికంధరుకరాశపుహేతికి భూమిటిగ్గితిన్

చ॥ అవనిజఁగొంచు దక్షిణదిశనబడి వైళమఁబాఱుదెంచు యా
యవనిపురావణాసురుతో యక్కటికంబిసుమంతలేక నే
టవరముసేయ వాడుఁదనవాలునుగైకొని రెండుతెక్కలన్
యవియగఁగొట్టె నాదగుబలంబవియంతయుఁగోలుపోవగన్

చ॥ పిదపమదీయగాత్రముభువింబడ నీదగుపుణ్యనామమున్
పెదవులయందుఁజేయుచును భీతినొకించుకలేకయుంటి నా
మదసురశత్రువిక్రముఁడు మంచిబలాఢ్యుఁడుఁగాన నీవునా
శదనమునందునొంచి ఘనకార్యముఁదీర్చియు సీతఁబొందుమా

చ॥ ఇటనికనుండఁజాల నికనీగ్గెడుకాలమువచ్చె నాకు మీ
పటుతరచంద్రబింబములభాతినివెల్గుముఖాంబుజంబులు
దృఢమగుతోషచిత్తమున బాగుగఁగాంచితి జన్మలేదు నా
కటునిటుఁగూడనంచుఁదనకంఠముఁదగ్గఁగూలె భూమిపై

చ॥ ఇరువురువానిదేహమును నీప్సితమొప్పగలేపఁదీసి దు
ర్భరమగు గాఢదుఃఖమునఁబాయగవేక తగంగసత్సుగం
ధరసముమేనఁబూసి ఘనదారుణవహ్నికినప్పఁజెప్పి ర
ప్పురములసేవఁగొంట వరపక్షియొనర్చినపుణ్యమెట్టిదో

చ॥ ఘనమగుపంచపద్వితయకంధరుఁగానగనేగుచున్ యశో
ధనులగురాజపుత్రులు పథంబునఁగాంచిరి దీర్ఘ రక్తసి
క్తనఖపరిక్షతప్రకరదర్పిత సర్వప్రజాళిభావనున్
వనముననుండువానినిఁగబంధుని సర్వవిదూపుఁ జెంగటన్

చ॥ కనుగొని రామలక్ష్మణులుఁగంపమునొందగ వాడుఁజూచి క
న్గొనలనువిస్ఫులింగములుగొబ్బునరాలగ దుర్నిరీక్ష్యుడై
మనమునవీరినిద్దఱిని మాయముఁజేతునటంచు నెంచి త
ద్ఘనమగుబాహుల న్నిడివిగానొనరించిగ్రసించె నిర్వురన్

చ॥ జగములనేలువారలు వశంవదులున్ బహుశౌర్యవంతులున్
నిగమవిధాయకు ల్మఱియునీరజనేత్రులు బుద్ధిమంతులున్
మొగమునఘర్మబిందువులు ముచ్చటలొప్పగఁగారుచుండ న
త్యగణితసత్త్వవంతులయి యప్పుడుదీకొనిరాకబంధుతోన్

చ॥ అలసటలేక దానవుఁడు హంసునిమాడ్కి వెలుంగుచుండఁ జూ
డ్కులకుసహింపరాని రఘుకుంజరుతేజమువానిఁజొచ్చె వా
డిలఁబడకుండనుండ గణుతింపక లక్ష్మణుడప్డు హస్తమున్
వలపటిదానినిన్నఱుక వంద్యుఁడురాముఁడునట్లఁజేసినన్

చ॥ వికటకఠోరరూపమును వీడ్కొని సుందరదివ్యరూపుడై
ప్రకటవినూత్నరత్నవర భాసురముఖ్యవిభూషణాది స
న్నికరముఁ జేత వెల్గుచును నింగికిగంతివి రామచంద్రునిన్
ప్రకరసుపద్యవృత్తములఁ బ్రస్తుతిఁ జేసెను దోషచిత్తుడై

చ॥ అనినఁ గబంధువల్కుల ఁబ్రహర్షపరిప్లుతమానసంబుల
న్నిసకలరాజవర్యులను నేమికతంబున నిట్టిరూపము
న్ననయము నీవుఁ బొందితివన న్విని వాఁడును నెల్లగాధ స
ద్వినయముమీఱఁ దెల్పి ఘనవేగమున న్దివిఁ జేరె నంతటన్

చ॥ అనఘులు వారిఁ బట్టి మునులందఱిఁ గాంచుచు వారిదీపనన్
ఘనముగఁ బొందుచు న్వరనగాంతసరిద్రసయుక్తవాహినీ
వనములఁ జూచుచు న్విరహవహ్నికి వేసరి లోనఁ గుందుచున్
కనిరి మనోహరాశ్రమము ఁగాంచిరి యందొకతన్విరత్నమున్

అదియును వారిఁ గాంచి తగనర్ఘ్యసుపాద్యములిచ్చి మ్రొక్కి సెం
పొదవిన వేడ్కతోడ ఁబలుపూలతో బాగుగఁ బూజసేసి తా
నుదపసివృత్తిఁ దాల్చి ఘననోరిమినొప్పుచు వారితోడఁ గొ
న్నిదినములుండ నామెకును నిండగుభక్తి నొసంగె రాముఁడున్

చ॥ అడవికి నేగి యంచలిఫలంబులనన్నిటిఁ గోసితెచ్చి వేఁ
డడయక వానిలో మిగులధాటిగఁ బండిన సత్ఫలంబులం
గుమవక రామచంద్రునకుఁ గూరిమినిచ్చుచు ఁదక్కసండ్లఁ దాఁ
గుడుచుచు రామభక్తినియమంతితమొప్పగసల్పె శుదయై

చ॥ అవనిలో రామభూవిభుఁడు నంగనయౌ శబరీలలామ తా
లవముఁ బరీక్షఁ జేసి మధురంబునాగతనికిచ్చినట్టి యా
వివిధములైనపండ్లనతిబిటుగ నెంగిలియంద్రుగాని యా
నివసితసర్వలోకుఁడగు నేతను నెందును భేదమున్నదే.

చ॥ తరుణితగంగసల్పిన యుదారతకు న్మదిలోనమెచ్చి యా
వరదుఁడు సాధుభక్తజనవర్గుఁడు పుణ్యవిదేహనందనో
ద్ధరణుఁడు రామచంద్రుఁడు సబాష్పనయుక్తసదాననాబ్జుడై
నిరతపదంబు మోక్షమునునిచ్చె వెలందికి సంతసంబునన్

చ॥ సతతమురామసేవలఁ బ్రశాంతమనంబులతోడఁజేయుచున్
పతితులనుద్ధరించుచును బావనమౌరఘురామపద్మముల్
మతినిఁదలంచుచు న్సతము మానినిసీతచరిత్రనెంచుచున్
కుతుకముమీఱ సత్ప్రజలు గొంకులులేకచరించి రందఱున్

చ॥ వరరమణీయతావుల నవారిగఁగాంచుచు వేడ్కఁజెందుచున్
సురుచిరతీరవృక్షలతశోభితమై ఁదనరాచుచోటులన్
మరకతరత్నవజ్రములు మానుగదీధితులొప్పఁజూచుచున్
యిరువురుసోదరుల్గనుచు నేగుచునుండిరి మార్గవర్తులై

చ॥ అటఁజనిగాంచిరిద్దఱు ముదంబున వారితరంగశీకర
స్ఫుటతర గంధవాహ పరిఫుల్ల సరోజ మరాళ సారస
త్తటి కలకంఠ కోయిల కదంబవరధ్వని కోమలంబునై
పటుతరభాసురంబు వరపంపతరంగిణితీరదేశమున్

చ॥ అవనిజఁగానలేక మదినాకులమందుచు దుఃఖచిత్తుడై
బవరమురావణాధిపుతో బాగుగనెప్పుడుఁగల్గునంచుఁ ద
ద్దివసముఁదీర్చి పంపనదితీరసరస్సున హాయిఁజెందుచున్
సుమినెటువంటివారికిని బూర్వకృతంబు పృథాగఁబోవునే

“అరణ్యకాండము--సంపూర్ణము”

# కిష్కింధా కాండము

శా॥ శ్రీరాము న్వరసింహమధ్యు ధరణీసీమంతినీవల్లభున్
పారావారగభీరు ధైర్యు వరదుం బాపాభ్రవాతూలమున్
ఘోరారాతివిశోషు శేషశయనుం గుంభీంద్రసంస్తుత్యునిన్
గారామారఁగ భక్తిఁగొల్తు నెపుడున్ కామారిదూతుండనై

శా॥ పంపాతీరసరస్సునందుడిగి సద్భక్తిన్ కృతస్నానులై
యింపారంగఁ దదీయసమ్మతకు వారెంతెంతొ తోషించి సం
ధింపంగ న్వరకీశవల్లభునితోఁ దేజోమయు ల్వావు సీ
తంపల్మాఱుఁదలంచుచున్ మదిని సంతాపంబునిండారగన్

శా పూర్వంబందుఁ గబంధరాక్షసుఁడు నిఘ్నామి త్తగన్ బాహులన్
గర్వాంధంబునఁ గన్నుఁగానక వతిన్ కర్మానుసారంబుగన్
పర్వన్వీరిని బాధనంబునకుగా బద్ధప్రరోషాత్ముడై
నిర్వీర్యంబుగఁజేయ వాడును గడు న్నిర్వైరచిత్తంబునన్

శా ఓరాజన్యవరేణ్యులార! కననాకు న్ముక్తిచేకూరె మీ
శ్రీరాజిల్లెడు మోములన్గనగ మీచేత న్కఁడున్ రక్కసుల్
భూరిప్రౌఢినిఁ జత్తురింక వరతద్భూపుత్రియుద్యోగ మా
సారోదారులు ఋశ్యమూకగిరికీశౌఘంబులేఁదీర్చెదున్

శా అపుణ్యాత్ముఁడు నిట్లుచెప్పిచనిన న్నానందచిత్తంబుతో
తాపంబప్పుడుఁగొంతతగ్గఁదగన్ ధైర్యంబుతోనిద్దఱున్
భూపుత్రింగనువాంఛ హెచ్చగఁదగన్ పూర్వోక్తవాక్యంబులన్
యేపున్ ఋశ్యగిరీంద్రమార్గమునకు న్నిత్యప్రమోదాత్ములై

శా॥ నానానూన సరోవరప్రకరముల్ నవ్యాంబుపర్ణాది నా
ధీనంబౌ మునులున్ననేకవిషమోద్దీపంబులై యుండు న
మ్మీ నానేకప సింహముఖ్యములు సద్భీతిన్ వడింజేయు న
క్కానన్నాటిరి రామలక్ష్మణులు లంకాధీశ సంహారులై

శా॥ సుగ్రీవాది కపీంద్ర సంఘవశమై శోభిల్లుచున్ మంత్రియై
యగ్రబందుననున్న పావనితో సువ్యద్భాసురంబై వరో
దగ్రంబైన ప్లవంగవీరులతో సంతానాది సద్వృక్షముల్
యాగ్రావంబులు నుప్పతిల్లగను ప్రేమన్ ఋశ్యమూకంబునన్

శా॥ శ్రీరమ్యంబయి సత్ఫలాదియుతమై సేవింప మూర్ధన్యమై
సారంబైన నదీనదంబుల లసత్సౌభాగ్య సంధానమై
భారంబై కడునమ్రవంతతరులై భాసిల్లుచున్ యోగ్యమై
పేరుంబొందుచు నొప్పు నగ్గిరియు వాపీకూప సంఘంబులన్

శా॥ శ్రీరాముండు సుమిత్రసూనుతో వడిన్ సేమంబుగన్ భాసురం
బై రాజిల్లెడి యగ్గిరి న్మనమునన్ భావించుచున్ చేర నా
ధీరమ్యుండగు ఁగీశనాథు నతిభీతిన్ ముఖ్యమంత్రిన్ హనూ
నారాజద్ఘన పుణ్యనాము నటకు న్రావించి మాట్లాడినన్

శా॥ రామస్వామి పదాంబుజద్వయ సదారక్తున్ మహాభక్తునిన్
ప్రేమంబంపిన వారిఁగాంచి ఘనులౌ మీపుణ్యనామాదుల
న్నేమంబొప్పగ విన్నవించి మఱిమీ రీభూమికిన్ వచ్చుటల్
కామారీజిత శౌర్యధుర్యులనగాఁ గార్యంబు వేఁదెల్పరే

శా॥ హాసంబొప్పగ రామచంద్రుడను నయ్యాగంతుతో మీరు వి
త్రాసం బొందగవద్దు మేము వడిగ న్లక్ష్మీకరంబౌ భవ
ద్ధీసంపన్నులతోడి నెయ్యమును దృష్టింజేయ నిచ్చోటికిన్
మాసంతోషము మీఱ వచ్చితిమి రమ్మా మమ్ము ఁజేకొమ్ము మా

శా॥ భూరిప్రౌఢి నయోధ్యరాజ్యమును విప్రుల్జెప్పుమార్గంబులన్
ధీరుండై తగనేలి నాకమునకున్ దీప్తంబుగానేగి వి
స్తారోదార సుఖంబులన్గనెడి మా తండ్రిన్ ద్విపంచారధున్
గారామారగఁజేయు పుత్రులము నిక్కంబేను రాముండనన్

శా॥ నాతమ్ముండును లక్ష్మణుండును గుణౌన్నత్యుండు సీతండయో
మాతీరున్తగనంతఁ జెప్పితిమిగా భద్రంబు నీనామమున్
ఖ్యాతింగల్గగఁజెప్పు మింకయన విఖ్యాతుండు సామీరియున్
నీతిశ్లాఘ్యపదంబుఁ దత్కధను దానేర్పొప్పగాఁ బల్కెనన్

శా॥ గంభీరంబుగ మేనుపెంచి తగనాకాశంబులున్ మెచ్చ నా
శుంభద్వీర్యుల రామలక్ష్మణుల సత్శోభన్ భుజస్కంధులన్
దంభప్రక్రియఁబెట్టి పావని దిగంతాలాపిత ధ్వన్యుఁడై
సంభాషింపగఁదెచ్చె రాజుకడకున్ సంభూత యుత్సాహుడై

శా॥ రాజీవాక్షులు సింహమధ్యులు నసూరణ్యౌఘ సత్పావకుల్
పూజల్పొందెడు రాజవర్యులు దయాంభోధుల్ల సద్వీర్యస
త్తేజోధుర్యులు రామలక్ష్మణులఁ గీర్తింపంగ సుగ్రీవుఁడా
రాజద్యోజ వెలుంగుచుండ గజరాట్త్రాధీశుఁ బ్రశ్నింపగన్

శా॥ వెల్లంబోయిన మోములంబలికి రావీరుల్ గభీరధ్వనిన్
తెల్లంబోవగఁ గీశనాధుఁడు మదోద్దీప్తుండు లంకాధిరా
జ్యల్లక్ష్మీయుతుడు న్దశాననుఁడు భూజాతన్విలోకించి తా
నుల్లంబందున వాంఛఁజేసికొనిపో నొప్పారె లెక్కింపకన్

శా॥ మాకిక్కార్యముఁ జేసిపెట్టుడన సద్భక్తిన్విలోకించి యో
కాకుత్స్థాన్వయయబ్ధిచంద్ర పెనువీక న్మాకుమీచేత నే
మాకార్యంబును బూర్తిఁగావలయు సుమ్మాయంచు సుగ్రీవుడున్
నాకాధీశకుమారు వాలిచరిత న్నంతం దగం దెల్పుచున్

శా॥ నాకంబెన్నమనుజన్మమంది ఘనుడై నానాహవక్రీడలన్
లోకంబందునవాసికెక్క తగనారూఢ ప్రభావోన్నతిన్
వీక న్రావణుఁబట్టి గర్వముడుగన్ వీరుండునవ్వాలి య
స్తోకాంభోధి మునుంగఁజేసె వెసనత్యుక్తిన్ మదేకప్రియన్

శా॥ భామారత్నము శోభనాంగిని రుమాభవ్యాభిధానన్ గుణ
స్తోమన్ శ్రీయుదురాజబింబవదనన్ దోర్వీర్యుడావాలి స
త్ప్రేమల్మీఱగ నన్నుఁదోలి నయశాలిం దానిఁగొంచు న్వడిన్
శ్రీమంతంబుగఁజేరె నాత్మపురిఁగిష్కింధన్ కపిశ్రేష్ఠుడున్

శా॥ శఠీతిం దగవాలి యిగ్గిరికిఁదానేతెంచి నాతోడిలో
వైరంబు న్మదిలోననుంచి పరుసన్ బాహాబల ప్రౌఢిమన్
సారంబైనయనేక యుద్ధముల నాశక్రాది సంస్తుత్యుఁడై
ధీరుండై క్రమతర్జయించె నను నుద్దీప్తుండు నెవ్వారికిన్

శా॥ పాకారాతియొసంగినట్టి భువన ప్రఖ్యాత సన్మాలియున్
నాకారాతులమానసం హరుఁడు మున్నాజిక్రియన్ దుందుభిన్
మోకాలిం దగఁబాఱఁజిమ్మినతడున్ భూరి ప్రభావాఢ్యుడున్
నాకావాలినిఁజంపి సత్వరము నానందంబుఁ జేకూర్పవే

శా॥ అంచు న్వానరరాజువేడ సుజనానందంబుఁ జేకూర్చుచున్
మంచ్రాముఁడు విశ్రమించి తగనమ్మాడ్కిన్ ఘనున్వాలి దు
ర్వంచంజేసి రణంబులో శమనునావాసంబువేఁజొన్పి శ్రీ
మించన్నీకును నీగిరీంద్రమును నిప్పింతున్ వడిన్ వానరా!

శా॥ ఆసూర్యాన్వయు తీపిమాటలకు నత్యంత ప్రమోదాత్ముఁడై
యాసుగ్రీవుడు పల్కెనిట్లు వెసనీయత్నంబు మేమంతయున్
వీసంబంతయుఁ బోవనీక తగనవ్వీరుండు నారావణుం
గాసింజెందగఁజేయ సీరమణి నిక్కంబిందు వచ్చు న్వడిన్

శా॥ అంత న్నీకులరాజు భక్తియుతుఁడై యారామభూపాలుతోఁ
జింతంజెందుచు నాదుసోదరు వినిర్జింపన్ మదింజూడ నీ
వెంతోమిక్కిలి పిన్నవాడవుగదా యేదేది నీనేర్పు చూ
పం తాళంబుల సప్తమొక్కపరి నేయంజూతుమా యిప్పుడున్

శా॥ ఆ మాటల్విని రామచంద్రుఁడు ధనుష్టంకారముంజేసి స
త్ప్రేమ న్సోదరుడైన లక్ష్మణుమొగం బీక్షించి యాతాళసు
స్తోమంబు న్వడిగన్ చలంబుదనరన్ చూడ్కి ప్రభావంబుగన్
భూమింద్రెళ్ళగనేసె నొక్క విశిఖంబుంబొన్పి హర్షింపగన్

శా॥ సీతారాముల సంతతంబు మదిలో సేవించు భక్తుండు నా
సీతారామశుకంబుసల్పిన మహాచిత్రంపుఁగార్యంబు నీ
చేతోహర్షముఁగూర్చె మిక్కిలిగ నీచేతంబడున్ రాజ్యమున్
యేతాపంబులులేక యుండుమని చెప్పెం దాను సుగ్రీవుతోన్

శా॥ అటోపంబునవాలిఁబిల్చి రణముద్దాంత క్రియంజేయుచున్
గోటస్గీరుచు ఁగాలఁదన్నుచు మహాక్రోధాత్ములై యిద్దఱున్
పోటాపోటిగనిల్చి ఘోర వడిసంపూర్ణంబులై రక్తమున్
సాటింగారగ నెల్లవారలు మదిన్ సంతోషమంద న్వేసన్

శా॥ పారావారయుగంబుమాడ్కి వృషభద్వంద్వంబనన్ భూమిభృ
ద్వారంబన్ తగుపోల్కి సింహముల దుర్ధర్షంపు యుగ్మంబునా
భూరిశ్రీసమద ప్రకాశిత గజంబుల్ బాడ్పునన్ ధీరులై
హోరాహోరిగఁబోరుసల్పి రిలపై హుంకారముల్ చేయుచున్

శా॥ రాముండప్పుడు వృక్షమూలమున సౌభ్రాత్రంబు నీక్షించుచున్
ధీమంతుండగు గాడ్పుసూనుతో రణోద్దీప్తిందగంజెల్పి యు
ద్ధాములీర్వరలు వీరిలోన సురరాడ్ధర్మాత్మజుండెవ్వఁడో
ప్రేమాధిక్యత నాకుఁ దెల్పుమన సర్వీరుండుఁ బుష్పంబులన్

శా॥ గారామారగఁగోసితెచ్చి వటిగం గ్రమంబుగా మాలగన్
శూరుండై తగఁజేసి దానినవటిన్ సుగ్రీవు కంఠంబునన్
పేరుంజెన్ను నలంకరింప ఁదగసంప్రీతాత్ముఁడై రాముఁడున్
నారాచంబును నాత్మమెచ్చి విడువన్ సవ్యంబుగంబోరుచున్

శా॥ వాలంబుల్ వెసఁద్రిప్పుచున్ మటిభుజాస్ఫాలంబులం జేయుచున్
వాలాయంబుగ నింద్రసూనుఁడును దీవ్రధ్వానసతూత్సనుఁడున్
మూలంబన్నెరపదంఁజేయగ రఘూత్తంసుండు స్వద్బాణస
జ్వాలాగ్నిన్ ధరడుల్ల్వఁజేసె ఁదగనవ్వాలిం బ్రచండంబుగన్

శా॥ భూమింగూలినఁ గీశవల్లభుఁడు రామున్నప్డు వీక్షించి యో
రామాధీశ ధరంబడంగను దురాలాపంబు దుష్కృత్యమే
దో మాసోదరుడిప్డు నీకుఁదగ భృత్యుండో వచించెల్పవే
ధామాచోర దశాస్య నిప్పుడువదిన్ ఖండించి నీకివ్వనే

శా॥ చింతంత్సేయక ఁదోరఁజాలక రణస్సీమంబు ఁదప్పించి నీ
వెంతో మిక్కిలి వీరుతంచు ఁబలుకన్ వేఁజెల్లునేనీకు న
న్నింతత్జేయగఁ జెట్టుమాటున ఁదగన్నీవుండగాఁగల్గె నా
చెంతన్నిల్చి దురంబుఁజేసిన నినుంజెండాడి నిల్గింపనే

శా॥ శ్రీరాముండును భక్తిసంభ్రమలసత్సేవల్ తగన్వాలికిన్
గారామారగఁజేసి యిట్లుపలుకంగాఁజెల్లునేనీకు మీ
వారంబంతవనౌకసుల్ గనుక నే వక్రంబుగా నేసితిన్
దూఱంజెల్లునె నన్ను బహ్మకృతముల్ ద్రోపంగ సాధ్యంబుటే!

శా॥ శూవు న్ధర్మపరుండ వెట్లగుదు సుగ్రీవుం దగంబోరులన్
పీవాడంచు మనంబులోనఁదలపు న్లేకుండ నిర్జించి నీ
భానంబందున శంకలే కనుజునద్భార్య న్వడింబట్టితే
యేవంసద్ఘనధర్మమంచు విబుధుల్ యెచ్చోటఁ గీర్తింతురే

శా ఘోరంబై నశరప్రవేదనకు వేకుయ్యంచుఁదానేడ్చుచున్
తారస్నగ్నానిమోముచూచుచు దురోద్ధాముస్వతిస్నంగదున్
గారంబొప్పఁగవుంగిలించి యికడో కాకుత్థ్వసమ్భాష మా
శ్రీరాజిల్లెడుముద్దుసూనుకు భవత్సేవానముల్లాసుడున్

శా ఖావిప్రాగలరాపురావణసుహాప్రఖ్యాతయుద్ధంబులన్
నీవాడై రణభూమియందు వదన స్సైర్పారఁగ్రవ్యాదులన్
వేవేసంఖ్యలఁదాను ఘష్టిహతులవ్వీరంబుఁదోరంబుగ
న్నావేగన్ యమపట్టణంపుదెసకున్నంపున్వడిన్ రాఘవా!

శా ఈరాజ్యద్వయమున్మదీయసుతునిన్ యీనాదుసద్భార్యనున్
యారాజిల్లుపవిత్రసూనునకు నేనర్పించితిన్ బుద్ధితో
నీరమ్యంబగుమోముఁగాంచుచును నానిండారుసద్భక్తిచే
నీరేజాక్ష వికుంఠలోకమునకు న్నేనేగెద న్వేడ్కతోన్

శా శ్వాసోచ్ఛ్వాసలుఁదగ్గెనాదుబలమున్ సంపూర్ణమైపోయెడిన్
యాసల్పీడుడుయందఱున్ క్రమముగన్ హర్షించుచున్ వోరులన్
వాసిగ్గాంచితి మర్త్యలోకమున నేవత్తున్ననెన్వాలియున్
యాసుగ్రీవనలాదివానరులుఁజూడన్నోపె నావాయుపుత్

శా అతీమన్కాపికోటియంతయును నవ్వాలిన్తగన్ మోయుచున్
ప్రేతాసీకములుండుచోటికి లసత్ప్రేమన్వడింజేర్చ సం
జాతుండై నదినేశనందనుఁడు సంసర్గంబులంజెప్పి త
జ్జాతాగ్నిన్దహియింపఁజేసెఁదనువున్ సామాజికుల్మెచ్చగన్

శా కర్మంబుల్తగఁజేయనిద్ధరణి లోకంబంతఁబుట్టించుచున్
మర్మంబుల్తగఁజేయుచున్మనుపుచున్ మాయించుచున్ వేడుకన్
ధర్మంబిందుఁదగంగనిల్పుచువడిన్ ధర్మంబుభేదించుచున్
శర్మంబొందుచునుండు కేశవునినశ్రాంతంబుధ్యానించెదన్

శా రామాధీశుఁడుఁదానుజెప్పినప్రకారంబన్ తగన్వాలి నీ
భూమిన్లేమిగఁజేసెనొక్క ప్రదరంబున్నాటివక్షస్థలిన్
ధీమంతుల్గొనరింపకుండుదురె కీర్తింజెందుచున్ రాఘవున్
ప్రేమన్నామునిఁజేరెనంతటను సుగ్రీవుండుమోదాత్ముఁడై

శా కాకుత్థాన్వయబ్ధిచంద్ర ధనుభంగాదీనసంరక్షణా
నాకేశాత్మజనాశ దైత్యహరణానానాఘసందగ్ధ కా
లోకేశా దివిజాధినాధ వినుతాలోలంబతూణీర నీ
సాకల్యకృపచేమదాశయమిదే సంసిద్ధినొందెందుదిన్

శా నానావానరజాలమంతయును విన్నాణంబులొక్కేశరా
ట్థానాధీశునివాక్యముల్విని మదిన్సంతోషమొప్పందగన్
యానాకాధిపుఁబౌత్రుఁబుణ్యుయువరాజప్ధ స్మటించవమ్మనిన్
యానందంబునరాజుఁజేయుమని యంతన్ రాముని న్వేడగన్

శా ఆరాజన్యుడు నట్లెయంచుఁబలుక న్నాపందచిత్తంబులన్
ధీరుల్వానరవర్గమంతయును బుద్ధింజాలతర్కించి యా
పారావారచతుర్విధాయకముగా బ్రహ్మండముల్ మెచ్చగన్
నీరంబుంబరిపూర్ణహేమకలశానీకంబులందెచ్చినన్

శా ఖాపిల్లంగఁబురంబుఁజేరి తగసద్భార్యన్సమంబ్రీతుఁడై
యాసీమంతినితోడఁగయ్యపుతెఱంగంతన్వడింజెప్పగన్
యాసీతాహృదయైకచోర కృషియెంతైనన్ జనస్తుత్యమై
వాసిల్లుండగనిందునందునసె నవ్వాలింగడున్ దూఱుచున్

శా ఈరీతిందగనాడినట్టివిభునిన్ యింపొందగామెచ్చి వి
స్మేరంబౌముఖమండలంబున రతిన్ శ్రీరామభృత్యున్ వడిన్
గారామారగఁగౌగిలించఁబిదపంగాలోచితప్రక్రియల్
ధీరత్వంబుననర్కజుండు సలిపెన్ తృప్తిన్ రఘుస్వామినిన్

శా. పూజల్సేసి పదాంబుజాతయుగముంబూజింపగంధాది స
ల్లాజానేకపుఁగ్రమవస్తువులచేరంభాదికంబంబులన్
భ్రాజాధిక్యరఁజేసిపందఱునుశుంభద్గీతవాద్యంబులన్
తేజోధిక్యతఁజెందెనట్టియెడఁగీర్తింజెంద నవ్వేళనన్

శా. నానారత్నవిచిత్రభూషణముల న్నామండితంబై తగఁ
భూనాకంబులుసన్నుతింపగ నొగింబుష్పాదిసంవృత్తమై
ఆనందాబ్ధితరంగడోలికలనూగాడఁ నియన్మండలం
బానీతాదిసురాసురప్రకరయక్షస్సిద్ధమైయుండగాఁ

శా. ఆనాడిచ్చినవాక్యపద్ధతిని సుత్రామాదివంద్యుండు వి
జ్ఞానజ్యోతిపరాంగనావనజభాస్వచ్చంద్రుడుఁ రాముడున్
తానాభాస్కరపుత్రహస్త జలజాతంబందుఁగ్రొవ్వారినిన్
చేనాపోశనమొన్పఁజేయుటకు నాశీతాంశుబింబాననఁ

శా. పాతివ్రత్యగుణాభిరామను రమాభద్రేభకుంభస్తనిన్
పూతంబైనపసింటిగిండియుదకంబుంటోయఁబిల్వందగన్
ఖ్యాతిన్నామెమొగంబువాంచియరుగంగానట్లుగాఁజేయ పె
న్ప్రీతింగూడిన కీశరాజ్యయుగముంటోషింపుమంచున్వడిన్

శా. పట్టంబుందగఁగట్టెరాముఁడుఁగడున్ భక్తాళిసుశ్రేష్ఠునిన్
కట్టెన్రక్షనుబుక్షవల్లభుడుసత్కాయుండు సౌమిత్రియున్
పెట్టెన్నప్పుడుసత్కిరీటముఁదలన్ ప్రీతుండుసామీరియున్
పట్టెన్ఛత్రముఁగీశనాథునకు సొంపారంగనాతండునున్

శా. సంతోషించిరి మర్కటాధిపులుఁగీశస్వామియున్రాముడున్
వంతల్మానిసుఖించిరందఱుఁగృపాపాథోధి సీతాధిప
న్స్వాంతౌగీతములాడిపాడిరి బుధానీకంబుఁదోషిల్లె వే
పంతంబైనసుకృత్యముందగఁగృతంబైనట్లు వారందఱున్

శా॥ శ్రీనీరేజదళేక్షణాయుతుని సత్సీతామనోనాయకున్
పానీయాజసునేత్రముఖ్య వివిధబ్రహ్మాదిసంస్తుత్యునిన్
నానామౌనివరేణ్యసంకటహరున్ నారాయణాంశోద్భవున్
ధ్యానంబున్నతిఁ జేయుచుండె సతముం దద్వాతసూనుం డొగిన్

శా॥ దేవేంద్రప్రతిమానరాజ్యవిభవోద్దీప్తుండు సద్భాగ్యతో
భావోద్భావకక్రీడలం దగిలి దుర్భావంబులం గూడుచున్
భావంబందున రామకృత్యమును దుష్పంథన్విలోకించి తా
నేవంశోత్తమసద్గుణుం డనుచు మన్నిలుంపుసుగ్రీవుడున్

శా॥ తామున్నాడిన సత్ప్రతిజ్ఞ మదిలోఁ దప్పించి యజ్ఞానుడై
భామారత్నమునారుమన్వినిధ సంపర్కంబులం బ్రీతుఁడై
కామాధిక్యత హెచ్చువానఁయుడు సత్కార్యముండుఁ బ్రేరేపఁ దా
నామాధుర్యమునందుఁ దోఁగి మఱచెన్నా రామసత్కార్యమున్

శా॥ చింతం జెందుచు రామచంద్రుఁడు వడిన్ సేవించు సౌమిత్రితో
మంతంగన్గొని నీవు నర్కజుని శుద్ధాంతంబునుం జొచ్చి సా
మంతుల్ చూచి కలంగ నాదు భయదంబౌ తీవ్రవాక్యంబులన్
సంతోషంబునఁ జెప్పుమందుఁ బనిచెన్ శాంతుండుఁ గిష్కింధకున్

శా॥ గంభీరంబగు రామవాక్యముల సంఘంబుం గా స్వచిత్తంబుతో
శుంభత్ప్రక్రియ నెట్టి లక్ష్మణుఁడు నా సుగ్రీవునంతఃపురి
స్తంభుండై వడిఁ జేరి యచ్చట సుఖానందాత్ముడై యున్న వా
గ్రంథున్ వానరరాజుఁ జూచి మదినుగ్రండై నవాక్యంబులన్

శా॥ స్త్రీలం గూడి తదీయసౌఖ్యముల సుగ్రీవుండ నీవుంట నీ
లోలత్వంబును జెప్పుచున్నది కడున్ రోషుండు నా రాముడున్
మేలౌ రాజ్యముఁ జిక్కెనంచుఁ గడుసంప్రీతుండవై పోదుమా!
వాలిం జంపిన బాణమున్నదచటన్ భద్రంబుగా వానరా!

శా నీకార్యంబునిమేషమందున వడిందీర్చెన్ విభుండప్పుడున్
యీకీశాధిపతిత్వమిచ్చెగద నీకిప్డున్ రఘుస్వామి మా
దౌకార్యంబుఁబరిత్యజించితివి నీదౌదుష్టదుర్బుద్ధిచే
నాకారామునియానలేదు తగనిన్నంతంబునొందింపగన్

శా భారంబైనవియోగతాపమున నస్మద్భ్రాతయందున్న నీ
వేరీతిన్స్మరతోపభోగములఁదృప్తింజెందుచున్నాడవో
క్రూరాభీలశరాగ్నికీలికల నీకుంజావులేకుండ నా
శ్రీరామాధిపుఁగార్యమంతయునువేఁజేయింపుసూర్యాత్మజా!

శా ఈవాక్యంబులురామదేవునివిగా నెంతన్మదింబెట్టు మీ
చావుంబొందకయుండుమన్నవడిగన్ సౌమిత్రినీక్షించి నా
భావంబంతయుదుష్టమయ్యె సతతంబీయౌవనక్రీడలన్
నేవర్తున్నికరాముసంస్థలికి నన్నీక్షింపుమోలక్ష్మణా!

శా పంపింతుందగరామదేవినెమకన్ భద్రంబుగాఁగోతులన్
పంపింతున్వడినాల్గుదిక్కులకు సద్బాహాబలప్రౌఢులన్
చంపింతున్నలరావణాసురుని విశ్వంబందులేకుండ మీ
రింపొందన్వడిఁదీర్తునంచుఁబలికెన్ వేగంబుగాఁగీశుడున్

శా ఆసౌమిత్రియుఁగీశవల్లభుడు రాగాయాంజనేయుండుఁదా
వాసింగాంచిపిఱుందఁబోవఁగఁగరంబారామనామంబుఁజే
రాసంజేయుచుసత్వరంబవనిజారాముండుఁజింతిల్లుచున్
యాసామీప్యమునుండుసంస్థలికి నట్లయ్యందఱుంబోవగన్

శా దూరంబందుననుంచి సూక్ష్మముగనాదుష్టుండు సుగ్రీవునిన్
యారాముండువిలోకనంబునఁగపంబాలోచనంజేసి యా
క్రూరాత్ముండిటువచ్చుటంగల మహాగూఢంపుఁగార్యమ్ము నే
తీరున్నొప్పునొ నామనంబునకుసందేహంబుఁదోచెన్కటా!

శా అంతన్భక్తివిరోచనాత్మజుఁడు సమ్యక్స్వపలంబేసి నీ
చింతన్మానుము నేనువీ ర్తనసుచున్ సీతావిభున్ బోధలన్
సంతాపంబును వేగఁదీర్చిపిదపన్ సౌమిత్రితోఁజెప్పి నా
వింతౌదుష్టచరిత్రమంతయును నీవే తెల్పుమీయన్నకున్

శా ఆవాతాత్మజుడంతకంబె మును పేనంతస్వపింపెల్పి స
ద్భావంబిప్పుఁడుఁగల్గెసూర్యజునకున్ బంధింపఁబల్లేదు మీ
దేవిన్నిప్పుడె చూచిరాగలరు సిద్ధింజెందునీకార్యమం
చున్ వేదాత్మకభావుతోడ మెఱయన్ సూక్ష్మంబుగన్నప్పుడున్

శా నీనామంబుభజించునోరును గనున్నిన్గాంచుచక్షుద్వయిన్
నీనైర్మల్యకథల్వినుశ్రవణముల్ నిన్గోరుహస్తంబులున్
నీనిండారుపరీమళంబున ఘువిన్నేర్పొందుఘ్రాణాగ్రమున్
మానంబూనకనిమ్ముగాకనెతగన్ వాతాత్మజుండిట్టులన్

శా నీజన్మంబునుధన్యమైపఱలుటో నీసత్త్వరూపంబుచే
యాజన్మాంతము నాదుభక్తి మతమున్నానంచు రాముండనెన్
మీజాగ్రత్తలునాదుకార్యమునకై మీకోతులందిల్వుడీ
యీజాగున్విడిపించివేగమున నెంతేశక్తిఁజర్పింపుడీ

శా గంధేభంబులశౌర్యవంతులు మహాగర్వుల్ భుజక్రీడలన్
పంథల్వాట్టియరాతివీరులవడిన్ ఖండింత్రుయుద్ధంబులన్
యంధీభూతులుఁగాకయంచఱును యుద్దండుల్ కపిశ్రేష్ఠులౌ
బంధునీలనలాదిమైందద్వివిదుల్ ప్రజ్ఞానిధుల్ యన్నిటన్

శా ఆసుగ్రీవకఠోరశాసనమునందవ్వానరుల్ బద్ధులై
వాసింగాంచితదీయసైన్యములతో భద్రంబుగావచ్చినన్
యాసీతావిభునానతిన్కడిమిమై నాకీశసత్కోటినిన్
యాసూర్యాత్మజుడప్డునంపెదగనాహాయంచు నల్లిన్కలన్

శా. ధీయుల్వానరవారమంతయును నుద్దీప్తస్ఫురణక్రీడలన్
గారామారగ లక్షకీశసము దాయంబప్పుఁ బ్రాగ్దిక్కుకున్
వీరున్నా వినతాసునాముతగ బుద్ధిన్ చాలయోచించి సం
చారంబున్ప్రతిఁ జేయఁబంపెనల భూజాన్వేషకార్యంబునన్

శా. ద్వాసాహస్రకపిప్రదీప్తులవడిన్నద్దంపెఁ గాల్దిక్కుకున్
మీసామర్థ్యముఁ జూతునిప్పుడుఁ దగవ్మీశక్తులంజూపుడీ
యీసీతాసతిదైనవార్తఁ గొని తెండీమీకు మేలయ్యెడున్
యాసుత్రామభవాదిదేవతలు వేడ్కన్ మిమ్ము రక్షింపరే!

శా. పొంగుల్వారగ మైథిలిన్వెదకుచుం బొండీ మిముంబ్రోచు వీ
కంగర్వాంధనిశాచరప్రకరసత్కాలుండు రాముండె మీ
సంగంబుం బ్రదయలక్షమర్కటులు వేఁగాగేలఁ బొండంచు న
య్యంగాధీశుని నీలునంపెవడి సంధ్యాదిక్కుకున్ ప్రీతితోన్

శా. కాశీపట్టణముండువైపునకు లోకస్తుత్యమౌనట్లుగా
యాశిష్యున్ వరునిన్ శతావలిఁ గడున్నాధుం దగంజేసి మీ
యాశాపాశము తెల్లవచ్చి యికఁ బొండంచున్ పదేన్లక్షలన్
యాశీషంబులుఁ జేసిపంపెవడిగన్ యారామకార్యార్థమై

శా. మాసంబున్గడువిచ్చెదన్ పరగ రామాధీశకార్యంబు మీ
ధీసంపన్నతమీఱ రాఘవుసతిన్ దీప్తంబుగన్ చూడమిన్
మీసంతోషముఁ దగ్గఁ జేయుదును కుంభింజంపుసింహాకృతిన్
ఖూసంచారముఁ జేసిరండని వచింబుచ్చెన్విభుండంతటన్

శా. వీరాగ్రేసరుడంజనాతనయుడున్ వృత్రారిసంసేవ్యుడున్
ధీరంబైననిజాత్మదేహుని మహాభక్తుండుసత్పుణ్యుడున్
గారంబొప్పగనంపయామ్యదిశకున్ కార్యంబుసాధింపగన్
యారాముండుఁ గరంబురాఁ బిలిచి యిట్లాడున్ ముదుత్ప్రుతతోన్

శా. సీతాన్వేషణకార్యధుర్య! హనుమా! నీసుంతినింజూచి యే
భీతింజెందకలంకకేగి యటసంప్రీతుండవై సీతతో
సాతత్యంబగుబుద్ధిఁ దెల్పి వడినీస్వర్ణాంగుళీయంబు నా
చేతోమోదమునిచ్చిరమ్మనుచుఁబంచెన్ రామభద్రాగ్రణిన్

శా. మీకారుణ్యకటాక్షవీక్షణమునన్ మీపాదపద్మంబులన్
సాకల్యంబగుభక్తిచే సతతమున్ శ్లాఘించుచుంటోయి మీ
దౌకార్యంబుఫలంబొనర్తు భువియందప్పిమభక్తుండనన్
నాకాపేరునొసంగఁజేయుమనియెన్నవ్వాతజాతుండొగిన్

శా. సంతోషంబునరామకార్య కరణోత్సాహంబువర్ధిల్ల నీ
మంతుల్వానరవర్గముల్గిరుల నేమంబొప్పగాదాటి య
ల్లంతన్బొరమణిన్ స్వయంప్రభగుహన్ రాజత్పటీరోదకం
బుంతంత్రీస్వనమోదితంబగుచు నొంపుంజెందియాస్ఫూర్తిగన్

శా. శ్రీరమ్యంబయియప్పరోవనితమై చెన్నొందుచున్ గన్పట్టె
యారామాదిసరోవరాగత పికస్వంబారసధ్వానమై
భారంబైనవధిశ్రమన్గెడపి శంభత్తోషముంగూర్చు నా
శ్రీరాజిల్లెడుదానిఁగాంచిరి కపిశ్రేష్ఠుల్ ముదంబందుచున్

శా. మోదంబందుచువీణనాదమును శంభోదాత్తకంఠంబుతో
భేదంబింతయులేకనొప్పిలయముల్ విశిష్టగానంబునన్
వాదంబుల్వడిఁజేయుఁదానిఁగనిశశ్వద్భక్తిఁగేల్మోడ్చి యీ
భేదంబొప్పెడురామగాధను పరీభిన్నాత్ములై చెప్పగన్

శా. లంకానాథహృతంబునౌటకుమదిన్ లంకేశ్వరుద్ధూఱుచున్
శంకాతంకములేకమీరువడిగన్ సంద్రంపుపెన్మార్గమున్
బొంకంబందగఁబట్టిపోయి తగనాభూమీశుకార్యంబు నా
టంకంబేదియులేక సాగుననివేడ్కన్నామెవీడ్కోల్పినన్

శా॥ ఆసంగీత నితంబినీ వనసముల్లాలించి యూవానరుల్
ఘూసంచారసమతిక్రమించి తుదకున్ పూర్ణేందు సందర్శనో
ద్యత్సంతోష తరంగిణీ నివహమై తత్పూర్ణవార్ధింతు సం
త్రాసంబొప్పెడు దానిఁగాంచిరి రణోద్దాముల్వడింజెంగటన్

శా॥ రంగత్తుంగతరంగ సంగతము చంద్రానేకలింగంబునై
పొంగుల్వారు సరిత్పతిం గని జలౌపుంజంబునన్ స్నాతులై
భంగంబొందక దాని దాటు తరుణోపాయంబుఁ జింతించుచున్
హంగుల్మీఱగఁగూరుచుండి రిలపై హర్షంబు డిందంబుగాన్

శా॥ పక్షిశ్రేష్ఠుఁడు దారవంతుఁడు రణాభంగుండు సంపాతియన్
దక్షత్వంబున సూర్యుఁజేరెడి మహాదర్పంబుఁ బక్షానిలా
విక్షేపానలవారుఁడప్పుడు పడిన్ వీరంబుఁదోరంబుగా
భిక్షార్థంబున వచ్చి మర్కటులఁదా వీక్షించెఁదోషంబునన్

శా॥ వీరాగ్రేసరుఁడా దశాననుఁడు నుద్వేలంబుగా సీతతో
నారాజద్ధ వడింబొకాలుట మదిన్నానాను యంచాకపుల్
ధీసంధైన జటాయువర్యుఁడుఁగడుం దీవ్రంబుగాఁ బోరినన్
క్రూరాసిందెగనేసెఁ బక్షములనిట్లుష్ణంబుఁ జెప్పంగఁదాన్

శా॥ మీరెవ్వారలు యిందునుండుట గతంచేదంచునాతండున
వ్వారంబుందగుఁ బ్రశ్నసేసి మిములన్ భక్షింతునంచున్ ఘనిన్
గారామారగడిగ్గ సందఱును దుఃఖాధీన చిత్తంబులన్
సారస్వామువచస్సమూహమున నాసంపాతితోఁ బ్రీతిగన్

శా॥ కౌసల్యాత్మజు భార్య రావణుని దుర్మాయాపహృత్తంబునై
యాసంక్రందనతుల్యు రాముసెడబాయన్మేము సీతార్థమై
ఘూసంచారమొనర్చుచున్నిపుడు నంభోధిన్వడిన్ దాటగన్
ధీసంపన్నత డిగ్గ వచ్చితిమి యాదివ్యాంగనోక్షంబులన్

శా॥ కారుణ్యాధిక మానసుండవయి వేగన్మమ్ము రక్షింపవే
భూరిశ్రీయశ। యన్న వానరుల సద్బుద్ధిన్ విలోకించి యా
శ్రీరామాధిపు కార్యధీయుతులె మీసేమంబు వెల్లప్పుడున్
సారంబొప్పగఁ గోరుచుండుదుననెన్ సంపాతియున్ వెంటయున్

శా॥ లోకంబందున రావణుండుఁ దరుణీలోభుండు మీసీతఁదా
వీకంబట్టి చెఱందగిల్చి రణభూమింబక్షి తాపాటి మీ
కాకార్యంబుఁదలంపనేఱక యశోకంబందు శింశూపమ
న్నాకల్యాణ తరుప్రదేశమున విజ్ఞత్వంబున న్నుంచగన్

శా॥ శూరోదగ్రులు మీరు సత్వరమునన్ శుభ్రంపుఁజార్రిరులై
పారావారముదాటి రావణుని వేఛంబింపు డన్నంగపుల్
వీరాగ్రేసరనీదు పక్షములు భస్మీభూతమయ్యెన్నయో!
యేరీతిందగవచ్చుఁదత్కథను మాకింపొందగాఁబల్కవే।

శా॥ శ్రీమీఱంగజటాయు సోదరుడ మీసేవల్కడున్ మెచ్చితిన్
యామార్తాండుని మండలంబునకు నిత్యంబున్ వడింటోపను
ద్దామార్చిల్వడి నాదుపక్షముల దగ్ధంబొప్పగాఁ జేసినన్
నామాలిన్యముఁబాపి సూర్యునిఁదగన్ మన్నింపవేయంచనన్

శా॥ శ్రీవైకుంఠుఁడు మేదినిన్ఖలుల శిక్షింపంగరామాఖ్యతో
యావైవస్వతు పట్టణంపుదెసకు న్నవ్వానరానీకముల్
వేవేలంబనుపన్ సముద్రతట సంభిన్నాత్ములై యుండనీ
వావంతన్దయతోడమాన్పిన రయంబన్వచ్చు నీపక్షముల్

శా॥ సంతోషించుమనేను వేగమున నాచండాంశునింబాసినా
స్వాంతంబందున నర్కవాక్యముల సద్భక్తిన్ మదింబెట్టి మీ
కంతంజెప్పితి వెంటియున్నలిగె నస్మత్పక్షముల్ నేనికన్
యంతర్వీధినిఁబోదు నంచునతడట్లంజేయ నక్కీశులున్

శా॥ గంభీరంబు శతప్రయోజనము నిక్కంధిన్వ డిందాటి యా
శుంభత్సౌధతలాది సేవితలసత్శోభన్ వెలుంగొందుచున్
జంభారాతిసుసేవ్యలంకపురి నాసంజొచ్చు వీరుండు దో
ర్దంభత్వంబునమద్గిరాగల బలోద్దాముండు నెవ్వండిటన్

శా॥ అంచున్వానరజాలమంతయును నాహాయంచు సంరంభులై
చంచల్లీలల యోచనల్సలుపనాసామీరి భావంబునన్
ప్రాంచద్భూషణు రామునిందలచుచున్ భక్తిన్విభుం బాడుచున్
సంచారంబును లేకచింతిలిగ వింజాతుండుఁబంపద్దశన్

శా॥ దూరంబౌనరయోజనంబులువదిన్ దోర్లీలనే దాటుదున్
శూరుండైన నలుండు షష్ఠదశలున్ సూతుండు సప్తద్దశన్
సారంబొప్పగ మైందనీలులుఁదగన్నష్టద్దశా దూరమున్
వీరుండా ద్వివిదుండుఁ దొంబదియు నొప్పెన్ దాటగా నెంతయున్

శా॥ పాకారాతియనుంగుఁ బౌత్రుఁడుఁదగన్ భాసిల్లు నయ్యంగదున్
నీకార్యంబు వచింపుమన్ననతడున్ నేనంతయున్ దాటెదన్
లోకస్తుత్యముఁగాగఁగాని మగుడంలోఁజొచ్చి రాలేనుగా
నాకున్నట్టి బలంబుఁ జెప్పితిననన్నాభల్లుకం బంతటన్

శా॥ బాలుండైన తఱిన్వడిన్ శిలలకుంభత్పాదఘాతంబులన్
కూలంజేయుచు నుంటినేనునిపుడుం గోల్పోతినాశక్తి నా
కాలంబిప్పుడురాదుగాన దయతోఁగావుండునన్నంచు స
ల్లీలం దగ్గఱివాయుసూనుకడకున్ లిప్తన్ ముదంబందుచున్

శా॥ భూరిప్రాభవఖండ దైత్యయని సంబోధించి యోతంద్రి నీ
వారుద్రాంశమునందుఁబుట్టిన మహాభక్తుండవున్ సంతత
శ్రీరామాధిపు కార్యనిర్వహణ సంచేతస్కుఁ డౌనంచునా
ధీరుల్వారిజగర్భులాదిగనినున్ దీవించిరప్డున్ దయన్

శా॥ విశ్వంబందున నిన్నుగెల్చుసుబలాభిజ్ఞుల్ తగన్లేరుగా
శశ్వత్కీర్తి నిఁబుచ్చుకొమ్ము వడిగన్ సాధించి కార్యమ్ము నా
విశ్వామిత్రపు వర్గమున్నెడపె నిర్వీర్యంబుగం జేయుమా
విశ్వామిత్రుని శిష్యసంతతికి నీవే రక్ష యెల్లప్పుడున్

శా॥ ప్రాణంబిచ్చి జగంబులన్మనుచు సంపన్నుండు నీ తండ్రి స
త్రాణం బిచ్చును దీనులంగనుచు చింతాదూరయై యొప్పుచో
కోణంబందున భర్తృసేవలను సంకోచింపకం జేయునా
యేణీలోచన తల్లి ముజ్జగములన్నింకెందు నీడున్నదే!

శా॥ నీసామర్థ్యమెఱింగియే జనకజానేత్రాబ్జ భానుండుఁదా
భానుండైన పరాంగుళీయకమును యుష్మత్పుణ్యహస్తాంజలిన్
ధీసంపన్నతఁబెట్టె దేవికిడగన్ తృప్తిన్ ముదంబందుచున్
యోసామీరి భవద్బలంబునను నీయుద్యోగముం జేయుమా

శా॥ నీకా బ్రాహ్మణశాపముండుకతనన్ నీసర్వవీర్యంబు నీ
సాకల్యంబగు మానసంబునకు నీషద్వైఖరిన్నొప్పు నీ
లోకంబంతయుఁ బ్రస్తుతించునని భల్లూకేశ్వరుండాడగా
యాకీశుల్వెలుగంది తత్కథయుదంతంబెల్ల వాక్రువ్వవే

శా॥ సాహోదార వచస్సుమూహ యని విజ్ఞప్తుల్పతింజేయగా
ధీరోదాత్తుఁడు జాంబవంతుఁడుగుణోద్దీప్తిన్ వెలుంగొందు
శ్రీరామాధిపు భృత్యసత్కథను సంక్షేపంబుగాఁజెప్పె నా
రౌరాయంచని కీశులందఱు మనోరంజిల్ల మెప్పన్వినన్

శా॥ బాలార్క ప్రతిమానరూపుడయి సద్వ్యాహారలోవగ్రుఢై
లోలుండై తగఁజిత్రభానుని మదిన్ రోషించి పండంచుఁదా
జాలుండయ్యును నభ్రవీధికి రయంబన్ బోయి ప్రమింగంగనో
కాలంతతన్వేఁజెంది తండ్రికడకున్ కంపించుచున్ వచ్చినన్

శా॥ ఆరమ్యాకృతి కద్భుతంబగుడు దేవానీకముల్ మ్రొక్కియా
మారుత్ప్రాభవనీదు సూనుఁడవడిన్ మాకెంతయున్నెగ్గఁగా
నోరుంజాచి నభోమణిన్గుటకలో నొవ్వంగఁజేసెన్మతిన్
నీరూపంబు హరింపఁజేసితివిగా నిందారతోషంబునన్

శా॥ త్రేతాగ్నుల్వడిఁజల్లనయ్యె జగమంతిర్లుస్తగంగ్రమ్మె నా
ప్రాతఃకాలవు కృత్యజాలములు సంపాతంబులై పోయెగా
భీతింజెందెను లోకమంతయును మా విజ్ఞాపనల్నమ్మి నీ
చేతోవృత్తికి నచ్చినట్లు మము రక్షింపంగృపంజూడవే

శా॥ అంచున్దేవతలందఱొక్కటిగనయ్యా మాదు ప్రాణంబులన్
చంచల్లీల నొసర్పుమన్న నతడున్ సంప్రీతితో వాయువున్
మించన్లోకమునందుఁ బంపసుతుడున్ మేలంచుఁ జండాంశునిన్
పంచత్వంబును బొందకుండ విడిపింపన్వేగ భాసిల్లగన్

శా॥ కీర్తింసంగ సమస్త దిక్పతులు సత్కీర్తిన్నితండొందనన్
యార్తత్రాణపరాయణత్వమున భంగంబొందకన్నన్నిటన్
వర్తించున్నని దేవతల్వలుక నాబ్రహ్మాస్త్రమున్ వీనిపై
హర్తిన్స్వల్పకయుండు నేడు ఘుటికల్ యాతండువంతంబడున్

శా॥ దేవజ్యేష్ఠుఁడు సెప్పనందఱును వేదవించియబ్బాలకున్
భావంబందున సంస్మరింపుచును సద్భక్తుండితండంచునా
నావాహంబుల నాత్మసంస్థులకు న్నష్టున్ వడింబోవగన్
యావాతాత్మజుడు న్మునీంద్రులను సద్యస్స్ఫూర్తిగన్ డాయగన్

శా॥ శ్రీనారాయణనామ సంస్మరణసత్సేవన్ వెలుంగొందుచున్
భానూతుల్యవర ప్రభాకలితుఁడై భాసిల్లుయోగీంద్రు స్వ
స్థానంబుంగదలించిమైను నొఱవల్ చక్కన్వడింజేయ వి
జ్ఞానజ్యోతి మునీంద్రుడుంగనలిరూక్షంబైన నేత్రంబులన్

శా॥ ఓరీదుష్టవనౌకసా! మనులనిట్లుంజేయ సత్కార్యమే
యేరీతిన్నిటుఁజేయనీకు మనసొప్పెన్ యేమిమాట్లాడవే
నారాచంబులఁబోలు నాదుపలుకుల్ నవ్యంబుగా నిన్ను నా
ఘోరంబైన తమంబున న్నడియగాఁ గూలంగఁద్రోయుస్వతిస్

శా॥ నీలావణ్యపరాక్రమంబు మఱియున్ నీబాహువీర్యంబునున్
నీలోనుండియు నీవెఱుంగవితరుల్ నింజూచి యగ్గింపగన్
యూలాపుంజలముంగడింది తపము న్నాశ్చర్యమౌనట్లు ని
ర్మాలిన్యంబగు నీదు బుద్ధికిని శోభందోచు నిక్కంబుగన్

శా॥ ఈరీతిన్ మునిచంద్రశాపహతనుండీ యాంజనేయుండు నా
శూరత్వంబు నెఱుంగలేక యిపుడున్ శోకించుచున్నాడు మీ
ధీరత్వంబులు హెచ్చఁబాపనిని శుద్ధింజెందిస్తోత్రంబులన్
పారావారగభీరుఁ జేయుడని తద్భల్లూకవర్యుండనన్

శా॥ సీతాసారసనేత్ర రావణుని దుశ్శీలంబునన్ లంకకున్
గీతల్ శోకపరీతచిత్తయయి వేగిపెట్టుచుంబోయి త
త్పాతివ్రత్య గుణాధికంబునలసత్ప్రాణేశ్వరున్ రామునిన్
సాతోషంబున సంస్మరింపుచును నాసల్చెందు చుండెన్నటన్

(కిష్కింధాకాండము-సంపూర్ణము)

# సుంధరకాండము

---

మ॥ నవరత్నాంచితసింహపీఠమున విజ్ఞానస్వరూపుండునై
దివిజశ్రేణిని రక్షసేయుచు మదోద్దీప్తుల్ సెలంగన్ జగన్
బపరంబందున వారిమూపుచుఁ బ్రజంబాలించుచుం బ్రీతి మా
నవుడై వెల్గెను వంశభూషణుఁడు సన్నాక్రాంతము న్మోదమున్

మ॥ కపినాథుల్ మతిజాంబవంతుడును దత్కారుణ్యమొప్పారఁ జే
యుపదేశ స్తుత వాక్యజాలభవ సద్దోర్దర్ప విభ్రాంతుడై
తపనోత్తుల్యవిరాజమానుడగుచుం దత్వాతసూనుండు నా
విపరీతంబగు కంధిదాటగను నుద్వేగంబునన్ మింటికిన్

మ॥ అవలీలంజని వాలమున్ విసరుచున్ హర్షంబుఁబెంపారగన్
నవలావణ్యతరంగిణీనిచయమై నవ్యాంబుపూరంబుతో
వివిధక్రూరతిమింగిలాది జనసంభీతిన్వడిన్నిచ్చు మా
నవపాపౌఘనివారిణిం గనుగొనెన్ సంద్రంబునుం జెంగటన్

మ॥ సతతోద్యజ్జయశబ్దముల్సెలగ భాస్వత్పూర్ణయుత్సాహులై
గతినాపావనిఁగాంచి వానరులు భంగంబుల్ పఠింజూడ నా
తతవాయుధ్వని హోరుపెట్ట నతడున్ తథ్యంబదృశ్యంబుగా
గ తదీయంబగుమార్గముంగనుచు సంఘంబంతయున్ నివ్వెఱన్

మ॥ సగరత్క్ష్మాసుతకృద్ధునీవిమలమై సస్యంబులంబ్రోచుదా
ని గురుత్వంబునధాటుచుంగనియె నానృత్యధ్వనుల్ సెందగన్
నగరాజంబు మహేంద్రశైలమును దానత్యంతమోదాత్ముఁడై
నుగమంబై యలసారసధ్వనుల సంక్షోభిల్లుదానిం దగన్

శా॥ రమణీయంబగు పక్షిసంతతులకోలాహలంబు దివ్యాంగనా
కమనీయంబగువీణనాదములు సద్గంధర్వసిద్ధాళి దే
వమహాత్ముల్చరియించుతావులును శుంభత్ప్రీతిఁ దాఁటిక్క వే
గమునన్ శ్రాంతినిఁగొంచు దాని పయినెక్కన్వాయు దీవింపగన్

మ॥ పటుసంత్రాణమహాశరీరుఁడయి తాబాహాబలోదగ్రుఁడై
యటశైలంబునుదాటి పోవగను జంభారాతిబృందంబు స
స్ఫుటవాక్యంబుల సంస్తుతింపగను సంపూత్కారముల్ చేయుచున్
కటిచేలంబుబిగించి వార్ధికినిలంఘుంజేసెఁ గార్యార్థుఁడై

మ॥ ఇలరామప్రియసీతఁజాడఁ దగన్వేషించుచుంటోపు నా
బలవంతుండగు నంజనీసుతుని సంపద్బాహుశౌర్యంబుఁ దాఁ
దెలియంగోరి సముద్యరాతి సురసాదేవిన్ పఠింబంపగా
జలసందోహమునందుఁగానఁబడియెన్ సత్యంబుగన్నప్పుడున్

మ॥ భుజగాధీశులతల్లి యాసురస సత్ప్రాజ్యుండు నాధీరునిన్
గజసత్వాఢ్యుని రామభక్తుని యనంగారాతిసద్రూపునిన్
విజనంబైనసముద్రమధ్యమునకున్ వేగంబసద్దంబుగా
రజనీకాలమునందు భీకరతరద్రక్షస్సమూహంబుతోన్

మ॥ కని యీరీతిగనడ్డువచ్చిన లసత్రక్కవ్యాదవామాక్షి యి
ట్లని యావీరునితోఁదగంబలికె నీలావుంజలంబుం మదీ
యనివార్యంబగు వక్త్రగహ్వరమునన్ హాయంచుభక్షించెదన్
యనిలజ్ఞాత యటంచు నోరునుగదగంజాపెన్ భయంటొప్పగన్

మ॥ దశదిగ్గంతులుభీతిఁజెంద నదియున్ తత్త్రింశసద్యోజనల్
విశదంబొప్పగఁజాప నాతడును సద్వీర్యంబుగా షడ్డశల్
సశరీరుండయి మేనుపెంప నదియున్ సప్తద్దశాయోజనల్
నిరాత్రిందగనోరుఁజాపి వరుసన్ నేర్పొప్పగాపెంచియున్

మ॥ శతసంఖ్యాపరయోజనాన్విత కనత్సారూపవక్త్రంబుతో
మితిలేకన్ వెలుగొందుచుండగ నిదేమేలంచు వారాశ్మజాం
డలిసూక్ష్మంబుగఁ గుజ్జురూపుడయి తోడంజొచ్చె నానోటిలో
మతిమంతు ల్వలుపంగరానిపనులున్ భద్రంబుగానుండునే

మ॥ కపివర్యుండిటుఁజొచ్చి వెల్వలికిరాగా నామెతోషిల్లి రా
నుపరీక్షార్థముఁబంపవద్ద సురయోనుల్గానసంచు న్నుతుల్
విపరీతంబుగఁజేసి రామునకు నుద్వేగంబుగా సీత దుః
ఖపువార్త్రముఁదెల్పనేగుము భుజాగర్వంబుశోభిల్లగన్

మ॥ అనియాదేవితగంగ నాకమునకు న్నత్యంతవేగంబుతో
సనిన న్వాయుజుడంత సంభ్రమునఁ దాసంరంభదుర్వారుడై
యినవంశోద్భవుకార్యధుర్యుడయి తానేగెన్ వడిన్నిటపై
ఘనుడంచుం బెలవారువల్కఁగ రసత్కాంతీరవోద్దండుడై

మ॥ ఖరదంష్ట్రోసటజాలయుక్తయయి వేగంబొప్ప నావాయుజున్
నదుడంచున్మదిలోనమెంచి తననాణ్యంబేర్పడన్ సింహికా
ఖ్య రుచుల్గాంచగ ఛాయఁబట్టిన భుజాగర్వంపు నాతంపుసున్
కరమాశ్చర్యమునొంది యెవ్వరొకొ సన్మాంక్షించు భక్షింపగన్

మ॥ ప్రకటంబైనసురారిపై దలి దురాలాపంబుఁ దర్కించి దా
నికిమోక్షంబును నిత్తునంచుఁ బలుకన్ నిర్వారఘోరాకృతిన్
వికటంబైనముఖంబువిప్పి యదియున్ వేగంబుగా పావనిన్
సకలాదిత్యులు డిల్లమింగె నిలకష్టంబుల్ తర్వరంగల్గవే

మ॥ ఇభసత్త్వంబునుగల్గి మారుతియుఁదానింపొందఁ దజ్ఞాశరం
బు, భయంబొందగఁ జీలునట్లుగ వెసన్ పూర్ణంబుగా మేనువెం
చ భరింపందనశక్తిఁజాలకఁ గమన్ సైరింపుచున్నన్ మహ
త్ప్రభవుండప్పుడు దానిఁజంపెఁ దగనార్తకంబుఁ బైఁజిమ్మగన్

మ॥ దితిజాయుగ్మలి నీగతిందునిమి సందిగ్ధ ప్రరక్తాంగుఁడై
మతిమంతుండగువాతజాతుఁడుఁ గడున్భద్రంబుగాఁబోవుచున్
యితరాలక్ష్యసుఖంబుఁగోరక మదిన్ సీతాసతింగోరుచున్
పతియౌరామునిఁజర్చసేయుచును యంభఃవారిధిపై పోవగన్

మ॥ సతతశ్రీరఘురామపాదజలజాసక్తుండుఁ బుణ్యుండుఁ దో
షితబృందారకు డప్రమేయగుణుడున్ సీతార్థియైపోవ నా
గతి నావిఘ్నమియల్లుడంతయును నిక్కంబొప్పగుర్తించి తా
నతికారుణ్యవిధంబుఁగాగ వరమైనాకున్ రయంబందగన్

మ॥ పిలువంబంచి వినీతిమైనిటులనున్ పుణ్యుండవెంతేనియున్
కలుగుంగాక శుభంబునీకనుచు నాకాకుత్స్థకార్యార్థుడై
చలమొప్పారగ నాంజనేయుఁడు వడిన్ సంద్రంబుపైఁబోయినన్
నిలువంజేయుము సేదఁదీర్పుమని యానీరంబు బోధించినన్

మ॥ త్వరతోడన్గగనంబుఁజేరి యటసవ్వాతాత్మజుండుండు మా
ర్గపతింబోయి గిరీంద్రమప్డు రిపుభంగాయంచు సంబోధనన్
కరముంజేసి కపీంద్రుడప్డు వెలయంగా నాత్మమేనిం దగన్
స్ఫురమైయుండి పథిశ్రమంబు వడిగన్ స్రుక్కించుకొమ్మా యనన్

మ॥ వినుమోభూధరశ్రేష్ఠ! నేను నిపుడున్ వీరుండు సూర్యాన్వయుం
డను నారామునికార్యభాగమున నేడు న్లంకదర్శింపగన్
ఘనవేగంబునఁబోవువాడ భుజముల్ గర్వింప సంద్రంబునన్
నను నీవిప్పుడునడ్డువెట్టిన మదిన్నారాముడగ్గిం గడున్

మ॥ అనియీరీతిగ నంజనీసుతుఁడు వల్కంజొచ్చి యిట్లాడె నా
యినవంశోత్తముభార్యఁజూచి పనిపూర్తింజేసి నేవచ్చునం
త నిను న్వేగమఁగల్సికొందుననుచున్ తద్వాయుజాతుండు భూ
తనయంగాంచుకదింది వాంఛతొ తపోధన్యుండు వోఁబోవగన్

మ॥ హిమవత్పర్వతసత్సుజాతుఁడు తగన్ హేమాంబపిత్రాప్తునిన్
రమణీయంబగు రత్నసంచయములన్ రాజిల్లఁగాఁజేసి యు
ద్యమమంతం బరిపూర్తి కాగలదు వేడ్కన్నీవు సీతాసతిన్
సుమరాజంబులఁ బూజసేయుమనియెన్ శోభిల్లఁగానెంతయున్

మ॥ సలిలంబందు బలాధికుండయి మనస్తత్వంబునన్ రామునిన్
యిలజ వ్యక్తినిఁజర్చసేయుచు మదిన్నేర్పార సుగ్రీవునిన్
నలనీలాంగదజాంబవంతులను ఋణ్యంబొప్ప వాంఛించుచున్
చలనంబున్ వడిగన్ చలంబుఁదనరన్ సామీరి సల్పన్వేసన్

మ॥ పటువప్రోపరిభాగభూషిత లసచ్ఛంద్రంబులౌ మేడలున్
చటులాభీల పరివృతాఖిల నిశాచారాదిసంరక్షయై
కుటిలంబొప్పెడు లంకపట్టణము నాకుంజూడఁ జోద్యంబునౌ
యిటులన్నేగెదనంచు మారుతి యుదగ్రిష్కన్ ప్రవేశింపగన్

మ॥ కనులన్నగ్నికణంబులుప్పతిలగన్ కామారిరౌద్రంబుతో
నెనయన్రూపముఁదేజరిల్ల ఖరమైయింపొందు శూలంబు హ
స్తనఖాగ్రంబుల వెల్గుచుండగను ప్రత్యక్షంబుగాఁదోచె న
ద్దనుజా "లంకిణి" నామమొప్పగను పెన్దర్పంబుతోవానికిన్

మ॥ ఆదియున్రావణునాజ్ఞమీఱకఁ దగన్నాపట్టణద్వారమున్
ముదమొప్పారగ రక్షసేయుచుఁ గడున్భద్రంబుగానుండు వే
నెదురై వచ్చినవారిఁజంపుచును నుండె న్నిత్యసంతోషయై
పదముల్త్రొట్రుపడంగ వాయుజుఁడుఁ దాబాలత్వరూపంబుతోన్

మ॥ అతిచాతుర్యముమీఱ గూఢముగఁగాళ్ళన్నాటి శీఘ్రంబుగన్
మతినామైధిలిఁజూడఁబోవగను శుంభత్క్రుద్ధయై రాక్ష సీ
సతి దర్పంబున వానిఁబట్టుకొనినన్ శౌర్యంబవార్యంబుగా
గతులండేలి కదిందిరూపుడగుచున్ కన్పించినన్ రోషయై

మ॥ రభసంబొప్పఁగ ముష్టిఘాతమున నేలంగూలంజేయంగఁ దా
సు భరింపంగఁదలంచి యన్యగతిగానొప్పంగ ముష్టిద్వయిన్
యిభకుంభస్తనినేయ నామెయును నొప్పింగల్గి రక్తాంగయై
విభవత్వంబుఁదొఱంగి నేలకొఱఁగెన్ పీతాఘయై యంతటన్

మ॥ దివిజశ్రేష్ఠుఁడటంచు నాతని మదిన్దిట్టంబుగా మ్రొక్కి తా
ను వరేణ్యంబగు స్వర్గవాసినిగఁ దన్నున్ శాపచరిత్రమున్
నవలారత్నము విన్నవింప నతఁడు న్నాలంకనాశంబు స
ర్వవిధంబంతయుఁదానెఱింగి యటపోవన్ దృష్టిపర్వంబుగన్

మ॥ కనియె న్వానరవీరుఁడంత బహులంకాధీశ సద్గేహసం
ఘ నివాసాంచిత రక్తనేత్రులను రంగద్గీతవాద్యాది భో
జనపానాది సుకార్యసంయుతులరై సౌఖ్యంబులందేలు భూ
జనమున్ రాక్షససైన్యమప్పుడు మదిన్ షడ్వర్గరాహిత్యుఁడై

మ॥ నరమాంసాశనులన్ ఖరేంద్రముఖులన్ నక్తంచరశ్రేష్ఠులన్
మరణంబొందుయతీంద్రులన్ వివిధకంథద్వేషరాకాసులన్
శరజాలాది సువర్మపట్టిస సుపాశశ్రేణికాళాలలన్
కరమాశ్చర్యమునొందుచుం గనియె సంగత్యక్తచిత్తంబుతోన్

మ॥ వనదేశంబుల వప్రభాగములలో వర్ధిల్లుతేఁదోటలన్
జనభాగంబుల గోష్ఠతావులను సంసారంపుగేహంబులన్
ఘనమౌ పట్టణహర్మ్యసంస్థలుల రంగద్రాజమార్గంబులన్
వనజాక్షిన్ జనకాత్మజన్ వెదకి పోవంబోవఁ గాళ్ళాడకన్

మ॥ సకలంబైనపురంబుఁజూచి తికభూజన్నెందు నేఁగాంచెదన్
వికలత్వంబునుజెంచె మానసము నుర్వి న్నేనుజీవించగన్
సుకరంబిప్పుడుఁగల్గలేదనుచుఁ దాశోధించు చిత్తంబునన్
యకలంకుండును బోయె రావణునిశుద్ధాంతంబుఁ జూడన్వెసన్

మ॥ సతతమున్ భావజకేళిసల్పి మనముల్ సౌఖ్యంబునొందంగ నా
పతిఁ జాలించి సుషుప్తిఁజెందు సువిద్వ్రాతంబులున్ మద్యసం
గతులంజొక్కి యనేకఘోరవిధవాక్యంబుల్ తగంబల్కు దు
ర్మతులం గాంచె నతండుఁ జింతిలుచు రామాధీశకార్యంబునన్

మ॥ మును నర్థప్రభుగెల్చి గర్వమున నామోదాత్ముఁడై పుష్పకం
బను దాజత్స్వవిమానరాజమును దంభప్రక్రియం దెచ్చె నా
ఘనవీర్యండగు రావణుండు మణిసంఘాధీన నందీ స్థయై
జనసందోహసురక్షితంబగుచుఁ బూజల్వొందు నద్దానిసిన్

మ॥ కని లేకుండుటఁగాంచి దుఃఖమున భంగంబొందువాగ్గాలుడై
నను నీకార్యమునన్ వడింబనిచెఁ బుణ్యంబంచు సుగ్రీవుమన్
యినవంశాగ్రణియున్ ముదంబొదవగా నేనెందు నాసీతఁగాం
చినచందంబునుచెప దెన్నటికీ నిస్సీ భావియెట్లున్నదో!

మ॥ వెదుకంబోవుచు దైత్యరాడ్గృహముఁదావీక్షించుచుం బోవ నం
దుదయంబయ్యెను రావణుండు మఱియుం దూర్ణంబ భీతేక్షణన్
మదిరాస్వాదను బూర్ణచంద్రవదనన్ మందోదరింగాంచి తా
ముదితుండై జనకాత్మజంగనిన సొంపుంజెందె రోమాంచుడై

మ॥ కపివర్యుండును యాత్మమెచ్చి వడిగన్ కంజాక్షిదాయంగఁబో
విపరీతంబుగ నార్తిఁజెంది యిదియున్ వేఱంచుఁ జిత్తంబులో
న పరీక్షించగఁజేసి యాత్మ యనుమానంబుందగందీర్చి యా
తపసంపీడిత యుత్పలంబువలె బాధంజెందుమున్ వెండియున్

మ॥ ఇక నేతావునకుంజరింతు భువిలోనెచ్చోటికింబోదు నే
నికనేమాడెదఁగీశవల్లభునితో నేమందుమావారితో
నకలంకుండగు రామచంద్రునకు నేనత్యంతదుఃఖంబు నూ
రక నేఁదెచ్చినవాడసాదునని నొంద్రంబై నగిడ్పాటుకోన్

మ॥ అసమానుండగు నాంజనేయుడు మదిన్ శ్రీరాము జర్చించుచున్
రసగీతంబులువాడుచుం దనసుఖారంభైకకష్టంబు నే
యసహాయుండగు వాడుఁదీర్చుననుసంతసన్ జ్ఞప్తికిన్ వచ్చె నా
వెససంపాతియెఱుంగజేసినవిధంబే నప్డు లీలందగన్

మ॥ తనకున్ దేవతలున్ మునుల్ వివిధసందర్భంబులం బ్రీతులై
ఘనమౌకార్యముఁ దీర్తురంచుఁ గడకం గండ్లారఁగాంచె న్వటిన్
జనవిస్తారఫలప్రదీప్తమయి నానంగొల్పుచున్ వృక్షమం
దన కస్తూరికపిత్థ కింశుక పనౌదార్యంబుతో నొప్పుచున్

మ॥ రమణీయంబగు దివ్యవాహినులతో రాజిల్లుకెందామరల్
దుముకన్ సంతసమందు లేళ్ళకదుపుల్ తోరంబుగా వానరీ
గములం బొల్పగుచుండుఁ దద్వనమశోకాఖ్యన్ వెలుంగొంది నా
కముచన్నీడుగ నొప్పుదానిని భుజాగర్వుండు మోదంబుతోన్

మ॥ పవనోద్భూతుఁడు దానిఁ జొచ్చి కలయంబాఱంగ నొక్కొక్కటిన్
లవేశంబుననోర్పలేక నదయన్ రక్షస్సమూహంబు లా
హవముంజేసిన వారినందఱను నుద్యస్ఫూర్తిఁ దున్మాడి యు
య్యవనీపుత్రివసించుచెట్టుకడకున్ హర్షంబుతోఁ బోవగన్

మ॥ మతిమంతుండు గుణాధికుండు వనికామధ్యంబునం గాంచె భూ
షితపుష్పంబులఁ బండ్లతోడ లతరాశిం బెంపునొంపారు చు
న్నతిసౌందర్యవిలాస కింశుకతరున్నానందచిత్తంబుతో
సతతంబు న్నరమాంసభక్షిణుల దుష్టవ్రాతసంవృత్తమై

మ॥ కనియె న్మారుతి దుఃఖబాష్పకలితం గల్యాణి నాలంతలో
జనితస్వేదముఖిం బ్రసిక్తనయనన్ సౌందర్యమొప్పంగఁ గ
ప్పినధూళింబెనగొన్న వస్త్రయుగళన్ పేరాసతో రాముచం
ద్రుని నిత్యోన్నతభక్తిఁగొల్చెడు మహారూపిం బ్రమోదాత్మఁదై

మ॥ దురితారూఢులు మాంసరక్తవివిధదుర్భోజనల్ గార్దభా
వరసింహాజ గజేంద్ర సూకర హయా భల్లూక సర్పర్క్ష్య ఘు
కర ఘోరాదిముఖుల్ ప్రశస్తతర ఖడ్గశ్రేణిరాజిల్లగన్
కరయుగ్మంబులఁ గల్గి చుట్టుఁ బరిసంఘంబై నవారిం గనెన్

మ॥ పతినింబాసి యరాతిచేతులకు శుంభత్పాపకుంజిక్కి దు
ర్గతులందేలుచు రామచంద్రపదభాగ్యంబెప్డుఁ గల్గున్కొకో
యతిరోషంబున నంచుఁజింతిలుచు నిట్లార్తిన్ వెసన్నేడ్చుచున్
సతియౌ జానకియుంటఁగాంచి కడులజ్జంబొందె నాకీశుఁడున్

మ॥ పొలుపొందంగను బాలరూపకుడనై పోవంగఁ గార్యంబుసి
ద్ధిలు నిట్లేగినఁగార్యముంజెడును బుద్ధింజేసిచెట్టెక్కెదన్
ఖలులౌ రాక్షసవర్గమంతయు నుదగ్రంబైన పెన్నిద్రలోఁ
జలనంబింపకలేకయుండెదరు నాసంతోషమున్ హెచ్చగున్

మ॥ అనియాలోచనఁజేసి మారుతి రయంబన్ రాత్రియౌటందగన్
తనరూపంబును దగ్గఁజేసి తరుపుష్పాదర్పంబుతోనెక్కె భూ
జనముల్ మిక్కిలినన్నుతింప నటభూసంజాతఁజూచె న్మతిన్
మనమున్ సంతసమందుఁదేలగ రఘూభక్తుండుఁ గూర్చుండగన్

మ॥ చటులభ్రూకుటిదుర్నిరీక్ష్యుడయి మీసల్ చేతితోఁద్రిప్పుచున్
పటురోషంబున ఖడ్గహస్తుడయి శుంభద్బాహువిజృంభుడై
కటువాక్యంబులు వల్కుచు న్మదయుడై కామాదిదుర్గర్వుడై
భటసంఘంబులుఁగొల్వవచ్చె దితిజావర్గప్రభుం డున్నతిన్

మ॥ రభసంబొప్పగవచ్చినట్టి దురితున్ లంకాధిపుంగాంచి యా
యిభసద్గామిని మోమువాంచి యతనిన్వీక్షింపకున్న న్మతిన్
శుభదూరుండగురావణుండు మదిలోకుప్పించి లీలాగతిన్
సభయాశ్చర్యవిధంబుఁదోపఁ బలికెన్ సంరంభవాగ్జాలుఁడై

మ॥ తరుణీ నీవుఁ దగంగ భోగములఁబొందంబోక రాంతారమం
నిరసంవాసముఁజేయు రాముని సతృప్తి న్భక్తిఁబూజింపగన్
కరమున్నీమనమెట్లుఁ జొప్పడియె మద్గాఢోగ్రబాణంబు లా
నరుని న్వంచకు బుద్ధినిన్ క్షణములో నాశంబునొందింపవే

మ॥ కలికీ నేవరియించితెచ్చితిని దుఃఖంబందనీకేటికిన్
జలధిన్దాటి బలంబుమీఱగ వడిన్ స్థైర్యంబురానోపునే
యలరాముండు నరోచరుండునయి నాకర్ధాంగివై సంతతం
బు లసద్భోగసుసౌఖ్యకేళిగతులన్ భోగింపవే రాణివై

మ॥ సుదతీ నీ వదనంబునిక్కముగ రాజుంబోలు మధ్యంబు నీ
ప్రదసింగంబునుదాటుఁ గ్రొన్నెఱులు రోలంబంబుఖాతిన్ భవ
త్పదముల్ కంజదళంబుకీడుగను నొప్పారంగ రూపంబుతో
మదకుంభిస్పర్ధఁబోలు సుస్తనములన్ భద్రంబుగా నుంచవే

మ॥ ననునీవిప్పుడు గామకేళిసలుప న్నానంద చిత్తంబునన్
కని రాకుండెదవేని ఘోరముగ నిన్గారింతు రీ రాక్షసుల్
జనితోదగ్రమదీయకోపము నినున్ సాధించు నక్రాంతమున్
వినునామాటలు బాగుసేయకుము నీవీయందు రాలేటికన్

మ॥ అనిపల్కన్విని రాజనందన మహోదగ్రుండు నారాయణున్
తనమోహెత్తియుఁ జూడనేర కతనిన్ ధైర్యంబుతగ్గంగ తా
వినవట్లుండి తృణంబుఁగైకొని కడున్ భీతిం బ్రవక్త్రాక్షియై
ఘనభక్తి న్వరనాధుఁగొల్చి పలికెన్ కంజాక్షి మందధ్వనిన్

మ॥ ఆబలన్ భర్తృపదాబ్జబంభరమునున్ యట్లొంటిగానుండ నీ
వు బలాధిక్యత దుష్టబుద్ధివయి కొవ్వుంగావుమన్నన్ విమా
నబలంబున్వడిఁగల్గి నన్నుఁగొని నీనాశంబువాంఛించుచు
న్నభయంబందఁగనొందఁదెచ్చితివి మూఢా నీదుకామంబునన్

మ॥ ఖగరాజన్యుఁడు నాదుపక్షణము ముఖ్యంబొప్పగాఁజేయుచో
నగరాజంబులఁగూల్చు దేవవిభువజ్రన్ నీవు ఖడ్గంబుచేఁ
బిగులంజేసితి రెండుపక్షముల నాశక్తాగ్రగణ్యున్ నిలిం
పగణంబంతయు నీదుచేతకును గోపంబొప్పగాఁజూడదే!

మ॥ పరభామప్రియ దుష్టకార్యచరణా బాలేందుధృచ్ఛక్తితా
నరుడు న్నీచుఁడు వంచకుండని గదానాధుండు నీబుద్ధికిన్
ఖరబాణాగ్నికి నెట్లునోర్చెదవహో నీకాలంబుఁజేరూరె నా
వరదున్వేడుము సంతసించును భవద్వర్గంబు శోభిల్లడున్

మ॥ అతివైరంబునుదెచ్చికొంటి పదయన్ నన్గాంచి చక్షుద్వయిన్
పతినావీరుని భక్తిఁజేసి ననుఁబంపంజూడుమా ధీరతన్
గతులుంగల్గను యట్లుఁగానిచో భవద్గర్వంబుమాయించి యు
ద్ధతుడై నన్నురయంబునంగొను విశుద్ధంబింత నేఁజెప్పితిన్

మ॥ ములుకుల్బోలెడు వాక్యసంతతిని దుర్బుద్ధింబెడంబెట్టి యో
లలనా! యిచ్చితినొక్కమాసమును లీలన్నీవు నన్బొందగన్
చలనంబొందకయుంటివేని పిదపన్ సంహారముంజేతునం
చలుకంబల్కి పొకాలె రావణుఁడు వేషంబొప్పగ న్నింటికిన్

మ॥ మిథిలానందన పూర్వగాథను గడున్ఖిన్నాత్మయై వంతతోఁ
బ్రథనోదగ్రుని లక్ష్మణున్ గుణయుతున్ భ్రాతృప్రాపరీక్షణున్
మథనంజిక్కి తగంగ నేనుననుపన్ మారీచజామాత నా
కథనంత నన్మముందుగుర్తెఱిగి నగ్గాథంబుగా బ్రముచ్చిరెన్

మ॥ ఇది నామానసచోరమయ్యెనని యాయిట్టి న్వతింగోరగా
ముదితల్గోరినఁదీర్తునంచుఁ గడకన్ మోదాత్ముఁడై పట్టగన్
కదియంబోవగ లక్ష్మణుండిది మృషల్గానెంచుమన్నం గమున్
వదనంబందున నెట్టుఁదోప నరిగెన్ వందారుమందారమున్

మ॥ మనుకల్యాణమహోత్సవంబున మహోమృద్చాప సంభేదనన్
చనుదెంచె న్నటరావణాసురుఁడుఁ దాసమ్మోహనుండై విభుం
డును దానివ్విఋవంగ నందఋనుమీఁదుంబాసిపోవంగ నా
ఘనవైరంబునఁజేసి నన్నునిటకుం గాబోలుఁదెచ్చె న్కటా!

మ॥ ఎపుడుంజూతునొ రామచంద్రుని మదిన్నివంతఁదూలంగ నా
కెపుడుంగూడునొ సంగమంబువిభుతో నీదుష్టరాకాసిసం
ఘపుబాధల్ ననువెన్డుపీడునొ మదింగారించునీచుండు సం
తపరామాధిపు బాణజాలుడగునో తథ్యంబుఁగాదో! తగన్

మ॥ అనియీరీతిగఁ జింతసేయు జనకానందాత్మజంజూచి తా
నును బైనుండి ధరాతలంబునకుఁగన్నుల్విప్ప వేడ్కగగన్
జనితాశ్చర్యభయాకులంబయిన యాసబ్వీడి చిత్తంబుతోఁ
గని యావానరతల్లజు న్మిగుల దుఃఖంబొప్పఁదాఁ జూచినన్

మ॥ సతియాజానకిఁగాంచి రామపదకంజాతోల్లసద్భృంగమున్
మతినారామునిభక్తిఁగొల్చి సుదతీ! మాయింతు నీదుఃఖమున్
యతిపీయండగు రామసేవకుఁడ నేనంచుం దగంబల్కి స
న్నతులంజేసి వచించె రామచరితన్నంతన్ ముదంబందగన్

మ॥ సకలాఘాటవి కగ్నిరూపమగు భాస్వద్రామనామామృతం
బు కరంబొప్పగఁద్రావి తోషిలుచు నభ్యాపుత్రి వాతాత్మజున్
సుకరుండంచునునమ్మి యాతనితొ నోశుద్ధాత్మ మారాముడున్
యకలంకుండగులక్ష్మణుండును సుఖానందాత్ములే యిప్పుడున్

మ॥ కరుణాంభోధియునైనరాముఁడు మదింగాంక్షించునానన్ను నం
చన యంగోరిన సీతఁజూచి పలికెన్ హర్షంబుతోనాతడున్
యరవిందేక్షణ నీదుకార్యమునకై యారాముడుంబంచుటల్
దురితుఁ(నావణుఁజంపి నాధుఁడు నిసుందోడ్కొంచుఁబోడే తగన్

మ॥ అనియంతన్ తనవిశ్వరూపమునుజూపన్ సీతమూర్ఛిల్లినన్
ఘనసత్త్వుండు భయంబు నెందెనని వీకందానుఁగుబ్జుండునై
యినవంశాగ్రణిదేవిఁదేర్చఁగఁ గమున్నింపొందగా నామెయున్
చనుమన్న న్విని వాతజాతుఁడు మహాసంరంభచిత్తంబునన్

మ॥ ముదమారం దనకిచ్చినట్టిదియు భూపుండై నరామాఖ్యతో
నుదితంబై ఘనమైనరత్నయుతమై యుద్యత్ప్రభాపూర్ణమై
విదితంబై న పరాంగుళీయమును హృద్వీధిం దగన్ రాము నిం
పొదవన్ మ్రొక్కి వినీతి దానినిడియెన్ భూపుత్రిహస్తాంజలిన్

మ॥ నిజనాథుండు ననుగ్రహించినఁ దగన్నేర్పొంద నమ్ముద్రికన్
రజనీచారభయంబునం దనదుచేరన్నప్పుబంధించి దో
ర్విజయుండైన సుభక్తుహస్తముల సంప్రీతిన్ వడింబెట్టె నీ
రజరాగాదిమణిప్రదీప్తము శిరోరత్నంబు నాసీతయున్

మ॥ రమణీయంబగుదానిఁదీసుకొని యాలంకేశసందర్శనం
బు మహాయుక్తిగఁజేయువాంఛతో ముదంబుంగల్గ నాజానకిన్
సుమరాజంబులఁబూజఁజేసి సతమున్ శుద్ధంబుగ న్రామునిన్
యమరస్తుత్యుని వేడుకొమ్మనుచు నాతండేగె నంతం ద్వరన్

మ॥ ఖరుతై సీతనుగాంచి రాత్రిచరు లుత్కంఠన్ వెతల్వెట్టగా
సరమాఖ్య న్నెగడొందుభామినియు భూజాతం దగంబ్రేమతోఁ
గరుణంజూచి భయంబువాపి త్రిజటన్ గాఢంబుగా నామెకున్
యరయన్రక్షణఁజేసి తానునరిగెన్ యారామకార్యంబునన్

మ॥ ఇటులన్రక్షణసేయునామె యొకరాత్రింగాంచె దుస్స్వప్నమున్
యటులాదైత్యులు మ్రగ్గినట్లు వరుసన్నారావణుండుం దగన్
చటులాభీలపరాస్త్రవర్గములఁ దాసంతప్తదేహంబుతోఁ
గటుకంజచ్చినయట్లు మర్కటముపీకంజొచ్చినట్లు న్వడిన్

మ॥ ఇతరంబైనయరిష్టసూచనలుఁ బుట్టెన్నాటికాలాన సం
సతసంబయ్యెను గేతుజాలములు భూపాలుండు శోకంబునన్
యతినైచ్యంబును బొందె రధ్యములు నుగ్గయ్యెం బురంబంత శా
శ్వతసౌఖ్యంబులఁ దేలుచుండిరి భయోత్పాతంబుఁ గల్గెంగదన్

మ॥ త్రిజటాస్వప్నముదంతమంతయును సుద్దీప్తిన్ వఠింపోయి దై
త్యజనం బక్కజమంచుఁ దెల్పిరి మదోద్దండుండు నారాజు తాన్
నిజధైర్యంబున వారిమాటలను దానేర్పొంద లెక్కింపకన్
స్వజనంబుం దలఁబాలఁ దోలెను నిశాచారుండు నొక్కుమ్మడిన్

మ॥ కపిసంబంధపుయత్నముంగొనుచు వాసింజెందుచుం బోపుచున్
ఖపడో రావణుఁ గాంచుకోర్కె తనలో గాఢంబుగంగల్గ వా
నరముఖ్యుండు వనంబుఁ గాసిలగఁ జేనాసించి తానందుఁ దా
చ్చి రయంబొప్పగ నావనంబుతరురాశిం గూల్చె బాహుస్వయిన్

మ॥ ఫలభూజంబులఁ ద్రుంచుచున్ మెసవుచున్ పాడైననాకాయలన్
యిలపైఁ ద్రేయుచుఁ జూచుచున్ యిగురుల న్నింపొందగా రాల్చుచున్
బలుడై కొమ్మలఁ దన్నుచున్ సకలరూపంబుల్ పటిన్మార్పుచున్
యలమత్తేభము కంజసంస్థలినిఁ గూలంజేయు చాడ్పొప్పగన్

మ॥ తరుల న్వాయుజుపట్టి స్వస్థలములం దప్పించి గాసిల్లఁ జే
య రయంబన్ వనరక్షరాక్షసులు నుద్యత్తద్గహస్తాధ్యులై
నర బాహాబలమొప్పఁ దాకిన వడి న్వాలంబు రోషంబునన్
పెనగం జేసి తదీయసాయకునఁ జంపెం బంచశేషంబుగన్

మ॥ కపివీరక్షతశేషజీవులయి దుఃఖంబందుచుం దిట్టుచున్
యుపయోగంబగు నవ్వనంబు నతడున్మూలించెనంచున్ సప్రస
ద్ధపవాక్యంబుల రాక్షసప్రభునకున్ దైన్యంబుగం దెల్ప ను
గ్రపువైరంబునఁ గోతిసేతమను భగ్గంచు న్నసింగ్గై కొనెన్

మ॥ ఎవఁడావానరముఖ్యుఁ డిచ్చటికిఁదా నేతెంచుటం గారణం
బు వడింగన్గొనుఁడంచుఁ బల్కి తమకంబుంబట్టి సైన్యంబుతో
డ వనంబప్పుడుఁజేరఁబంచెఁ దనయున్ దండోద్ధతున్ యింద్రజి
త్తు వరేణ్యుం బవమానసూనుకడకున్ దర్పంబుతో నాతడున్

మ॥ జనకాజ్ఞన్వడిఁదాల్చి యత్నయుతుడై సైన్యంబుఁదెల్లాప్పటున్
కనియె న్వానరవంశనీరధివిధున్ గర్వాంధసంఛేదనున్
మనమందెప్పుడు రామనామమును దామాధుర్యమొప్పంగఁ జే
యునతిశ్రేష్ఠుని యంజనీసుతుని సద్యోగిన్ జితేంద్రుండటన్

మ॥ జగమంతం దనతీవ్రభానుతతితో గ్రస్గించి సంధ్యాతతిన్
సుగముండై యటపశ్చిమాద్రికి దినేశుండేగువందాన నా
శుగసంజాతుఁడుఁ గంబమెక్కి యటఁగూర్చుండెన్ వినిశ్చింతతో
నగుపించె న్నపుడింద్రజిత్తుఁడు దదీయంబైన నేత్రద్వయిన్

మ॥ తులువా యెవ్వఁడవీవు నిచ్చటికి సీతుల్వాల్కుచున్ వచ్చుటం
గల యాకారణ మెద్ది పల్కు వనికిన్ గర్వంబుతోఁబోవనె
ట్లులభించెన్ భవదీయచిత్రచరితన్ రూఢించదగంజెప్పుమా
చలనంబయ్యెడ వేని మత్కరములన్ సాధించునిన్నున్వడిన్

మ॥ అనునారావణి ప్రస్ఫుటప్రకరవాక్యంబుల్ మదిన్ మెచ్చి తా
నును నేతెంచినసత్కథం జెవులకు న్నాల్కొల్పగ న్నాతడున్
ఘనమౌబాణసమూహమంతటిని యుగ్రక్రోధుడై పావనిన్
యినకాంతున్వడినేయ నాతడును వారించెన్ లసచ్ఛక్తిచే

మ॥ సురశత్రుండను వనాటుపైఁగవిసి వేఁజూడ్కుల్ భ్రమల్గొల్పగా
ఖరనారాచకదంబకంబు దివినగ్గంధర్వులున్ మెచ్చ భీ
కరమైయేసినఁ గంబమందగిలి భస్మంబై ధరంగూలు నే
మిర యాశ్చర్యమటంచుఁజూచెదరు నెమ్మేనుల్ భయంబందగన్

మ॥ ప్రకటప్రాభవమొప్పు దివ్యశరమున్ వాడంగఁజేయంగ దై
త్యకులుండు స్మదిలోనఁజింతిలుచు నిత్యంబు న్నమోఘంబుగఁగా
సుకరంబొప్పగ శత్రువున్గెడపివచ్చు న్నేడునిట్లొటకున్
యకలంకుండగు వానరప్రభుని యుద్యద్భక్తి కాటోలునే!

మ॥ సులభత్వంబున సీతనిఁగా దుసమునన్ స్రుక్కింపసాధ్యంబు నా
జ్వలదస్త్రంబుననఁగాని చొప్పడ దజాస్త్రంబుం బ్రయోగించెదన్
కలనన్ గెల్చెదశత్రునంచుఁ దొడిగెన్ గర్వోద్ధతి న్నాతడున్
వెలుగుల్జిమ్ముచు మింటవచ్చెనదియుఁగా వేగంబుగ న్నుగ్రతన్

మ॥ దితివంశప్రభుముద్దుసూను డదయుఁగా దేవేంద్రముఖ్యామర
ప్రతతుల్ దుఃఖముసెంద నేసిన మహాబ్రహ్మాస్త్ర మత్యుద్ధతిన్
యతనిందాకె రయంబున న్నతడు మున్నాధాతవాక్యంబునం
బతితుండయ్యెను మూర్ఛఁజెంది ధరణి న్వాతంబుఘూటంబునాన్

మ॥ సురలన్ జ్యేష్ఠుఁడుఁ బద్మసంభవుఁడు నంపుంజాలమున్నించి శ్రీ
కరమా యస్త్రపువహ్నినోర్చెఁ దగలెక్కింటెట్టునే ధాతనున్
యుడదై వానికిఁజిక్కి యేడుముటకల్ యదృశ్యమైపోప వా
నరవీరుండును నుత్థితుండగుచుఁ జెన్నారంగనొప్పెం ద్వరన్

మ॥ ఇదియే మంచిపసందుకాలమనుచు న్నెంతన్విచిత్రంబుగా
కదనంబందున మూర్ఛఁజెందినబలున్ గర్వోద్ధతి న్నాతడున్
యదయుండై వడిబద్ధుఁజేసి పురి కత్యంతప్రమోదాత్ముడై
కదలెన్ దానవవీరుడప్డు సురసంఘంబుల్ వెతంగుందగన్

మ॥ తను మున్గోరిన కోర్కె నీతడు ననున్ ధైర్యంబుగంబట్టి తె
చ్చెను నాకద్దియెచాలునంచుఁ గడుమెచ్చె న్రావణిన్నాతడున్
ఘనమా రావణుదర్శనంబుఁగలిగెం గామాంధతన్మున్ననీ
తని బోధింపగఁజూతునంచుఁ దలచెన్ తద్వాతజాతుండొగిన్

మ॥ ఒకనాఁడంత మణిప్రభ ల్తనరఁ దానుత్సాహుండై మంత్రిస
త్ప్రకరంబొప్పగ వెల్గుచు న్గజరిపుంభద్రాసన స్థితుఁడై
వికలంబొప్పెడుమానసంబున సురావిద్వేషి కోపిష్ఠుఁడై
యకలంకుండగు మారుతింబిలువనంపన్ వచ్చెనాతండునున్

మ॥ అతినీచంబుగఁ దన్నుఁజూచిన నిలింపారాతిదుశ్చేష్టకున్
మతిలోనవ్వి నిమేషమాత్రమున సూక్ష్మంబొప్ప నావాలము
న్నతిఁజేయ న్నదిపీఠమయ్యె నతడు న్నాకాధిపుమ్మెచ్చగన్
పతితుండైనయతండుఁజూడగ మదంబన్నెక్కె నద్దానినిన్

మ॥ నినుహీనంబుగఁజూడ నీవుఁదగమన్నీలుండు భద్రాసనం
బునఁగూర్చుండుటఁ బాడియా వనవరా భోనామముం దావునన్
వనసందోహముఁగూల్చుకారణము నీవావాలతంజూడగా
ఘనవీరుండవటంచుఁదోచెడిని నాక్రాంతమున్నెడ్డలోన్

మ॥ పలుకన్నోరునులేదయున్న విభువాక్పారుష్యముంజూచి రాఁ
జలుడై వానరవంశజాతుఁడు మహాసామర్థ్యమొప్పార విం
తలుగంజెప్పెను యాత్మగాథ మఱియుం దద్రామకార్యార్థమై
నిలసంచారముసేయుట న్నతనికిన్నితు ల్తగంజెప్పుచున్

మ॥ అసురాధీశ మహేంద్రదనన్నుత లసద్బాహుప్రభావాఢ్య నీ
వుసురల్గుందగ సీతఁదెచ్చుటది దుర్బుద్ధిందగంజేసితో
వెసమోహంబునఁబట్టితో విడువుమీ వేగంబఁ గాదేనిచో
నుసురుల్గైకొను రామచంద్రుఁడు రణోర్విన్ బంధుయుక్తంబుగాన్

మ॥ నిజభార్య న్నితరుండువంచనగఁ దానేర్పొప్పగాఁబ్రుచ్చిలన్
సుజనశ్రేష్ఠుడు నోర్చునేమనియు నీచ న్నిన్ను నేఁజంపుదున్
భుజవీర్యంబున నానలేదు యదినీపుణ్యంబు మాఱాడకన్
గజసత్త్వాఢ్యుని రామభూవరుని నాకాంక్షింపుమా మేలగున్

మ॥ పరగ న్మున్ను విరించివాక్యమునఁ దాఁ బుత్రావనుండై తగఁగా
ధరణిం గోసలకన్యగర్భమున మోదంబంద జన్మించి యా
హరువిల్లుం ద్రుటితోనఁ ద్రుంచి జనకు న్నత్యంతమోదంబునన్
దొరలంజేసి వరించెజానకిని యాదుర్వారయసర్థింపుమా!

మ॥ సతతంబున్ శివనామపూజలను శశ్వద్భక్తిగంజేయు నీ
వితరంబైన సతీకదంబమును బుద్ధిన్నెట్లుఁ జొప్పింతువో
సతులంగోరుట దుష్టకృత్యమని నీసంకల్పముంగాదొక్కో
మతిసద్భావుడవై భయంబుఁగనుమా మార్తాండవంశోద్భవున్

మ॥ అనిబోధించుచునున్నవానయనిఁ దానత్యంతకోపంబుతోఁ
గనులన్నిప్పులురాల ఘూర్ణిలుచుఁ దాఖడ్గంబుఁజేఁబూని గ్రో
ల్చున సింహాసనమందునుండక సుదీప్తిన్ భూమికిన్ డిగ్గి యా
తనుజంపంగనుటో విభీషణుఁడు బాధంజూచి పల్కెందగన్

మ॥ ఇతఁడానవమేతఁబంపవదె తానేతెంచినా డిప్పుడుగా
యితనింజంపినఁ బాపముంగలుగు బుద్ధింజాలయోచించి దు
ర్గతులంజిక్కక మర్కటప్రియ మమోఘంబైనవాలంబు నీ
మతిలోఁగల్గినయట్లుఁజేసి విడిపింపన్ లగ్గుగా రావణా!

మ॥ సుకరంబైన మృదుత్వవాక్యములఁ దాశోధింపక న్నుగ్రతన్
వికటభ్రూకుటిఫాలభాగుడగుచున్ వీరుండు నారావణుం
డు కఠోరంబగుపాదమెత్తి యనుజుండున్ భక్తిఁగేల్మోడ్చఁ దు
న్నికముంగాల్తబవన్ విభీషణుఁడు సన్నిస్వాది రోషంబునన్

మ॥ మరుసుందు న్నరిభీకరుండును మహాభక్తాపసశ్రేష్ఠునన్
నయదా రాముని భక్తివేఁడగను దానంభోనిధిన్ దాటి వే
శరణంబంచునుబోయి పాదములనాసంబట్టగా రాముడున్
కరమర్థిన్వడిఁగౌగిలించి యతనింగాపాడె నిర్వైరతన్

మ॥ కపివీర్యున్ భుజశౌర్యధాము నలుకన్ గర్వోన్నతింజెంది య
గ్నిపరీతంబగువానిగన్ యసురులుంగ్రీడింపగంజేసి మొ
త్తపులంకన్వడిఁద్రిప్పివేవిడువ నాతండుం బ్రతీకారకా
ర్యపుబుద్ధిం బురమంతఁగాల్చెను సురల్ హర్షించియగ్గింపగన్

మ॥ వరసౌధంబుల వప్రభాగముల ఘుంభద్గేహసంవ్రాతమున్
యరదౌతోటలనంతయు న్విరివిగన్నానందుడై యగ్నికిన్
కరమాహారమొనర్చి జానకివనింగాల్పంద్యజించె న్వడిన్
యరరే! యెంతటివాడవం చసురసంఘంబుల్ వెతంగుందగన్

మ॥ ఖలుడై రావణదైత్యు డప్పురమనాకాధీశసంస్తుత్యునిన్
నిలువెల్లన్వడినగ్నిఁజేయ వినితానిర్వంకలన్దుఃఖయై
బలజాతేక్షణసీత యగ్నిని మదిన్సాకల్యభక్తిన్ స్తుతుల్
వెలయంజేయుచు వాతసూనునకు నీవేరక్షవుంగావుమా!

మ॥ అనియార్తిన్విలపింప సీతఁగని శీతంబై కడుంబావనిన్
తనకీలల్దహియింపకుండగను వేతక్షణంబరక్షించె స
ద్ఘనహో భర్తృపదాబ్జభృంగలగు నాకాంతల్మదిందోచినన్
యనువై కూడవె సర్వకార్యములు సిద్ధంబొప్పనెవ్వేళలన్

మ॥ పిదప న్వాయుసుతుండులంకవిడువన్ బిట్టైవడిందోచె నా
పదసందోహ సయుక్తమ్రభతల ఘుంభద్భృంగసంజాత ని
స్వదితాంభఃకణమైన సంద్ర మపుడున్ సామీరి తోల్లింటమా
ర్గదివింటోయెను సంతసంబున భుజాగర్వంబు శోభిల్లగన్

మ॥ తతులంగాంచెను గీశులం దటమునన్ తద్వాతసూనుండు సం
తతహర్షంబునఁ జెప్పెమైథిలికథన్ దర్పోద్ధత న్నందయున్
పతియౌరామునిఁ గీశవల్లభుని వేప్రార్థించుచుం జేరి రా
తతకష్టౌఘనివారకుండును మహాదర్పుండు నారామునిన్

మ॥ సుమనంబొప్పగఁగంటిజానకిని యంచు న్మారుతపుత్రు డు
ద్యమమంతన్వివరింప శోకముడుగన్ ధాత్రీవిభుం డప్పుడున్
రమణీయంబగు ముద్రికంగొనుచు నారాజాస్య నీకేమియి
చ్చి మదీయంబగుదుఃఖమాపుమనియెన్ చింతిల్లుచుంబెల్లుగన్

మ॥ అనిపల్కన్ జనకాత్మజందలచి ప్రేమల్మిలి హస్తాంజలిం
గొనుచుంచు న్నిడినట్టి పావనసుమశ్రోత్యదాత్తమై యూత్యర
త్ననిబద్ధంబగు భూషణంబును శిరోధార్యంబునైనట్టి త
ద్ధనరత్నంబును రామభద్రుకొసగెన్ కౌతూహలంబొప్పగన్

మ॥ కరమొప్పారగ నంజనీసుతుని సత్కార్యంబులో మెచ్చి భా
సురసంగూహననిచ్చి వాయుజుడ! నీశుద్ధాత్మభావంబుచే
నరయన్వాంఛలుగట్టుకెక్క నికఁబుణ్యంబొప్ప దైత్యేయసం
హరణం బెట్లుఁదగంగఁజేయుదుమొ! యూహింతెప్పుడూ! ధీరతన్

("సుందరకాండము-సంపూర్ణము")

# యుద్ధకాండము



సీ॥ రమణీయచంద్రుడౌ రఘుసుధాంబుధికినిఁ
గౌసల్యశుక్తిముక్తాఫలంబు
దశరథకమలంబుఁ దనరాయభృంగంబు
వరవిరాధాద్రికి వజ్రధార
పాపాభ్రసందోహ పటుమహాబలతుల్యు
డసురౌఘములకు నాయమరతమవు
బ్రహ్మాదిసురలచే బ్రార్థితుండై లోక
కల్యాణవాంఛతో ఘనతకెక్కి

తే॥ గీ॥ దుష్టజనశిక్షణంబును శిష్టరక్ష
నమితవేడుకఁజేయగ నవతరించి
రాముడనుపేరనొప్పెడు రాజవిభునిఁ
బరగవినుతింతు నశ్రాంతభక్తిఁగలుగ

సీ॥ సీతావిభుండు తన్చిబునవ్వుముఖమందుఁ
గలుగఁ బ్రశ్నించిన ఘనవిషయము
మదికెంతొసంతోష మావహిల్లగజేయ
నంజనీతనయుండు నమితభక్తిఁ
గరములుముకుళించి ఘనపరాక్రమయుక్త
నీవునన్నడిగిన నేమిఁబలుకు
వాడను నయినను వర్తించువిధమింతఁ
జెప్పుదునని రామచింతమాని

తే॥ గీ॥ నట్టి యురుబలయుక్తుఁడు నాంజనేయు
డిట్లుఁజెప్పెను విభుతో కటింధిబలుని
వరుని రావణుచరితంబుఁ బ్రస్ఫుటముగ
లంకరాజును వరదైత్యరాజు మటియు

సీ॥ కాశికావిశ్వేశు ఘనభక్తినర్చించు
నసురులనోడించు సాహసముల
బ్రహ్మచేఁదొల్లి సంప్రాప్తమైన వరాతి
శయగర్వమున నిప్డు సకలజనులఁ
గాఱించుచున్నాఁడు కఠినముగనాతని
వేదాంతవిజ్ఞాన మెఱుఁగఁదగు మె
సారసభవునకు శర్వునకైనను
నొక్కదోషముచేత నుక్కసెడదె

తే॥ గీ॥ యంగనలపైన మోహంబు నధికతరముఁ
గాన నాతనిఁజంపుట కడుసులభము
వార్ధిఁదరియించి మనముసవ్వారిఁగాఁగఁ
బోయి దనుజేంద్రుఁగూల్తు మిబ్బువిని నేడు

సీ॥ అనిన రాముఁడుపల్లెయని మోదమునఁదేలి
సౌమిత్రిఁగనుగొని సరభసముగ
వానరసేనల వార్ధితీరముదాక
విడిపింపఁబంపుము వేఁగమునను
కీశవల్లభుఁగూడి కేశవుదయచేతఁ
బోవుదమనిఁబల్క బొంగి యతడు
నలనీలయుంగద యలసుషేణుని మైంద
ద్వివిదులఁ బెక్కండ్రుదీప్తకపుల

తే॥ గీ॥ నలఘురాఘవునానతి జలనిధికినిఁ
బంపె డెబ్బదిరెండువేపటిమఁదనర
వెలువల లక్ష్మణుండును వీరులంతఁ
యోచింపసాగిరి జేరచిత్తములను

సీ॥ సుగ్రీవహనుమంత సోదరసంయుతుఁ
డై వెలుఁగొందుచు నర్కసుతుఁడు
నక్రాంతభీకరంబై యొప్పు వనముల
నదులను నెలయేళ్ళ నపుడు నడిగ
నుత్తరించుచునుండి నొక్కెడఁగాంచెను
వివిధోగ్రజలచర భీప్రదంబు
నన్యోన్యసంఘర్షణాగత నినదంబుఁ
బున్యానదు ల్కడఁబోవుచోటు

తే॥ గీ॥ సగరసుతవర ఖనన సత్సాగరంబు
విష్ణుమాయయు లక్ష్మికిఁబేద్కఁదంద్రి
యైనశరనిధి నందితుఁడగుచుఁగాంచెఁ
గపులసందోహములను వేగముగనపుడు

సీ॥ తనయల్లుఁడిప్పుడు దర్పనంబొనగెను
తనివిదీరఁగఁజూచి తనియువాడ
ననుచుమోదంబున నబ్ధినింగికినంచె
బహువిధబహ్మాండ భంగయుక్త
మయి దానికప్పుడ మ్మనుజేశ్వరుఁడు మార్గ
మునుజూపడంచును మోదరహిత
మానసంబునఁ దనమాయనువీక్షించి
శరచాపములనిమ్ము జక్కఁడంచు

తే॥ గీ॥ ననుచు సౌమిత్రిఁబలికిన నట్లనతఁడుఁ
జేయ రాముండు రోషితచిత్తముననుఁ
బల్కెకంధినిఁజూచి భూపాలుడపుడు
స్వర్గవాసులు మిక్కిలిచోద్యమంద

సీ॥ నీమదంబణతను నిక్కువంబుగ నేడు
మచ్చాపఘోరాగ్ని భస్మదేహు
నిగజేతు నన్నుఁదృణీకరించి చెలంగ
దీవు లంకకు నేడుఁదెరపుసూప
వింద్రముఖ్యానేక బృందంబువచ్చిన
విడువనునిన్నని వెలదిసీది
మోహచేతస్కుఁడై యాహవమొనరింప
నున్నరాముని భక్తినుగ్గడింప

తే॥ గీ॥ సతివిషాదవుఁజూపుల సవనిపైకి
ముఖ్యనదులనుగూడి సముద్రుడంత
వచ్చి రామునిపదయుగవనజములను
బట్టి యిట్లనినుతియించె భాసురముగ

సీ॥ కాకుత్థ్సకులవర్య కంజగర్భభవాది
సురగణసన్నుత శోభితాంగ
కమలాక్ష దేవ నిన్ననగమావశమౌనె
మౌనులకునుదక్క మాన్యచరిత!
పదునాల్గుభువనము ల్పదిలంబుగానుండు
నీదుకుక్షిని యెప్డు నీశ। వరద!
సంతోషమున నేనుచయ్యనహెచ్చితిఁ
గాని వైరములేదు కరుణఁజూడు

ఆ॥ వె॥ బ్రహ్మ కమలనాభ పరమేశరూపులఁ
గర్త భర్త హర్త ఘనుడవగుచు
దుష్టగణముఁజంపి దోషాదిరహితుల
రక్షసేతువెపుడు రామచంద్ర!

సీ॥ ఎప్పుడధర్మంబు నెసగులోకంబున
నప్పుడుజన్మంబు నరయుదీవు
గంగలక్ష్మనినిచ్చి ఘనతమీఱగనిద్ధుఁ
గలిగెబంధుత్వంబు గాఢముగను
సీతామహాసాధ్వి చెన్నారునీభార్య
రాక్షసహృతమౌట లంకఁజనుట
దుఃఖంబునొందుట దుష్టశేఖరుఁడైన
రావణుచేతలె రవికులాబ్ధి

తే॥ గీ॥ చంద్ర ! దశకంఠుఁదునిమి యాసారసాక్షి
నిందువదనను ధరణిజ నైందమలరఁ
దీసుకొనిరమ్మ లోకముల్ తృప్తిఁజెంద
నాదుమీదను సేతువునరయఁగట్టి

సీ॥ అనివిన్నవించి వీడ్కొనిబోవ నాతండు
నంతట సుగ్రీవునసఘుఁజూచి
వానరయూథంబుఁబంపుము జాగేల
నద్రులఁదరువుల నన్నిదిశల
వెదకితెత్తురు బహువిక్రమంబులవారు
ననిబల్క నర్కజుండపుడువంపె
మర్కటసముదయం బంతంతవెదకియు
వారలుఁదెచ్చిరి వరతరువుల

తే॥ గీ॥ నద్రిజాలమునంతటి నభయులగుచుఁ
జూచి శ్రీరాముడెంతయుఁ జోద్యమంద
భుజబలులకెందసాధ్యంబు భువినిఁగలదె !
దాశరధిభక్తులందును ధర్మమరుదె !

సీ॥ దరహాసముఖముతో దశరధసుతుడప్డు
నద్రులఁదరువుల నబ్ధియందుఁ
బడవేయుడన్న వానరులటఁజేసిన
నన్నియుఁగంబుల నణగిపోవ
నాశ్చర్యచకితులై యంతమునిదియేమి
యనివిచారింపగ నందునొకడు
నీలుండునానొప్ప నిర్గర్వకపివరుం
డప్పుడు నబ్ధిలోనద్రివేయ

తే॥ గీ॥ నదియు మునుగకయుండెను నంతవారుఁ
తమలనన్నిటిఁ గొండలఁ గమముమెఱయ
నతనిచేతికినిచ్చుచు నబ్ధిపైనఁ
దూర్ఘకాలంబు నొక్కసేతువునుగట్టె

సీ॥ రామభూపమడప్డు రాజిల్లుమోముతో
నీలునిచదితంబు నెఱుగఁబల్క
మనిజాంబవంతుని మాన్యతనొప్పార
వేడిననాతడు వినయమెసగ
బాల్యకాలమునాడు కుల్యలోనీతండు
వస్తుసంచయములఁబారవేయ
తంత్రియంతయుఁ దెల్పితనయుమవైచిన
వన్నియుఁ దేలగవాక్కుఁబలికె

తే॥ గీ॥ తత్సుఖంబుగ దీవన దానిచేత
జలధివైచిన వస్తుసంచయముఁదేలు
నొకవిధంబుగ మనకుపయోగమయ్యె
ననుచుఁజెప్పెను రాముడానందమొంద

సీ॥ జాంబవంతుని వాక్యసరణిని బరికించి
వారధిబంధన వనచరాళి
నైపుణ్యంబును నెన్నియుఁ గొనియాడి
కార్యంబు సఫలతఁ గాఁగఁ దలఁచి
సుగ్రీవు నంగద భూపల కృషికిని
తనచిత్తమందున ధన్యముగను
శ్లాఘించి రావణసంహరణంబును
మిత్రులఁదోడ నమేయబుద్ధిఁ

తే॥ గీ॥ జప్పసేయుచు హనుమంతు చతురతకును
జాలతోషిల్లి యనుజన్ముఁ జక్కఁ జూచి
రాయబారంబు సల్పుట లక్షణంబు
ననెను రాముండు నందఱుఁ గనగ నపుడు

సీ॥ వైతేయపతినిచే దానవకులవైరి
సైన్యమంతయుఁ దెల్పి సరసలాగ
శుకసారణాఖ్యులుఁ జోద్యంబుఁ గలుగగ
నంబరవీధిని యరుగుచుండ
వానరవరులలో వర్తిల్లునంగదుం
డదియంతయునుగని యభ్రవీధి
కిఁజని యాద్వయమును గీపెట్టుచుండగ
రామదేవుని మ్రోల దాఁకితముగఁ

తే॥ గీ॥ దెచ్చివైచిన వారినిఁదీవ్రముగను
జూచి రావణానుజుడప్డు శుభ్రముగను
వారువచ్చిన కార్యంబు ప్రభునకెంతఁ
జెప్ప విడిపుచ్చెవారిని శీవములతో

సీ॥ ఇనిమంచిమాటని యెంతయులక్ష్మణుం
డన్నతోనాడగ నవనివిభుఁడుఁ
బెద్దలఁబొడగని పిన్నవాడను నేను
ధర్మంబులంతగాఁదరమె తెలియ
మదినియోచింపుడు మతిమంతునెవనినిఁ
బంపుదుమా వైరిప్రభునికడకు
ననివిచారించెదు యవనిపుఁగనుగొని
భక్తులకెల్లను మానికంబు

తే॥ గీ॥ నైన గుణవంతు డంజనీతనయు డప్డు
వాలిపుత్రుని యంగదువలనుసూపి
భక్తరక్షక! నీకార్యభారమితఁడు
తప్పకనువహియించును దనరఁబంపు

సీ॥ నాకుఁజూడగ నిందుసరయగ యుద్ధంబుఁ
గలుగునంచని యొద్దకలతనొందు
దీవించిపంపుము దివిజాదిసన్నుత!
యనివాతసూనుఁడు హర్షమొదవఁ
జెప్పినఁ గనుగొనె సేవాతిధుర్యుని
ఘువునిసత్పౌత్రు మహితచరితుఁ
బ్రథనప్రదీప్తునిఁ బటుగుణసంగుని
యంగదు సతడును యాక్షిలిపునిఁ

తే॥ గీ॥ జెంతఁజేరఁగ రాముండుఁజిత్తమందు
మిగులసంతసమంది నమ్మికనుబొంది
రాయబారంబుసల్పుట రావణునితో
ననియుఁదత్కథనంతయు నమరఁజెప్ప

సీ॥ వాలిపుత్రుండు శశ్వద్భక్తి రాముని
వలగొనిముమ్మారుఁబ్రణుతిసల్పి
నీపంపుసేయనే యాపంక్తికంధరు
నొద్దకుఁబోవనే నొచ్చునట్లు
వాక్యముల్వల్కనే వరరామదాసుండ
ననిజెప్పనే ప్రీతి నంబుజాక్ష!
పంపుమానన్నును భయమింతయునులేక
వానరుల్వెంబడుదురే వసుధలోన

తే॥ గీ॥ నన్న యాతని మాటల కద్భుతంబుఁ
గలుగ రాముండుఁబంపగఁ గరము మెఱసి
నిమిషమాత్రంబ లంకకునేగెనతఁడుఁ
జేరె రావణుశుద్ధాంతసీమ మఱియు

సీ॥ మఱునాడు రావణమహీపునిఁజూడగ
నాస్థానమంటపమందుఁ జొచ్చి
రావణుఁగనుగొని రాక్షసశేఖర!
రాముపంపున నేను లంకఁజేరి
సీతోడభాషింప నిందువచ్చితి నీకు
బుద్ధులుఁగఱపు సుబుద్ధిచేత
నామాటలాలింపు నయముగభూజాత
రామపత్నిని నెమ్మి రాముకిమ్ము

తే॥ గీ॥ పరులసుదతులఁబ్రముచ్చిలి భావజాది
కేళులందునఁ దగులగఁగీడుఁగాదె
ధర్మశాస్త్రాది పారంగితాఖిలజ్ఞ!
నీకు బోధించువాడనే నిత్యవిభవ!

సీ॥ నిత్యంబు నీశ్వరు నేకభక్తి నిఁగొల్చి
నీకెట్లు సతివాంఛ నెమ్మిఁగలిగె
కోటిలింగంబు లకుంఠితభక్తితో
సేవించు నీకెట్లు స్త్రీలఁగొంటి
చంద్రశేఖరుని చంచత్పాదరాజీవ
భృంగంబ నీకెట్లు బుద్ధితప్పె
వేదాదివిద్యల విధమంతయును దెల్సి
సుదతులఁగోరుట శుభకరంబె

తే॥ గీ॥ పూర్వగాథను యిసుమంతబుద్ధిపెట్టు
నీకుమూఢనగుదు నేనిక్కువముగ
నాదుపలుకులువినుము పుణ్యంబుఁగనుము
శరణువేడుము రామునిఁ గరివరదుని

సీ॥ అనిబోధసేయు ఘనాసుర పౌత్రునిఁ
గనుగొని మనమున గాఢరోష
మొదవినఁ గనుబొమల్ముడివడుచుండగ
నిట్లుపల్కెను యప్డు నేమిరీశ
మాతోడనానీవు మహినుతికెక్కని
వాదంబులాడుట వట్టివైరి
మాటలుపల్కుట భాషింతువాయింక
మదమదంతును నిన్ను మట్టరాసిఁ

తే॥ గీ॥ దొలగిపొమ్మింక రాఘవుతోడవైర
మూనినాడను జనకజ న్భూమిపుత్రి
నివ్వననిపల్కు రాముతో నెందునెప్డు
బవరమేఁగోరినానని పలుకుమింక

సీ॥ పెడగుమాటలువల్కు విభునివీక్షించియు
మనమునఁగోపంబు మలుగుపెట్టి
యంగదుండిట్లను హాసంబుతో నీవు
నాడైనమాటలు నమ్మవైతి
విస్పష్టయుద్ధంబు నేల! రామునితోడఁ
జేసెదవా నీకుసిగ్గులేద
విరతరామధ్యాన పరమపతివ్రత
న్బాధింప నీకెట్లు భావ్యమగునొ

తే॥ గీ॥ కడనమందున నిన్ను నీకాప్తబంధు
కోటినంతయు రాముండుఁగూల్చువాడు
నాఁ మేతెంచెనీకును నవ్యయముగ
రాముఁజేరెద నింకనీలంకవీడి

సీ॥ అనుచును మెల్లగ నంగదుఁడచ్చోటు
వాసి రామునిమీఁది భక్తివనర
బుద్ధిసెప్పనఁ బొమ్మంచు నన్నను
దటిమెనావనుజుండు ధర్మమునకు
నాలవాలంబైన యారామునిమీఁదవి
దతివైరమిప్పుడు నమరఁజేసె
దుష్టస్వభావులఁ దొలఁగినలోకము
ల్పరిపూర్ణకాంతితోఁ బరిఢవిల్లు

తే॥ గీ॥ నంచుఁ దలఁచుచుఁ బొంగుచు నభ్రవీధి
వాయువేగముతోడ నవ్వాలిసుతుఁడుఁ
జేరె రామునిచెంతకుఁ జెలువుఁగలుగ
సురలుమోదింప నసురులు సొంపుడింప

సీ॥ రాకేందు వదనుని రామునిపాదాబ్జ
ములకు సద్భక్తితో మ్రొక్కిల్లి
రావణుఁగాంచుట లంకనుఁజూచుట
భాషణల్సేయుట భరితరోష
యుగుట దగ్ధంబునేదంబుగఁ గోరుట
మొదలగువిషయము ల్మఱచితచిత్తు
డగుచుఁజెప్పిన రాము డంగదువీక్షించి
వాలితనూభవ వక్రమయ్యె

తే॥ గీ॥ మనలనెయ్యంపుమార్గంబు దనుజుతోడ
సమర మేసిద్ధమయ్యెను సరియెమేలె
సేతుసాహాయ్యమున నేడు సేనలన్ని
కరము మెఱయంగఁ బంపుము యరిసగరికి

సీ॥ జనకజాహృత్కర్ణి సారసమధుపంబు
రామచంద్రునిమాట లాదఁదాల్చి
సుగ్రీవహనుమంత సుస్థిరసుబలులఁ
గపులసేనను బంప ఘనతరోర్మి
యప్పుమఘవపౌత్రు డందఱు మెచ్చగ
రామవిభుండును లక్ష్మణుండుఁ
బవమానజుండును బటురయంబునసప్త
వారిధిదాపున వప్రగోప్తు

తే॥ గీ॥ రాడి సంయుక్తభాసుర లంకనపుడుఁ
జూచిరందఱు మనములఁజొక్కి తద్వి
భవమునకు విడియించిరి భటులనంత
రాక్షసాధిపుఁద్రుంపగ రమణతోడ

సీ॥ రాముండుపచ్చిన రమణీయవృత్తాంత
మెఱిగి రక్షస్సైన్య మింపుఁగలుగఁ
బంపెను లంకాధిపతి గాఢవైరంబు
మనమునఁబెనగొన మంచిదనుచు
వానరానీకంబు వరరాక్షసబలంబు
భేరులఁగొట్టిరి మిన్నువగులఁ
కపిసైన్యనేతగా గారవంబున వాలి
తనయుఁడు రాక్షసవశములకును

తే॥ గీ॥ ధైర్యసముపేతు రావణతనయు డింద్ర
జిత్తుడుండిరి నేతగా సితజవాశ్వ
యుక్తమైనట్టి రథమెక్కి యుద్ధమునకు
వచ్చెరావణుపట్టి దోర్బలముమెఱయ

సీ॥ రామలక్ష్మణులప్డు భామవాంఛతో దుర
మునుజేయుచుండిరి మోదమొదవ
నదిగని వాతజుం డమితభక్తిని సోద
రద్వయంబును సదలంకృతముగ
మూపుననెక్కించి ముంగలసేనను
ముష్టిఘాతంబుల ముక్కలౌవు
నట్లుఁజేయుచునుండ నారామలక్ష్మణు
ల్లలితకార్ముకవిద్య వెలయునట్లు

తే॥ గీ॥ గాఢశరములఁబరగించి కదనమందు
వైరివీరులఁజంపుచు వాజిదంతి
సముదయంబప్డు ధరఁగూల సమరకేళి
సల్పుచుండిరి సురవెల్ల సన్నుతింప

సీ॥ అన్యోన్యఘర్షణాహతమగు కరులును
ధరనొఱగెడి యశ్వవారనిచయము
హతమగు సుభటులు పతనంబుఁజెందెను
రథములుఁ గూలెను రథికవరులు
పగిలెను పుట్టెలు బాణాహతంబుల
నొగిలెను వివిధంపు నూత్నకవచ
నికరంబులును విచ్చనెఱహృదయంబులు
బాహుజాలంబులు మణులదళము

తే॥ గీ॥ అన్నియునుగూడి పారెను రక్తమందు
మునిగి తేలుచు వేడుకమచ్చటించు
గృధ్రకంకములంబులుఁ గూర్మిఁదినగ
భయదమగుచుండె సంగరమహీతలంబు

సీ॥ ఆగ్నేయబాణంబు నసురవరుండేయ
వారుణాస్త్రంబును వైచిత్రుంత
వాయవ్యాస్త్రంబును బనదేయ నప్పుడు
నాగాస్త్రంబును యంపిత్రుంత
బహుళనారాచాది పటలంబు నేసిన
నన్నియుమాన్చెని యడరిమీఁదఁ
జేయుచు బాధించుజేతల దశరథ
సుతులనుగనుగొని సురవిరోధి

తే॥ గీ॥ కెంపుఁగలిగెను కన్నులనింపుపుట్ట
నాగపాశంబుచే తను నలియఁజేతు
నంచు వైచెను సర్పాస్త్రనారసములు
నరనిచేతను నాశ్చర్యమందిరపుడు

సీ॥ శ్రీరామలక్ష్మణు లిచ్ఛత్రంబుగా నాగ
పాశంబుచేతను బాధఁజెంది
ధైర్యంబుఁగోల్పోయి దైన్యంబు వాటిల్ల
నేమియునలుపంగ నెఱుకలేక
ధరణినిశయనించి తనరిరి చంద్రద్వ
యంబు సొబగునను యధికకాంతిఁ
గలిగియుండియు నాగకఠినపాశములచేఁ
గదలక మెదలకఁ గడునలిగియు

తే॥ గీ॥ నిద్రఁగైకొన్న రఘుకులనేతలైన
యుగళమునుజూచి దేవతాయోనులప్పుడు
శోకమున విష్ణుఁ బ్రార్థింపఁ జొచ్చిరంత
దాశరధులకు రక్షణ ధర్మమంచు

సీ॥ నిర్జరాలాపము ల్వినుచుమనంబున
వైకుంఠుడెంతయు వారిదశను
విని దుఃఖమునుజెంది కనివైనతేయుని
నాగపాశంబుల నణచిరమ్మ
యొమ్మనిచెప్పగఁ బురుహూతగర్వసం
హారకుండపుడు నయ్యబ్జనయను
వాక్యముల్విని నభోభాగంబునిండగ
నార్పుచుఁ జనుదెంచె నవనిపైకి

తే॥ గీ॥ పక్షవిక్షేపసంజాత బహుళపవన
తూల సర్పౌఘములుఁగల్గి బాలమూర్తు
లిద్దఱుత్థిష్ఠులైరి నిలింపగములుఁ
జదలనిల్చి జయధ్వను ల్పలుపుచుండ

సీ॥ పక్షిరాజునుగాంచి పరిపరివిధముల
దశరథపుత్రులు విశదభక్తి
గీతముల్పాడుచుఁ గిన్నర గంధర్వ
స్వరములఁబోలగ సన్నుతింప
నతడువారినిఁగాంచి నానావిధస్తోత్ర
ములనుజేసియుఁ దానుమోదితుడయి
మానవరూపంబు మహిఁగొనిచెన్నారు
వైకుంఠుడవునీవు వారిజాక్ష!

తే॥ గీ॥ జయముసేకూరు రాక్షసచయముఁదగ్గు
ధర్మమార్గంబె క్షితిలోనఁ దనరుచుండు
నీదుకోరిక సిద్ధిల్లు నిఖిలలోక
శోభనంబును సమకూరు శుష్కదితిజ!

సీ॥ అనిమ్రొక్కి వైకుంఠమునకుఁజేరెను వియ
న్మార్గంబువట్టి శుభస్కరుండు
దైతేయులెల్లరు దానవుఁబొగడగ
రావణి తనలోన రాజితాస్త్ర
బలము నుగ్గగుటకుఁ బటుదుఃఖమునఁగూడి
సమరంబుసేయగఁ జాలలజ్జఁ
బొందియు పీఁటికిఁబోవగనమకట్టె
నంతట దనుజులు నతని వెంటఁ

తే॥ గీ॥ బురముసొచ్చిరి కలువల పూర్ణవైరి
యస్తమించెను యుద్ధమునాపిరంత
సకలజనులును సుప్తినిఁజక్కనుండి
రితరవాంఛలు వీడి నరేంద్రజులును

సీ॥ మనమున నిట్లని ఘనముగఁదలచిరి
రావణపుత్రుండు రణములందు
ధీరుడై మనలను ధిక్కరించియు నేలఁ
గూలంగఁజేసెను కోలచేత
సురనాథుఁసుక్కించె సురలుమోదముదింప
శస్త్రాస్త్రచయములు సాలఁగలిగి
యబలనుజూడగ నంతటఁగన్నీరు
వఱదలై పారు మద్భావమునను

తే॥ గీ॥ దైవమునునమ్మి శత్రులధర్మయుద్ధ
మందుగెల్చియు రాజ్యముఁబట్టువాడ
ననుచురాముండు మూర్ఛిల్లె ననుజుడంత
శీతలోపచారంబులుఁ జేసితేర్చ

సీ॥ రాముండు దుఃఖభరంబున మాటలఁ
దడబడ ననుజుతోనుడివె నిట్లు
సౌమిత్రి యిదియేమి సంకటంబులుఁగల్గె
ననిలోనమనకు ననార్యముగను
జనకభూపతిపుత్రి సకలసద్గుణరాశిఁ
గీర్వాణిని దుఃఖభారఁజేసి
రావణుండటఁగొని లంకకుఁజేరెను
బాహుబలు ల్వారివారలంత

తే॥ గీ॥ ప్రథమయుద్ధంబు మనలనుబంధనంబు
నందుఁద్రోసెను యికనెట్లు నాహవంబుఁ
జేయువారమొ మనకును సిగ్గునయ్యె
దైవకృతమున కిల నసాధ్యంబుఁగలదె!

సీ॥ అంతటలక్ష్మణుం డన్ననుసేవించి
రణసుముఖునిగ ధూమ్రాక్షుడడ్డు
వచ్చినఁ జేసెను వాడును రామునిఁ
బరిపరివిధములఁ బటుతరాస్త్ర
ములను జొప్పించియు మోమున నిద్దఱి
నయిదేసి యలుగుల నాటె వాయు
చలనంబులేకను సంరంభులై యుంటఁ
జూచి మండిపడుచు సురవిరోధి

తే॥ గీ॥ తనువునొక్కటిఁబట్టి యిద్దఱినివేయఁ
బోవునంతలో మారుతి పొదివిపట్టి
ముష్టిఘాతంబులిచ్చి యాదుష్టకులుని
శనునుచెంతకుఁబనిచె నుత్సాహమొప్ప

సీ॥ వాతసూనునిచేత పంచత్వమునుగొన్న
ధూమ్రాక్షుఁజూచియుఁ దొలగిపోక
తక్కటిదనుజులు ధైర్యసాహసమొప్ప
రాజీవనేత్రుల రామలక్ష్మ
ణులనుదాకియుఁ గడునొప్పించు నారస
ములనుబంపగ రామభూవరుండు
నిశితవిశిఖముల నింపినవారును
తండంబులైకూల ధరణిమీద

తే॥ గీ॥ దైన్యతనమునుజూచి యాదానవుండుఁ
బరగునతికాయనామంబువాడు వచ్చె
రణమునలుపగ వేగమెరాముతోడ
హసితముఖమున రాముండు హర్షమొదవ

సీ॥ మొనటన హృదయంబు మూడుటూపులనేసి
మఱియును మూడిట మధ్యభాగ
ముననేయ వాడును బ్రెుగ్గతిల్లగఁబడి
మగిడియుత్థితుడయి నగధరేంద్రు
షడ్బాణములనాటి సమయింపఁజూచిన
నాపగనందనుం దమితకుపిత
కలితముఖుడగుచు ఖరతరగవనొత్త
మూర్ఛిల్లి వెండియు మునిశచిత్తు

తే॥ గీ॥ డగుచుఁజేచిన వానిఖడ్గంబుతోడఁ
బ్రవరములనాటి హస్తసవ్యయముఁగూల్చి
పివరఁగంఠంబుఁదునిమెను భీకరముగ
జనవినుతుడైన లక్ష్మణస్వామి యపుడు

సీ॥ అతికాయుమరణంబు నందుఱుదనుజుఁబెం
బంక్తికంధరుతోడ భక్తిఁబలుక
దుఃఖసాగరమునఁదోగి యాతండును
దీనుడెవ్వడుపోవు తీవ్రమైన
బాణజాలంబుల మానవవానరా
నీకంబుఁ ద్రుంపగ నెమ్మిఁజెప్పు
డని దైత్యసంతతినడుగఁ బ్రహస్తుడు
నేనుబోవుదుననె నిఖిలయసుర

తే॥ గీ॥ సంఘమంతయుహర్షింప సమరభూమి
కేగె నాతండు బహువిధగ్రీష్మడగుచు
వాతజాతుండు వానినిఁబట్టినిలిపె
సింహరాజంబు గజమును జెనకినట్లు

సీ॥ క్రవ్యాదకులవర్య! గాఢరోషంబున
నెక్కడికేగెదు నుక్కడంతు
నానాడు రావణునభిమానపాత్రవై
తూలనాడిన నిన్ను దుష్టగుణునిఁ
జంపకవిడుతునే సకలాసురులనింకఁ
బిలువుము వారను బ్రేతపురికి
పత్తురుతోడుగ పట్టిమాటలుఁగావు
చూడుము నాభుజస్స్ఫూర్తిననిన

తే॥ గీ॥ వాయసుతుమాటలాలించి భయమునెంది
యంతధైర్యంబుతోడుత నప్రబలముఁ
జూప నన్నింటినడచి వేస్రుక్కఁజేసె
నతఁడు నతనిని పెన్గదయంపి యపుడు

సీ॥ తరువుల నద్రుల దర్పించి హనుమంతు
డేయగ నరియును డిందుఁబఱచి
కరువలిసుతుమీద ఘనతరవిశిఖంబు
లొలయుఁజేసిన యంతరోషమంది
ముష్టియుద్ధంబున నష్టహస్తునిఁజేసి
యార్చిన హనుమంతు నతఁడుఁజూచి
కపివర నన్నిట్లుఁ గరములుఁద్రుంచితి
నాబలమింకను నణగలేదు

తే॥ గీ॥ రమ్ము దురమునుజేయగ లావుఁగలుగఁ
బాదఘాతంబు నిన్నును బరిభవించు
నన్నుఁ రోషించి మెడఁద్రిప్ప నవనిఁగూలె
నసురవరుడైన దుష్టప్రహస్తుడంత

సీ॥ సంతసించిరి కపిజాలంబు దేవసం
బులనుజేసిరి దితిపుత్రులష్ట
హనుమానుబాహువీర్యంబును నుతియించి
రందఱు మంగళారావములను
బూరింప రణభూమి పొల్పువహించెను
శేషరాక్షసులంతఁ జెలువుఁగుంగ
లంకనుజొచ్చియు రావణప్రభునితో
సంగరరంగంబు సకలమెల్లఁ

తే॥ గీ॥ జెప్ప నాతండు ముఖమున సిగ్గురాగ
బాలవీరులబలము లప్రతిహతమ్ము
లంచు దుఃఖించె మంత్రినిర్యాణమునకు
నసమవీరులవైరంబు దొసగుఁగాచె!

సీ॥ ధూమ్రాక్ష యతికాయ ధూర్వహమంత్రియు
నాజిఁజచ్చిరి యింకనాకుదిక్కు
బలవంతుడెవ్వఁడు బట్టెల్లఁజెడిపోయె
రామునిశక్తియె రాజిలునికఁ
బరమపతివ్రత న్బాధించి తత్ఫల
మనుబొందితిని వైరమూనినాడ
ప్రియసహోదరునిఁ గోపిష్ఠినైవీక్షించి
లంకనుండక శత్రురాజవశముఁ

తే॥ గీ॥ జేసినాడను రాముండుఁ జిద్విలాసు
డైన వైకుంఠవాసు డట్లామునీంద్ర
ఘోరశాపంబుననఁగాచె కుటిలజన్మ
నుంటిమిప్పుఁడు కుంభకర్ణుండు నేను

సీ॥ చింతించిఫలమేమి చేసినకార్యంబు
దుర్భరమనుచును దివిజవైరి
యోచించి బహువిధయుద్ధప్రవీణుని
గురుతరకాయు నక్కుంభకర్ణు
షాణ్మాసనిద్రితు షాణ్మాసయుత్థితు
మేలుకొల్పుండని మిక్కుటముగ
దనుజదళములను దడయకఁబంచిన
వారునాతనిఁజేరి వలయునట్టి

తే॥ గీ॥ ఘనుజ జంతు సురాది సన్మాంస భక్ష
ణీయ వస్తుజాలంబును నింపి ధ్వనులఁ
జెవులువగులంగఁజేసిన సమయమందు
లేచి భక్షించి రావణుబీలఁజేరె

సీ॥ కపటములచేఁ దమ్ముఁగౌఁగిలించియు నల
సంగరవిషయము ల్సకలమెఱుగఁ
జెప్పియు నాచివ్వసేతకుఁబొమ్మని
నుడివిన నాతండుఁ గడునలిగియు
దేవాదిదేవుండు దివిజాదివంద్యుండు
సద్ధర్మమార్గుండు శాంతచిత్తు
డగునట్టిరాముని డయ్యుటమనకును
సుఖకరంబునుగాదు చూడుచున్న!

తే॥ గీ॥ యనిన సోదరుమాటల కద్భుతంబుఁ
గలుగ లంకేశ్వరుండప్డు ఘనుడ వీవు
జయముఁగొంతువు పొమ్మని సాగనంపెఁ
గుంభకర్ణుని దిగిభసంకుచితకర్ణు

సీ॥ రౌద్రంబుఁ గన్పడ రావణు తమ్ముఁడు
నప్పుడున్నంతలో వానరాళి
యటునిటుఁ దిరుగుచు నరుగుచునుండగ
హస్తద్వయంబున నఖిలకపుల
భక్షించుచును కోప భయమును జెందియుఁ
గొందఱు కోతులు గుంపుఁగూడి
సైన్యసంహారణంబు సకలంబు వానర
ప్రభునకు నంతయు భక్తిఁ జెప్ప

తే॥ గీ॥ సందడినిగూడి దశరథనందనునకు
లక్ష్మణునకును చెల్వంగ రాజితాస్త్ర
ములను వాయునసేయ సంపూత్కరించి
సైన్యసమును రామునిఁ దాకెనంత

సీ॥ మర్కటయూథంబుఁ బట్టుచుఁ బాధింపఁ
బవనజాతుండును వానిచావు
రామునిచేతిలో లభ్యమయ్యెడునని
యూరకఁ దానుండె నుక్కఁ దక్కఁ
చేరినదితిపుత్రుఁ జేవయు నేర్పడ
బాణాసనంబునఁ బంపెవడిగ
నిశితంబులేఁబది దశరథసుతు డంత
వ్యర్థంబులై పోయె వానివలనఁ

తే॥ గీ॥ అపుడు సంరకోపుడై పృథివినాథు
డొక్కటి యమోఘయస్త్రంబు నాదిపైవ
నదియుఁ దెగనేసె బాహులనప్పు రెండు
వరపులనుకోటి యవియును ధరణిఁ గూల

సీ॥ హస్తద్వయంబు విధ్వస్తమైనను శక్తిఁ
గలిగియు దనుజుండు గదను చేతఁ
సంస్థితఁజేసి విసరవైవ నదియును
వాయువేగంబునవచ్చి రాజ
పుత్రులఁదాకంగఁ బోవునంతలో వాయు
సూనుఁడు దునిమెను సునిశితహేతి
సహసహస్రనాముండు నగ్గించె నాతని
యంతట వాడును బంతమందె

తే॥ గీ॥ తరువులన్నిటిరువ్వ నాదాశరథియుఁ
దెక్కుకోలలనేసియు నుక్కడంచె
నెట్టకేలకు వాడును యెక్కుపెట్టెఁ
గమలగర్భునియస్త్రంబు గర్వమునను

సీ॥ ప్రళయకాలాతీత భానుల తీక్ష్ణ
కాంతిపుంజంబులఁ గ్రమ్ముకొనగ
బ్రహ్మాస్త్రమప్పుడు రాజితంబుగరాగ
భయపడిరామండు భక్తివినయ
సంభ్రమంబుల రమాజానియస్త్రంబును
దలచిన నదియును విలసదోగ్ర
ఘాతిరాజ్ఞల ఘనినెల్లఁగొల్పుచు
జనులందఱునుజూడఁ జవలఁబర్వె

తే॥ గీ॥ దైత్యునస్త్రంబునోడించి తనివిసనక
పాదయుగళంబుఁగాల్చగ భస్మమైన
నతఁడు నిలువగఁజాలక యవనిఁగూలె
శిఖరవిరహితశైలంబు చెలువుఁగలిగి

సీ॥ ఆహవరంగంబునందు జీవంబులుఁ
గలిగియుఁ గూలినకఠినతనుఁడు
రావణుండప్పుడు రామునిదేవిని
లంకఁ దెచ్చుటఁ జూడ రాక్షసప్ర
కరమునకును నేఁడుఁ గల్గెనుమరణంబు
పరసతీవాంఛలు భద్రకరమె!
యంచుఁ జింతింపగ హసనముఖుండౌచు
రఘువరాగ్రణి వింటలక్ష్యమొప్ప

తే॥ గీ॥ వీతిహోత్రునియస్త్రంబు భీతిఁగలుగ
నసురమృతుఁ జేయుమంచును నప్డుఁదొడిగి
వైవ నదియును కంఠంబువ్రక్కలించె
నిర్జరశ్రేణిమెచ్చగ నిపుణముగను

సీ॥ కుంభకర్ణుండిట్లుగూలిన యాతని
గాత్రంబునుండి పవిత్రమైన
తేజోమయంబగు దీధితియొక్కటి
రామచంద్రుని, శరీరంబుసొచ్చె
విస్మయంబందిరి, వీరాధివీరులు
నిదియేమియంచును నిఖిలదివిజ
వరులును యాశ్చర్యభరితమనస్కులై
తలచిరి రామునిదయయునంచుఁ

తే॥ గీ॥ దల్లడిల్లిన మనముల దనుజవరులు
దైత్యవల్లభు కంత సోదరునిచావుఁ
జెప్ప నాతండు దుఃఖించి చేష్టలుడిగి
ధైర్యగుణుడంచు ననుజునిఁ దలచితలచి

సీ॥ హా పుల స్త్యసుపౌత్ర! హా వీర జలరాశి!
కూలితే నీవిట్లు గొండమూర్తి
హా దైత్యసంరక్ష! హా నిర్జరవాంఛిత!
వాలిసితే నీవిట్లు బొలికలనితో
హా శర్వభక్తక! హా సురసల్త్రశస్త!
రామబాణంబున లయమయితివి
హా సద్గుణస్తోమ! హా వంశభూషణ!
పోయితే మమువీడి పుణ్యలోక

తే॥ గీ॥ ములకు నంచును రాక్షసభూవరుండు
దుఃఖసాగరమున నప్డు దోగుచుండ
నగ్రనందను డింద్రజిత్తపుడు వచ్చి
తండ్రినోదార్చి యిట్లను ధైర్యముగను

సీ॥ అనుజునిచావుకై యడలొందగను నీకుఁ
బనియేమి నేనుండ భద్రముగను
వైరిపిదుల పరిహారంబు నేఁజంపి
వచ్చెద విజయంబువర్థిలంగ
నాజ్ఞయిమ్మంచును నందనుండునువేడఁ
బోయిరమ్మని యప్డుబుచ్చెననికి
లంకాధిపతియును రాక్షసనిచయంబు
గజరాజవాజులుఁ గలసిరాగ

తే॥ గీ॥ ధవళతరమైన దివ్యరథంబునెక్కి
దురముసేయగ్గవెడలెను దోర్బలుడయి
పాకశాసనవైరియు బహువిధంబు
లైనభేరుల నిస్వన మప్డుఁగలుగ

సీ॥ యుద్ధంబుసేయగ నొప్పుదై త్యునిఁగని
యారామవిభుడును యాంజనేయు
సంగదు సుగ్రీవు నందఱి నీక్షించి
యాహవమొనరింతు ననిన వారు
జయశబ్దములువల్కి సక్రోధుడై యేసె
వైరితనువునను వాడిములుకు
లేఁబది నన్నింటి లీలగఁదునుమాడె
రావణి యంతట లావుఁగలుగు

తే॥ గీ॥ విశిఖచయమును జొప్పించె వికటవేష
ధారణుండయి దనుజుండుఁ దరణికులుల
మీద నదృశ్యుడగుచును భీతిఁజెంద
నందఱును మారుతాత్మజు డప్డు వడిగ

సీ॥ ఆకాశపథమున నసురయున్కినిఁజూచి
పంచముఖంబులఁ బ్రస్ఫుటముగఁ
బుట్టించి యంతట దిట్టంబుగన్కాన
దనుజుండు నాతనిదర్పమునకు
సంతోషమునుగల్గఁ జయ్యన భూమికి
దిగివచ్చి వెండియుఁ దీవ్రబాణ
వర్షంబుఁగురిపింప వారించుచును రామ
చంద్రుండు హెచ్చుగ సంకటపడి

తే॥ గీ॥ దివిజనాథుడొసంగిన పవిసమాన
శక్తిబాణంబుఁ గరమునఁజంపఁదాల్చి
సప్రయోగంబుఁజేసెను సకలలోక
భీకరంబుగ నప్పుడు వీరపరుఁడు

సీ॥ భీమమై బహుతీవ్రధామమై సంహార
దివిజమై కిరణసందీప్తమగుచు
వచ్చి సౌమిత్రిసుఫాలంబుఁదాకినఁ
బవనంబువలన భూపతనమైన
తరువుపోలిక నప్డుధరణిపైఁగూలిన
లక్ష్మణుఁగాంచి విరాగులగుచు
వాయుసుతుండును వాలిసూనుండును
వారిజమిత్రుని వంశజుండు

తే॥ గీ॥ సర్వమాత్మజముఖ్యులు సమితదుఃఖ
వంతులయి మనపూర్వపాపంబులేమొ!
యేమిసేయుద మిప్పు డింకెవరుదిక్కు!
రెండుపర్యాయములుఁగూడ బెండువడితిమె

సీ॥ సీతల్లిప్రశ్నింప నేనేమిచెప్పుదుఁ
దమ్ముఁడ! యుంచని దాశరథియు
శ్రీరామసోదర! క్షితితలమందునఁ
బడితివయంచని వాయుసుతుఁడు
రామభక్తాగ్రణీ! రాజిల్లువాడవు
శుష్కించితేయంచు సూర్యజుండు
సమరకౌశలి! నిన్ను శత్రువుబాధించె
నా యంచుదురపిల్లె నంగదుండు

తే॥ గీ॥ వీరిశోకగీతంబులు విని సుషేణ
నామకసద్వైద్యుడప్పుడు నరయఁజూచి
శోకముడుగుడు యీతండు సుంతమూర్ఛఁ
జెందెనని చెప్పి మఱియును సేదఁదీర్చి

సీ॥ వానరవరులార వర్తిల్లు నుత్తర
సంద్రంపుఁ దీరంబు సకలవృక్ష
యుక్తమై యచ్చటనొప్పుచుండును దివ్య
సంజీవనామ కౌషధిచయంబు
దానినిప్పుడు మీరుఁ దప్పకఁ దెచ్చిన
సౌమిత్రిమను నట్టిసకలహితము
నెవ్వరుఁ జేతురు నేర్పొప్పఁ జెప్పుడు
సప్తాశ్వజన్మకు సరసముండె

తే॥ గీ॥ చేరవలయును యంచు సుషేణుడాడ
రామభక్తిని బ్రకటించు లక్ష్యమిదియ
యనుచు నుప్పొంగి సామీరి హర్షమొదవ
లేచె హిమవంత ప్రాంతంబు లీలఁ జేర

సీ॥ శ్రీరామసోదరు జీవనంబులునిల్ప
సంజనీసుతుడను యందఱికిని
వందనము లొక్కి నందమొందగఁజేసి
యాకాశమార్గంబు నప్డువట్టి
వాయువేగంబున వర్తిల్లుచునుబోవ
సకలరాజ్యంబులు సరసిచయము
లనుజూచుచునుబోయి రామునిఁ దలచుచుఁ
జేరెను హిమవంతశీతనగము

తే॥ గీ॥ బహుళపర్వత నిర్గత వారిచయము
గరళకంఠుడునివసించు ఘనపదంబు
నప్డు సంతోషవదనుడై నగచరుండు
సంచరించెను యౌషధీచయము కొఱకు

సీ॥ వానరవైద్యుని వాక్యము లమ్మదిలోనఁ
దలచుచుఁదిరుగగ జలజములను
నాకరంబైనట్టి నవ్యసరోవరం
బొక్కటిపొడఁగట్టెఁ బొల్పుఁదనర
తత్తటమందు నుద్ధామాత్మయోగత
పంబుచే మిక్కిలిభక్తిఁగలుగఁ
బరమేశుఁగోరెడువాని విధంబున
నున్నట్టి మృషయోగి నొకనిఁగాంచి

తే॥ గీ॥ వినయవినమితుడై యేగి వేడ్కతోడ
నడిగె సంజీవవృత్తాంత మప్డుమునియు
"లక్ష్మణస్వామి సప్రాణ రక్షితుండు"
నయ్యె సంజీవివద్దని యంపె నన్ను

సీ॥ అనిపల్కు మునినాథు ఘనముగ వీక్షించి
జనరహితంబైన వనములందు
నీతవొక్కఁడు నొంటి నిష్ఠతోఁదపమును
జేసెదుఁ జూడంగఁ జిత్రమౌను
మాటలు విపరీతమైతోచు తనియెద
నందుఁ బావని పూర్వమట్టులాడఁ
గోపించి మునియును ఘూర్ణితనేత్రుడై
వాయుపట్టిని యొక్కపరుషవాక్య:

తే॥ గీ॥ మాడ నాతడుజృంభించి మహినిఁజఱచి
గట్టసేయుచు నాతని కంఠతలము
హస్తమర్దనఁజేయగ నతఁడుగూలె
నిజభయంకరరూపంబు నేర్పుఁదాల్చి

సీ॥ నన్నువంచించి తానరిగెఁబో శమనుని
పట్టణమార్గంబు నట్టెవట్టి
రాక్షసుండీతండు రామునిదయచేత
నిప్పుడుఁజంపితి నేననింక
నెక్కడికేగుదు నెట్లుఁగాంతునొయంచు
సంకటపడి వాయుజాతుడపుడు
నన్యోన్యఘర్షణ క్షతములువాయంగ
జలజాకరంబున స్నానవిధులఁ

తే॥ గీ॥ జేతునంచును దలచి తచ్ఛీకరాంబు
కణములనుదోగి మగుడంగఁ గాలువట్టె
ఖరతరంబైన వక్రనక్రంబుమొకటి
తనదుదంష్ట్రల బాధించుచును గడంగి

సీ॥ ఇదియేలకో నన్ను మదమునబాధించు
చున్నది యంచనిచూడ్కి నిలిపి
సత్త్వసంపన్నుడై సామీరి పాదంబు
జాడింప నదియును సకలమైన
గ్రాహరూపముఁబాసి కమనీయభూషణ
కాంతులు దిశలెల్లఁ గ్రమ్ముకొనగ
నంగనయై మ్రోలనగుపడ నాతండు
నీవెవ్వతెవు నిందునేగుదేరఁ

తే॥ గీ॥ గలుగుకారణమిప్పుడుఁ బలుకుమన్న
నదియు వినమిత గాత్రయై యంజనీజు
కిట్లుఁజెప్పెను మనమున కింపుఁగలుగు
సరససంయుక్త భాషణ చతురితముగ

సీ॥ రామభక్తాగ్రణీ! రక్షించితివినన్ను
దుష్టరూపముఁబాసి శిష్టనయితి
నాట్యశాస్త్రంబున నలువలౌ యప్సరో
కులమందు నేనును గూర్మిఁబుట్టి
శతమఖునానతి శైలజాధిపువేడు
సద్బ్రాహ్మణాంశజుఁ జపలుఁజేయ
వక్రనక్రంబనై వఱలుచుందుము పొమ్ము
దుష్టయంచును నన్నుఁదొలగఁద్రోల

తే॥ గీ॥ శాపమోక్షంబునెప్పవే సత్త్వతేజ!
యనిన నాతండుఁగరుణించి యప్డుఁజెప్పె
రామ కార్యార్థమై కపిరాజుయొకడు
వచ్చి భవదీయతనువు నవార్యముగను

సీ॥ స్పర్శింప నీదైనజన్మంబుఁగలుగును
పోయివచ్చెదనంచుఁ బోయెదివికి
నీకృపచే నన్ను నిప్పుడుఁబాపితి
హేయజన్మంబున హింసవలన
జీవించు నాదైనచేతలు దీనికిఁ
బ్రత్యుపకారంబుఁ బడయుమయ్య
నీభుజబలముచే నీల్గినవాఁడొక్క
లలిరాక్షసుడు పేరు "కాలనేమి"

తే॥ గీ॥ నిన్నువంచింపనెంచి తానేగెదివికి
భావియుగమున నితడు దుర్భావుడగుచు
జన్మనొందును "కంస" భూజానియగుచు
విష్ణుచేతను మరణంబు వీనికపుడు

సీ॥ అనిచెప్పి యప్సరోవనితయు వాయుజు
వీక్షించి యిట్లను వీరవర్య!
నీకామితార్థము నేనెఱుంగుదు రామ
సోదరుబ్రతికింపఁ జొచ్చి వెదుకఁ
బోవుచున్నావు పుణ్యకార్యంబులఁ
జేసిననేగదా సిద్ధిఁజెందు
సకలవాంఛలునంచు సారసనేత్రయుఁ
జూపె నాతని కప్డు శోభితంబు

తే॥ గీ॥ దివ్యతరుపులపదమును దివిజగంగ
జలము నభిషిక్తమైనట్టి "సంజీవాఖ్య"
పర్వతశ్రేష్ఠ మానంద భరితుడగుచుఁ
దద్గిరీంద్రంబుఁజేరెను తన్వియరుగ

సీ॥ ఒకచోట ఫలపుష్పయుక్తంబులైనట్టి
కమనీయ తావులఁ గాంచెనతడు
ఒకచోట మత్తాళియూథంపు ఝుంకార
సంగీత సద్వనస్థలములొప్ప
ఒకచోట నోషధీయుద్ధత లతలను
గాంచెను కన్నులఁగఱువుఁ దీర
ఒకచోట జపతపోయోగంబు సల్పుచు
నిల్కడలోనున్న నిష్ఠపరుల

తే॥ గీ॥ గరుడ గంధర్వకిన్నర వరులుఁగూడి
సంతతానంద సౌభాగ్య సకలసుఖము
లనుభవించెడు కోనల నప్డునొక్క-
చోటఁజూచెను గరువలిసూనుడంత

సీ॥ ఎంతశోధించిన నిమ్మగఁదనకును
వలయునట్టివి పొందవలను పడక
కాలయాపనమౌట గ్రహియించి యింకను
దడవుసేసినఁ బనితప్పిపోవు
ననిబుద్ధిఁదర్కించి నగరాజమును రాము
సన్నిధికేనిప్డుఁ జక్కఁజేర్ప
మాభిషగ్వరుడును బరికించి సంజీవ
లతికనుజేకొని లబ్ధజీవ

తే॥ గీ॥ నునిగఁజేయును లక్ష్మణఘనునియనుచు
స్వర్గగజకర ఘాతినిఁ జాలబలముఁ
గలుగుబాహుద్వయంబునఁ గదలఁజేసె
నిఖలలాభము వృక్షమ్ము నీడ్చినట్లు

సీ॥ సర్వజనాభీలజనకంబుగా గిరీం
ద్రంబును నఱచేత రాజితముగఁ
బట్టి సత్త్వంబునఁ బవనపుత్రుండప్డు
లంఘించె నాకాశలక్ష్యముగను
సురసంఘమంతయుఁజూచుచు సుమరాజ
వర్షంబుఁగురియింప హర్షమొంది
మారుతవేగుడై మహీనుతికెక్కఁగ
క్షణములో దేశంబులధిగమించి

తే॥ గీ॥ యుద్ధశిబిరంబుఁజేరె నయ్యోధవరుఁడు
వానరసమూహమంతయు భక్తివినయ
సంభ్రమంబులఁ బెనగొని సన్నుతింప
గిరిని ధరణిపైనిడియె నొక్కింతనూది

సీ॥ బ్రహ్మాండఖాండంబు బ్రక్కలింపనె మేటి
యంచని దైత్యులు నౌరయనగ
రామభక్తునకెందు లావగు దుఃఖము
లలుగునే యంచని కపులువల్క
సంతోషచిత్తుడై జనకజాధిపుడును
వాతజా బహాధైర్యవర్తనంబు
వలనఁ గార్యమునయ్యె నిలఁగీర్తిహెచ్చెను
యంచని నాల్గవయవరజునిగ

తే॥ గీ॥ స్వీకరించియు వైద్యుని చెంతకేగి
తడవుసేయక సంజీవిదర్శనంబు
చేత లబ్ధజీవనునిగఁజేయుమయ్య
యనుచుఁబ్రార్థింప నతడును యద్రికడకు

సీ॥ త్వరితంబవేంచేసి వారిజమిత్రుని
రాకను శంకించి రమణ నిష్ట
దేవతలందఱి దీవనలైకొని
సంజీవనామంబు "సకలమృత్యు
వారిణి" యని పల్కి వరశాఖనొక్కటిఁ
గరమునఁదాలిచి పరమభక్తి
మంత్రముల్వలుకుచు "మహాఁబలితుండైన
లక్ష్మణవర్యుడు లావుఁగలిగి

తే॥ గీ॥ లేచుఁగావుత" యంచని లీలనపుడు
నాసకొనయందు నాసలనసురునట్లుఁ
జేయఁ బెన్నిద్రనుండి లేచినవిధంబుఁ
గాగ నుత్థితుడయ్యె లోకంబుమెచ్చ

సీ॥ రాక్షసాధమ! నిన్నుఁజంపెద
నంచని యనుజుండు నపుడుపల్క
శత్రువర్గంబులు సమరభూమినిలేవు
కోపముడుగుమంచు భూపతియును
బల్కి తమ్ముని దీర్ఘబాహుల నాలింగ
నంబుఁజేసియు బహుసవ్యమైన
ఫలసంతతులు వెట్ట భక్షించి యాతండుఁ
దొంటి విధంబునఁ దోచె నంత

తే॥ గీ॥ లంకనగరంబుఁజొచ్చి తెల్లంబుఁగాగ
తంత్రికంతయు నింద్రజిత్తపుడుఁజెప్ప
నిదియ యదనని తోషించి మదమెసగగఁ
గదనమొనరింప నద్దశకంధరుండు

సీ॥ కాల్బలంబును రథగజములు తురగంబు
లాదిగజనులు మేలంచుఁబలుక
సామంతరాజులు సహచరుల్తోడుగ
రాగ రోషంబున రంజితుండు
నగుచు రామునిఁదోడ నాహవమొనరింప
భేరిభాంకృతులు దిగ్వీధినిండ
వింశతిభుజముల న్వింటులుమోపెట్టి
వచ్చిన రాముండు భయముఁగలుగ

తే॥ గీ॥ బ్రహ్మతేజంబు ముఖమునఁ బటిమదనర
వెలుగుచున్నది వీని నేవిధమునైన
నోంచుటకు నదుపాయంబు నూహఁజేయ
వలయునని మిత్రవర్గంబు వైపుఁజూడ

సీ॥ ఇంతలోపల రాక్షసేశ్వరుండప్పుడు
దశహస్తములకు లుద్ధతనువేయ
మధ్యమార్గములోన మార్తాండ వంశుండు
నన్నియుఁద్రుంచగ నక్కజముగ
రెండవసారి వరిష్ఠంబులగు యస్త్ర
లన్నియువిసరిన రామచంద్ర
నిశితవిశిఖముల నుగ్గౌచు నుండంగ
నతఁడును వివిధాస్త్రతతిని వేగ

తే॥ గీ॥ మునను రాముని నేసినఁ బూర్ణకోప
కలితముఖమున రాముండు ఘనతరంబు
లైన శతసంఖ్యశరముల నవనిజాప
హృత్తుగర్వంబు మాయించె హుంకరించి

సీ॥ ఆగ్నేయశరమున నతిభీకరాగ్నినిఁ
బుట్టింప వారుణంబున నమేయ
జలమునుఁగురిపించె జనకజాధిపుడును
శత్రువర్యుఁడు నంత సర్పములను
మదమున వైచిన మానవపతియును
గరుడాస్త్రగములను గతినముగను
జొప్పింప నాగముల్ సొక్కినఁ ద్రిదశవి
రోధియు మనమున రోషమంది

తే॥ గీ॥ సప్రయోగంబుఁజేసెను సకలజనభ
యంకరంబును శ్రేష్ఠంబునైన విశ్వ
కర్తయస్త్రము హస్తయుగంబుమొగిచి
ప్రార్థనంబునుజేయుగ వ్యర్థమయ్యె

సీ॥ అస్త్రంబులన్నియు నడగిపోవుటఁజూచి
దనుజవరుండును గనులఁగెంపుఁ
గలుగ రామునిఁగని కాకుత్థ్స నాయస్త్ర
పటిమనుదూలంగఁ జాడుసేసి
నిర్వీర్యుఁజేసితి నేనింతఁబోదునా
రణమునన్నిన్ను మారణముసేయ
నంచుఁ బ్రగల్భము ల్నవ్వుచునాడఁగ
రఘువంశవరుఁడును రాక్షసాధి

తే॥ గీ॥ హా! మదీయ బాణాగ్ని నిన్మ్రుచ్చునింక
గతమునుబిచి నాతోడ సంగరముసేయు
నెల్లకార్యంబు లిప్పతంబెపుడు నిచ్చ
నతము నత్క్కీర్తిహెచ్చు నిజ్జగమునందు

సీ॥ అనిరామభూపాలు డాడినపలుకులు
ములుకుల విధముఁ జెవులసుఁడుసర
పీరవరుడవని వేమాఱువింటిని
నీచంపుఁబలుకులు నిన్నుఁబొగ్గ
సంధిసేయుటయేల సమరోగ్రుడగువాని
కెందును నరయంగఁబొందులేదు
యనిఁజేసివిజయంబు నార్జించుటొండెను
రణభూమి వేగ మరణమునొండె

తే॥ గీ॥ సైనికులు రాజకోటికి నరయగెల్చి
సకలసౌభాగ్య భోగవాంఛలనుదేలఁ
గలను యనియెడు దానవువలనుజూచి
జనకాత్మజసుభృంగుఁడుఁ జక్కఁబల్కె

సీ॥ తోయజహితుఁడిప్డు తూర్ణంబ వచ్చెను
వార్ధిలోఁ గ్రుంకెను వైపుఁగనుము
సంగరంబును నేఁడు జాలింతమనిచెప్ప
నందఱుఁ దమతమ యాలయముల
కరిగిరి లంకాధికారియు ఘటనివ
హంబుతో నేగెను యస్వపులంక
యుద్ధశ్రమంబును నోర్చుచు సైనికు
ల్సుఖనిద్రఁబోయిరి సులలితముగ

తే॥ గీ॥ దొరమహామానవరూపులు భద్రకరులుఁ
దలచుచుండిరి భావియుద్ధంబు లెట్లుఁ
బరిజరించుచునొ యంచని బాలభాను
డుదయమయ్యెను సంతసమొదవనప్డు

సీ॥ రావణపంపున రాశితాస్త్రంబులఁ
గొనివేగఁ గుంభనికుంభులంత
దర్పంబుఁ జెలరేగ దానవాంతకుడైన
రామునిమీదికి రంహఁజగుచు
మూడు బాణములేయ పూత్కారమునుసల్పి
దశరథతనయుండుని శితవిశిఖ
ములను రెట్టింపున మోమున నేయంగ
సోలిరిద్దఱు నంతశుభముఁగలుగఁ

తే॥ గీ॥ వైకిలేచిరి కరములఁ బటుసుఖడ్గ
ములను బట్టియుఁ గౌసల్య పుత్రుడంతఁ
జిత్రబాణంబునేసి విచ్ఛిన్నముగను
జేసె హస్తద్వయంబును సిగ్గునొంద

సీ॥ రామభూవరుచేత రక్తసిక్తాంగుడై
కుంభనికుంభులఁ దునిపినంతనులు
నగుచు రామునిపైన నారాచశతములఁ
బదములనేయగ బద్ధరోష
కలితుఁడై ఘోరాస్త్రగములను బరగించి
పాదయుగ్మంబును భంగపఱచి
శాఖాదిరహితమై శాద్వలతనువులఁ
బోలి యిద్దఱు రణభూమియందుఁ

తే॥ గీ॥ బడిన నినవంశజాతుండుఁ బవనసఖుని
కీలజాలంబుఁగల్గిన మూలశరము
తప్పకీద్వయంబును నేడు ధరణిమీద
లుప్తమస్తకులగుచుఁ గూలుదురు గాత!

సీ॥ చేఁబూని పైమాటఁజెప్పుచు విడుపంగ
నదియును వెగనేసె నరులతలలు
క్షణములోపల దివిజాదిబృందంబంత
సంస్తుతుల్సేయంగ సమరభూమి
పలలమస్రగస బహుళతండంబులఁ
బరిపూర్ణమైయుండి పరవిహంగ
భావనోత్సుకతను గడునొప్పియుండెను
దనుజుల యవయవ ధర్మములను

తే॥ గీ॥ గలిగి భీకరమైయుండె కాలవశత
సర్వరాక్షసనిచయంబు సన్నగిల్లె
సర్వమాత్మజముఖ్యులు నందితంబు
లైన మనములతోడుత రాముఁబొగడ

సీ॥ వీరాధివీరులు వినుత యశోధను
ల్కుంభనికుంభుల కుత్సితంపు
మరణంబు తెల్లను సురవిరోధికిఁ జెప్ప
నత్యంత ఖిన్నుడై యతడు నింద్ర
జిత్తునుబిలిపించి సేనతో నరులపైఁ
జెచ్చెర నేగుము సితజవాశ్వ
ములను శితాంబకంబులను దాల్చియు దుర
మునుజేయుటకు రామభూపుతోడ

తే॥ గీ॥ నన్న జనకుని మాటల నౌదఁదాల్చి
పటుతరాస్త్రసమేతుడై చటులరాక్ష
సప్రజాలముఁ గొల్వగఁ జనియెననికి
దైత్యులగ్గింప సురలుమోదంబు డింప

సీ॥ సీతాహృదయచోర జితవైరివర్గుండు
రాముండుఁ దమ్ముని రణపటిష్ఠుఁ
గాంచి యిట్లను లోకకల్యాణమేర్పడ
నాజినిహరియింపు మమితశౌర్య
నింద్రజిత్తును నేను నిఖిలరాక్షసచయం
బడగించి శ్రమమునుబట్టినాడ
యుద్ధంబుఁజేయంగ నోపంగలేనన
సౌమిత్రి యత్యంత సంతసంబుఁ

తే॥ గీ॥ గలుగఁ బగతుబఖండింపగలను మఘవ
జిత్తు గర్వంబుఁ దూలంగఁజేసి నీవు
మెచ్చునట్లుగఁ జేసెద మేలు యాశీ
షంబులిమ్మంచు నాడిన జనపతియును

సీ॥ జయముఁగొందువుగాత సర్వేశ్వరుని దయ
నంచును దీవింప నపుడు వైరి
వరులందఱునుగూడి వచ్చిన జంకక
సౌమిత్రి ధనువును సలిలీలయుగా
బట్టి దివ్యాస్త్రసంబాధిత, తనులుగా
తక్షణంబునఁ జేయ దనుజవరుఁడు
త్రిపురహరుండగు దేవదేవుని మ్రొక్కి
కనులను రూక్షేక్షణములొలుక

తే॥ గీ॥ లక్ష్మణునిమీద కరయుగలాఘవముగ
వనన షష్టిబాణంబులఁ గురియు నేయ
నతడు వానిని మధ్యనడరి త్రుంచె
నంత వాడును సువ్యత్తుడగుచు నడరి

సీ॥ గాఢతమంబును గల్పింప నాగ్నేయ
బాణరాజంబునఁ బాపెనతఁడు
వీతిహోత్రపుబాణమేయంగ లక్ష్మణ
వారుణంబున నదివన్నెఁదలఁగె
సర్వాస్త్రతతులను శత్రువునిగిడింప
గారు డాస్త్రంబునఁ గలిసెఁబూవి
బ్రహ్మాస్త్రబలమును బరగెడు నారాయ
ణాస్త్రంబునను దాని నాపెనతఁడు

తే॥ గీ॥ దివ్యశరములు రావణి దీప్తముగను
నేయునంతలో నన్నిటి నిపుణముగను
రామసహితుడు నడుమున లావు సెడగఁ
జేసె సుజనులు నిర్జరశ్రేణి మెచ్చ

సీ॥ క్రవ్యాదకోటులఁ గయవలి నూన్నపైఁ
గవిసిన నారదుఁ బవిసమాన
భాసురగదచేత వారిశిరంబులఁ
గరములు పదములు ఘనతరంబు
లైన జానూదర రదములన్నిటి
నవియంగఁ గొట్టుచు నాహవంబు
సల్పగ నాపగ జాతుని సంరంభ
విజృంభణమునకు విస్మయంబు

తే॥ గీ॥ అన్ని భాషింప దశరథ రాముడంత
నాంజనేయునిఁగాంచి పుణ్యాత్మ! దైత్య
పరుడు దుర్భరుడయ్యె నేభంగివీనిఁ
జంపవలెనన్న నతడును జక్కఁబల్కె

సీ॥ దశరథ పుత్రక! ధర్మస్వభావుక
దైతేయనాశక! ధర్మభంగ!
పాపాభ్రవాతూల! బహుజననుతశీల!
పరితోషభువిబాల! భక్తజాల!
రాత్రి కాలంబున రాక్షసశ్రేణికి
దుర్భరబలమును దోః ప్రతాప
మును గల్గుఁగావునఁ గనగ మధ్యాహ్నంపు
కాలానఁ జంపుటఁ గడు సులభము

తే॥ గీ॥ దీని యోచించి చేయుము దివిజవరులు
మెచ్చనని యంత రాముండు మేలటంచు
ననుజువీక్షించి దానవునంపు యముని
సదనమునకంచుఁ బలికిన సంతసమున

సీ॥ సర్వాధికంబగు శాతోగ్రశరమును
నాత్మనుపాసించి నన్నుఁగన్న
తల్లికి భక్తిని ధర్మంబుఁదప్పక
సేవాది సత్క్రియ ల్సేయునేని
జనవంద్యు రాముని జనకనందననెప్డు
సద్భక్తిఁగొల్చుచు సంచరించు
నేనిని గురువుల నిష్టంపు మిత్రుల
నణకువ ననుబుద్ధినం యుండేని

తే॥ గీ॥ సత్యమెప్పుడు విడువక సాగునేని
ధరణి దివిజాల మాటకుఁ దప్పనేని
నన్నుఁగావుత నీతఁడు సమరభూమి
నంచు లక్ష్మణస్వామియు నంపవిడుచు

సీ॥ రోదసీకుహరంబు రోయుచు దీధితుల్
వ్యాపింప వచ్చిన వైరివరుఁడు
నిశితబాణంబులు నేర్పొప్ప సంధించి
దానిపై విడువంగఁ దద్భరంబు
నారాచతతినంత నాశనంబుగఁ జేసి
పరులకభేద్యమై భయకరంబు
నగుచు రావణి మహోదగ్రంబు సలలిత
వివిధకుండల ముఖ్య వేష్టయుక్త

తే॥ గీ॥ మైన శిరమును ఛేదించె భాసురముగఁ
బుష్పవర్షము దివినుండి పుణ్యసూచ
నంబునట్లుగఁ గురిసెను నాణ్యమైన
సరసనర్తనఁజేసి రప్సరసలంత

సీ॥ తమ్మునిచేతకుఁ దరణికులుండును
హనుమంత సుగ్రీవ యంగదాదు
లందఱు మనముల నానందమొప్పార
వినుతిఁజేసిరి భుజవీర్యమునకుఁ
దక్కటిమూకలు దండెత్తివచ్చినఁ
దరలగఁదోలెను ధైర్యముగను
ననిలజాతుండప్డు నాహవభూమిని
శేషరాక్షసులును సిగ్గుఁజెంది

తే॥ గీ॥ లంకనగరంబునొచ్చి యారావణునితొ
యగ్రపుత్రుని మరణమంతయును దెలుప
మూలవిచ్చిన్నమైచెడి భువినిఁగూలి
నట్టివృక్షంబుపోలిక నతడువంత

సీ॥ ధరణినిగూలి హాతనయ! పరాక్రమ
ధుర్య! నీనిండు చందురనిమోము
నికనెప్డుఁజూచెద నీల్గితేయనిలోన
మమ్మందఱనుపీడి మర్త్యలోక
మునమండనీక నిన్నుందుగాఁజేకొని
యముడెట్లుఁజొచ్చె నన్యాయపథము
దుష్టబుద్ధిని నేను తుంటరి తనమునఁ
జేసినదానికిఁ జిక్కితీవు

తే॥ గీ॥ నీదునామంబు భుజముల నిష్ఠురతయు
మఱచిపోవగరాదుగా మాన్యచరిత!
రాజసత్కారసౌఖ్యంబులందుఁ దేలి
యుండవలసినవాడవు యుదనిపుణ!

సీ॥ అనిమకపిల్లును ఘనకాయుడై నట్టి
దశకంధరుండు మెత్తటిను సెజ్జఁ
దలవాల్చియుండంగఁ దత్పరివారక
తతులును శీతమైనసరు వారి
కణములఁదేర్చిన ఘనకుపితాత్ముడై
కాపత్థ్రతిలకుల న్కదనమందు
నిర్జించుమార్గంబు నేరకఁదలపోసి
స్వయముగ వారినిఁజంపఁజూత్తు

తే॥ గీ॥ ననుదు రెండవసారి కయ్యంబుసేయ
వచ్చె నాహవభూమికి భటులు హితులు
రథగజంబులు రాక్షసప్రకరములును
గొల్వ దశకంఠు డెత్తైనకొండమాడ్కి

సీ॥ సామర్థ్యమేర్పడ సకలనారసముల
నేసిన నన్నింటి నిమిషమాత్ర
కాలంబునందున ఘనరామబాణంబు
వారింప వైరియు వానరతతి
నొంపంగ శూలంబునుగ్రత వైచిన
నవరజుండును దానినణగఁజేసె
వింశతికరముల వేత్వేఱ ఖడ్గము
ల్గైకొనివేయగఁ గడునలిగియు

తే॥ గీ॥ దివ్యబాణంబుసంధించి దివిజగణము
మెచ్చ ఖడ్గవితానము మిక్కిలిగను
తునుకలగునట్లుఖండించె దోఃప్రతాప
మతిశయిల్లగ జనకజామాతయపుడు

సీ॥ సౌమిత్రి పదిపది జనితవైరముచేత
బాణంబులేయగఁ బటుశరాళి
దైతేయవరుడును దరలంగఁజేసియు
నతనిని శతసంఖ్య నంపగముల
ముంచిన వాచితూపులనేసి లక్ష్మణ
స్వామియు నవియెల్ల నపనిపోవఁ
జేసె నంతట రణసింహుఁడుఁ బావని
యరివీరసేనల హస్తగదను

తే॥ గీ॥ నుగ్గునూచగఁజేయుచు నిఖిలదివిజ
వరులునుతియింపఁ బ్రస్ఫుటవాక్యరచన
రామభక్తుండు రాజిలె రణతలమున
దివిజశత్రుఁడు మాన్యానెఁ బేజరిలుచు

సీ॥ రామచంద్రుఁడు నవ్వు లంకాధిపతిఁజూచి
దుర్మార్గతనమున దివిజగణముఁ
దల్లడిల్లగఁ గామదాసుండవయి నీవు
మారీచమాయను మరుమ్మవంచఁ
జేసియుఁ జపలాక్షి సిగ్గింతయునులేక
సీతనుదెచ్చితి చెట్టఁబట్టి
సంతోషమున నవ్వు సలిపితివంతయు
నోర్చుము వివిధంపునుగ్రబాణ

తే॥ గీ॥ తతినిఁజూచెద నీయుద్ధతనమునను చుఁ
బలుక మానముదూలంగ నలుకఁదనర
యుద్ధధరణినివీడి యహోయనుచును
యాత్మపురమునుజేరె రాక్షసవరుండు

సీ॥ సౌభ్రాత్రమున బహుసన్నుతికెక్కిన
కుంభకర్ణుండట్లుఁ గూలుటయును
పుత్రాగ్రజుండును బురుహూతగర్వని
ర్వాపణుండును నైనవానిమరణ
మునకును మనమున ఘనముగఁజింతించి
మంత్రిపుంగవులను మాన్యచరితు
లను పురోహితులను రాక్షసప్రవరుండుఁ
బిలిపించి మిక్కిలివినయమొప్ప

తే॥ గీ॥ నిట్టులను నాదుదుఃఖంబు నేర్పుతోడఁ
బోవునట్లుగ దశరథపుత్రయుగముఁ
ద్రుంచునట్లుగఁ జేయుడు రుక్మదేహు
లార! నయవంతులార! మీలావుబుద్ధి

సీ॥ అనినరావణు మాటలాలించి వారును
చిత్తంబులొక్కటఁ జేతఁబట్టి
ఘనముగఁజింతించి కాకుత్స్థవర్యుల
నిర్జించువిధమును నెఱుకసేతు
మనుచు రాక్షసనాథ! పాతాళయజ్ఞంబుఁ
జేసినవారలుఁ జిత్తసుఖము
నొందియు వైరులనుగ్గాడి జయలక్ష్మిఁ
బడసినగాధలు భాసురములు

తే॥ గీ॥ పరమభక్తిని మీధర్మపత్నితోడఁ
గరముహోమంబుసేయ విఘ్నంబుఁబొంద
కుండవలయును లేనిచోఁగూలఁగలదు
సర్వవంశంబునని వారుఁజక్కఁబలుక

సీ॥ రాజితంబగు మాటలనువిని రావణుం
డంతట నగరంబు భయరుకద్ధ
వంతంబుగనుజేసి పాతాళహోమంబు
జరుపఁబడుననియుఁ జాటఁబంచె
సకలరాక్షసులును జనుదెంచి రచటికిఁ
జూచువేడ్కతొ బహుశోభితముగఁ
బరివారతతులను బహుళంబుగా నలం
కృతులఁజేసిరి సవకుతలమద్ద

తే॥ గీ॥ భార్గవుండగు శుక్రుని భాసురముగ
బ్రహ్మపీఠంబుననయుంచి ప్రముఖతతిని
వివిధపనులకు నియమించి వేడ్కతోడ
దీక్షఁగైకొనె రావణదివిజవైరి

సీ॥ వివిధంపు ఋగ్వేదవృత్తంబులను నొక్క
రాత్రించయుండును రమణఁబఠక
జయశౌర్యములకు భాసంబైనమంత్రము
ల్చదివెను యొక్కడు సరభసముగ
అగణితాజ్యఘటంబులన్నియు శిఖలందుఁ
గ్రుమ్మరింపగ నవిరూక్షమైన
దీధితుల్చిమ్ముచు దిగ్విధులన్నియుఁ
గప్పగ నాకలోకమున నింద్ర

తే॥ గీ॥ గురులుభయమునుజెందిరి కోతిమూక
లన్నియును గగుర్పాటున రామచంద్రు
చరణకమలంబులకుమ్రొక్కి చాలభక్తిఁ
దడయకెఱిగించి రప్పుడుఁదద్విధమును

సీ॥ అంత రావణుతమ్ముఁడైన విభీషణుం
డంతయు నెఱుగంగ నతనిభటుల
సత్వరంబుగఁబిల్చి సంక్షోభకారణం
బరసిరమ్మనిపంప వారుఁదిరిగి
దశకంఠకృతమగు తద్యాగమునుజూచి
యిదియదీనికి సర్వహేతువనుచుఁ
దలచి రామునకును దైతేయవరునకుఁ
జెప్పిన నాశ్చర్యచిత్తములతో

తే॥ గీ॥ మునిగియుండిరి యంతటభూవరుండు
దీనికధనంబుఁదెల్పుడు తేటపడగ
ననుచువేడగ నందఱునాకసంబుఁ
జక్కఁజూచిన గుణవిభీషణుఁడు మఱియు

సీ॥ దశరథాత్మజ! రామధరణీశ! మాయన్న
పాతాళహోమంబు భరితరోషు
డగుచుఁ జేయుచునుండె నదిపరిపూర్తిగ
నయినచో మనకుఁగీడావహిల్లు
దనుజుండు మరణమొందకయుండుఁ గావున
దీనినివిఘ్నంబుఁ దివిరిఁజేయ
వలయును నావుఁడు వనజాతనేత్రుఁడు
జనకజాధిపుడును సైన్యవరులఁ

తే॥ గీ॥ జూచి మీలోనసవనంబుఁజొచ్చి వికట
వేషభాషల రాక్షసవిభునిమనముఁ
జెదరిపోవంగ నెవ్వరుఁజేతురనుచుఁ
బల్కవాలితనూజుఁడు వచ్చెనపుడు

సీ॥ కౌసల్యసూనుఁడుఁ గరమున వానిని
ధైర్యంబునకు మెచ్చి తనయ! నీవు
లంకాధిపుని యజ్ఞరాజంబు సర్వంబు
ధ్వంసంబు సేయంగవలయు ననిన
మీయానదాటక మీయాశంబుల
మహిమచే దానవభర్తృహోమ
మంతయు విచ్ఛిన్నమగునట్లుఁ జేసెద
నంచును యంగదుం [illegible]

తే॥ గీ॥ మదినిఁ దెనగొన నేగెను బవనసూన
వానర ప్రభుముఖ్యులు వానిఁ బొగడు
చుండ పాతాళలోకంబు శోభితముగ
నమృతభుక్కులుమోదింప నవులుదెగర

సీ॥ దివ్యతేజంబునఁ దేజరిల్లుచు యోగ
నిద్రయందున్నట్టి నిపుణమతిని
రత్నకుండల ముఖరాజిత కంఠునిఁ
గనుగొనియిట్లను కపివరుండు
రావణదనుజేంద్ర! రామునిఁ జంపంగ
సలుపుచున్నాడవా సవనమొకటి
యీరేడులోకాల నెందఱుఁ గూడినఁ
గాకుత్స్థవరు నొంపఁగలరె చూడ

తే॥ గీ॥ నీదుజన్నంబు భంగంబు నేనఁ జేతు
ననుచుఁ గపులను బురికొల్పి యంగదుండు
మూత్రరక్తాది దుర్గంధ పూరిషముల
నొక్కపెట్టునఁ గురియింప నొచ్చిపోవ

సీ॥ హోమగుండంబులు నుపయోగ రహితమై
చల్లారె తేజంబు సర్వమడగ
బ్రహ్మాదిముఖ్యులుఁ బరిభవింపఁబడిరి
వానరతతిచేత వన్నెఁదఱిగి
సర్వజనాభీల జనకంబుగాఁ జేసి
నను రావణుండును నధికభక్తిఁ
గలిగి సంచలనంబుఁ గాకుండుటను జూచి
వాలి తనుజుండు వానిభార్యఁ

తే॥ గీ॥ బరమసాధ్విని సారస పక్ష్మనేత్రఁ
గంబుకంఠిని నిత్యశృంగారవిభవ
నైనమండోదరినిఁబట్టి నగుచునీడ్చె
ధరణిమీదికి జనులెల్లఁ దల్లడిల్ల

సీ॥ కబరీభరంబును ఘర్షణఁగావించి
యవయవంబుల నంత హాస్యముగను
స్పర్శఁజేయుచు బహుపరుషవాక్యంబులఁ
దిట్టుచుఁగొట్టుచు దివిజవైరి
కనుగొనుచుండగఁ గాసిల్లఁజేసినఁ
గావరేయనుచు నక్కాంత దీన
ముఖమున నాత్మేశుముంగిట నేర్చిన
విగతనిష్ఠత నద్దువిభుఁడుఁగలగి

తే॥ గీ॥ రోషవిజృంభనయన విలోలుడగుచుఁ
గీశుడెవ్వఁడు నాసతిఁగీడువెట్టె
వానిఁదీర్చెదనంచును బాహుబలముఁ
జూప మర్కటవీరులు నంతరేగి

సీ॥ పాదఘాతంబులఁ బలుమాఱుఁ దన్నుచు
రాక్షసశ్రేణిని రభసమొప్పఁ
గూలంగఁజేసిన ఘూర్ణితనేత్రులై
క్రవ్యాదవీరులు ఘనకరాక్ర
మమునుజూపించిన భార్గవాదేశంబు
ననఁజేసి వాటను మొనసుమీఱి
గృహములకునుబోవఁ గీశవర్గము విభీ
షణునిఁజేరిరి రామచంద్రుదక్షు

తే॥ గీ॥ వైరివిషయంబులడుగగ భక్తిఁదనర
యజ్ఞవిధ్వంసనంబును హాస్యమొప్ప
నాలిఁజెఱచినభంగియు నంతఁదెలియఁ
బరచి రంతట వానరప్రతతి పిదప

సీ॥ రావణబ్రహ్మయు రామలక్ష్మణులను
హతమార్పఁజేసిన యుక్తినటన
మంతయు పృథఁగాగ నంతఁదెలుపుచు రాజ్య
భారంబు మంత్రులపైనఁబెట్టి
యేవిధంబుగనైన నినకులన్వయునిను
కదనరంగంబున ఖడ్గహతుల
గాఁజేతునంచును గర్వంబుహెచ్చగా
మూఢవమాఱుగ మోహించెఁ

తే॥ గీ॥ బోవునంతలో యాతని పుణ్యవంత
వత్ని యెదురేగి నాధునిఁబల్కెఁగనగె
రాక్షసాధిప! దైతేయలక్ష్మిఁబూల
రణముసేయంగఁబోదువే రాముతోడ

సీ॥ వైకుంఠవాసుఁడు వాసవప్రార్థన
జయశీలుఁడై ధరజన్మమంది
దశరధసుతుడయ్యె దానవాదులఁజంపఁ
దాటికివధియించెఁ దరుణిఁజేసె
మౌనిజన్నముఁగాచె మాయించె ఖరరాక్ష
సప్రకరంబును విప్రకులము
రక్షించె వాలిని రణమునఁదునుమాడె
సుగ్రీవుభయమును సోలఁజేసెఁ

తే॥ గీ॥ పవనసుతు భక్తులందునఁ బరిగణించె
గరళకంఠునివిల్లుఁ బల్కాడిమిఁద్రుంచె
జనకనందనఁబెండ్లాడె సకల జనులు
సంతసంబునఁ దేలగ జనవిభుండు

సీ॥ తండ్రియానతిఁదాల్చి ధర్మమార్గంబున
రఘువరుండును నిజరాణితోడ
సోదరయుతుఁడునై సుస్థిరకానన
వాసంబుఁజేయగఁ బర్ణగృహము
నందునుండగ నీవనంగ బుద్ధినిఁగల్గి
నాతినిఁదెచ్చితి నాశమొదవ
హీనబుద్ధిని మాని యినకులుభార్యను
నర్పణసేయుము నాకునచ్చు

తే॥ గీ॥ పరులభార్యలఁదెచ్చుట భద్రకరమె!
కరమువారికి నెందు సద్గతులులేవు
ధర్మశాస్త్రాది విద్యలఁ దనరి నీవు
నెట్లుఁజేసితి హీయమై యిట్టిపనిని

సీ॥ యుద్ధంబువలదిష్ట నుకుగుము యంచని
తత్సతివినుతింప దనుజవరుఁడు
డాకాలనామెను ఉంబంబులను బిల్కి
తన్నినఁ దత్పాదతాడనమునఁ
బుడమిపైఁగూలి వేమూర్ఛనొందినఁజూచి
రణమునకేగెదు రాజితముగ
నంచు దశగ్రీవు డాలోచనంజేసి
సుభట సైన్యంబులు సురుచిరముగ

తే॥ గీ॥ వెంటనడువంగ నరివీర భీకరముగఁ
జిహ్వసేతకు నరుగంగఁ జేతనంబు
నందుఁదోచెను రాముడు నరకుఁగాడు
దైవమంచని దురితుండు దనుజాకపుడు

సీ॥ హేషారవంబు లహీనమై చెలగంగ
గజబృంహితంబులు ఘనతనొప్ప
సైనికకలకలస్వనములు నిగుడంగ
శరములనాదంబుఁ జదలునిండ
రథములరావంబు రాజితంబుగనుండ
జయసూచకధ్వను ల్పక్క మెఱయ
భూషణోదంచిత పొల్పుగుశబ్దము
ల్భేరులనిస్వనం బెలమిహెచ్చఁ

తే॥ గీ॥ గదనరంగంబు విలసిల్లె ఘనుల రామ
రావణోగ్రపు బహువిధ లాఘవముల
జయము జయమని దివిజులు సంతసించి
కుసుమ రాజిని దివినుండి క్రుమ్మరించప

సీ॥ సన్నద్ధులైవచ్చి శాతనారసముల
రాఘవేంద్రునిముంప లక్ష్మణుండు
వేవేగవానిని విధ్వంసమునుజేసి
మెఱయంగ రాక్షసవీరుడపుడు
రోషముదీసింప రుద్రాకృతిందాల్చి
బహువిధాస్త్రంబులఁ బటుజవమున
సంధళిసేయంగ నర్కసుతుండును
భయపడి రాముని పాదపద్మ

తే॥ గీ॥ ములనునంటుచు నిట్లను భూపవర్య
దైత్యవరుడిప్డు రణమున ధాటిఁగలిగి
వెలుగుచున్నాడు దక్షత పీనిఁజంప
మనగనౌననె రాముండు సతనితోడ

సీ॥ ధరణీతలంబున దశరథసుతుఁడును
గమనీయరథముపై ఘస్మరుండుఁ
దనరగనిలబడి ధర్మయుద్ధముసేయ
సురవిభుండును మదిఁజోద్యమంది
మాతలిఁబిలిపిఁచి మాణిక్య దివ్యస
ద్రథమిచ్చి యనుపగ రాజితముగ
నతడుఁబుడమికిని యరుదెంచి యరదంబు
రామునకివ్వగ రవినిఁబోలి

తే॥ గీ॥ సూర్యకులుడప్డు దానిని సురుచిరముగ
నెక్కి యుద్ధంబుసేయగ నింద్రముఖ్యు
లంతరిక్షంబునుండి కీర్తనలుసలిపి
రిందువదనుని మెచ్చి వైరినిఁ దెగడుచు

సీ॥ వాతతనూజుండు వరతరువుల శైల
గములను రాక్షసగర్వమడప
సుగ్రీవయంగదు ల్చిత్రంబుగా వైరి
సేనను దుదముట్టఁ జేయుచుండ
నిశితమార్గణముల నేర్పొప్ప రావణు
మేనున రాముండు మించివేయఁ
దక్కటిదైత్యులు దర్పంబునందాక
వానరశ్రేణియు వారిఁజంపఁ

తే॥ గీ॥ బోరువిలసిల్లెఁ గైకసీపుత్రుబలము
తగ్గఁజొచ్చెను దశరధతనయుబలము
విస్తరించెను దత్వేళ వేదవిదుఁడుఁ
గలశజుండచ్చటికివచ్చె ఘనతనొప్ప

సీ॥ పరమతబోధనుఁ బర్వతగర్వసం
హరణుని మున్నీటియంబుతతినిఁ
గ్రోలిన ఘనసత్త్వుఁ గౌమరారఁగాంచి వి
నీతిమైనెఱిగిన నేత్రపద్మ
ములను రాముని రూపమునుజూచి యోపుత్రి!
శుభమగునీకును సుస్థిరముగ
దుష్టులశిక్షింప శిష్టులరక్షింప
జననమందితివీవు సత్త్వతేజ!

తే॥ గీ॥ పుణ్యజనుడిష్ట దినకరుఁ బోలియున్న
వాడు నీబలమిప్పుడు పన్నెఁదఱిగె
లోకచక్షుని దినరాజరూపు సూర్యుఁ
గరము ప్రార్థింపుమనియె నగస్త్యుడంత

సీ॥ సర్వపాపంబుల నణచునటి దానిని
శత్రువర్గంబును జంపుదాని
దినకర మహిమచేఁ దేజరిల్లెడుదాని
జపియించువారికి సర్వలాభ
ములను గూర్చెడుదానిఁ బుత్రార్థులకు శత
పుత్రులనొక్కటఁ బొందఁజేయు
దానిని వేదమంత్రంబుల నొప్పెడు
దానిని సుఖములఁదనరుదాని

తే॥ గీ॥ దివ్య "యాదిత్యహృదయంబుఁ" దీవ్రపటిమ
ధర్మయుతముగఁజెప్పెను దశరథసుతు
నకు నగస్త్యమునీంద్రుండు నమరవరులు
మేలుమేలని నుతియింప మించుఘోష

సీ॥ స్నాతుడై రాముండు జపతపములఁజేసి
ధ్యానించె సత్యముఁ దపను భానుఁ
జండాంశు దినకరు సర్వలోకాతీతు
సురలోకవంద్యు విశుద్ధచరితు
భాస్కరు విష్ణునిపలపటినేత్రంబు
నుద్దామధాముఁ బుణ్యాని నజేయుఁ
గలువలదాయను ఘనుని లోకమునందు
జరిగెడు పనులను జక్కఁబెట్టు

తే॥ గీ॥ వివిధ కౌశలిఁ గోరికల్వేగఁదీర్చు
వాని సుగ్రీవపితరుని భక్తివినయ
మగ్గలంబుగ నొసగెను మహితధైర్య
మప్డు శ్రీరామచంద్రుని కర్యముండు

సీ॥ పంచబాణంబుల ఫాలంబునొప్పింప
నారుబాణంబుల నతడుఁ గొట్టు
సప్తశరములను సక్రోధుడై యేయ
దశముల్కలొప్పించి తలలనేయు
రామరావణులిట్లు రాజితయుద్ధంబు
సేయగ రఘువంశసింహు డపుడు
నొక్కొక్కశరమును నొకశరమునఁగూల్ప
సలలితంబుగ నవిజన్మమందు

తే॥ గీ॥ దీనిమర్మంబుఁదెలియక తీవ్రచింత
నున్న రామునిఁగనుగొని యోమహాత్మ!
వంతనుడుగుము వీనియుదంతమంత
జనులువొగడగఁ జెప్పెద సరసముగను

సీ॥ పై మాటలాడిన పరమభక్తుని భావి
రాక్షసనేతను రాముడప్డు
జననుతు వరవిభీషణుని మోమునుజూచి
యట్లఁజెప్పుమనగ నతడుఁజెప్పె
మున్నామరాసురు ల్కన్నిటనమృతంబుఁ
ద్రచ్చిననితడును రాక్షసులలోఁ
హర్చుండి యమృతంబుఁగ్రోలినదాదిగ
చావు వీనినిఁబొంద జంకుననఘ!

తే॥ గీ॥ జఠరభాగంబునందున్న సర్వమరణ
హరము నాగ్నేయబాణంబునంపి యింక
నట్లుఁజేయగ నీతని నాహవమున
సులభముగఁజంపవచ్చును శూరవర్య!

సీ॥ అనియెడి దైత్యేశ్వరానుజుమాటల
నాలించి రాముండు నతిరయమున
దల్లిదండ్రుల నాత్మఁదలచియు నమరుల
యాశీస్సులందుచు నగ్నిబాణ
మప్పుడువిడువంగ మార్తాండ దీధితు
ల్చిమ్ముచు నదియునుజేరి పంక్తి
కంధరుయుదరంబుఁ గడువేగమునఁజొచ్చి
దగ్ధంబొనర్చెను తద్యమృతము

తే॥ గీ॥ శక్తియుక్తులు నన్నియు సన్నగిల్ల
గర్వముడిగియు వివిధసంఘట్టనములు
సల్పుచుండగ రామునిఁజక్కఁజూచి
ఖావిలంకాధినేత యిప్పట్టునందె

సీ॥ భ్రమందింపువేగమె రాక్షసాధిపునంచుఁ
బలుకగ దశరథపట్టియపుడు
మందహాసముఁజేసి మహినుతికెక్కిన
రామబాణంబును రమ్యమొదవ
సంధించి విడువంగఁ జయ్యనదది దశ
కంఠుని శిరయును గడిమిఁద్రుంచె
హాహారవంబులు నద్దెసగను సుర
లానందమునఁ దేలియాడిరంత

తే॥ గీ॥ నసురసంఘంబులన్నియు నాహవమునఁ
దొలగిపోయిన బద్ధప్రతోషడగుచు
నావిభీషణుడుండెను నవ్యశోభ
నందఋను జూచుచుండగ నపుడుదనుజా

సీ॥ దేహంబునందుండి తేజోమయంబగు
వెల్గుయొక్కటి రామవిభుని దేహ
మందుఁజొచ్చిన యంతభల్లూకవర్యుఁడుఁ
దడయక నచ్చటితందములకు
జయవిజయులనంగఁ జక్రిసేవకులిద్ద
ఱా మునిశాప దందహ్యులగుచుఁ
గనకాక్షవరహేమకశిపులు రావణ
కుంభకర్ణులనంగఁ గుతలమందు

తే॥ గీ॥ జన్మమందిన వారిని జక్కడంచె
సూకర నృసింహ దశరథసూను డగుచు
విష్ణుదేవుఁడు ద్వాపరంబునను దంత
వక్త్ర శిశుపాల వర్యులఁ బట్టిచంపు

సీ॥ మూడు జన్మంబుల మురహరుచేతనే
సమయుచు స్వర్గంబు సలిలితముగఁ
జొచ్చెదరంచును గూరుండు జాంబవం
తాఖ్యుఁడు పలుకగఁ దక్షణంబు
రావణుమృతివిని రాజాస్యలందఱుఁ
గదనభూమికి వేగఁగదలివచ్చి
పాంసుపరిచ్ఛన్న పటుతర దేహుని
లంకాధినేతను రమణఁజూచి

తే॥ గీ॥ దుఃఖభరమున మాటలుఁదొట్రుపడగ
నేడ్వ మందోదరీనామ నిర్వ్యసట్టు
మహిషి నాథునిఁగాంచి తాపంబుమీఱఁ
గంటిజలములఁ గుచములఁదాఁదడిపి

సీ॥ మిథిలాధినాథుని మేలతను దశరథ
జనపాలు కోడలి సకలసుగుణ
ఖని రామభార్యను గామాచి వర్గంబు
నకుబొంగి తెచ్చితి నతసుపర్వ!
నేనప్పుబోధింప నీచాతి సీచంబుఁ
గాఁ దన్నిఁ దూఱితి కరముసలిగి
యార్యపోషణుడైన యనుజువిభీషణు
వెడలంగఁదోలితి విక్రమాఢ్య!

తే॥ గీ॥ పాకశాసనుదొట్టి దిక్పాలవరులుఁ
దప్పుదురె నీదుయాజ్ఞకుఁ దరుణివాంఛ
నాహవోదగ్రరంగంబునందు రామ
నిశిత బాణంబుచేతన నీల్గితివు

సీ॥ అని విలపించెడి వనశాక్షిఁగనుగొని
జనపతి యలవిభీషణునిఁజూచి
పాపుదుఃఖమునుండి వదినను యాచన
నతడును యొనరించె నట్లుఁగాగ
తదుపరి దశరథతనయుండు భార్యను
జూచువాంఛతో వాయుసూన కీశ
పతి యంగదాదుల భద్రంబుగాఁగూడి
శింశుపాతరువును జేరి యుండ

తే॥ గీ॥ రాక్షసస్త్రీలమధ్యను రాజితముగఁ
జదలవెలిగెడు దినకరు చాయఁదోప
సతత రామ నామామృత రుచమునందుఁ
దానమాడెడి ముగుదను దనరఁగాంచె

సీ॥ దుఃఖసంద్రంబునఁదోగుచు రాముండు
సతినివీక్షింపగ జనకజయును
పతికతిభక్తి నమస్కరించిన నతం
డును శంకఁగల్గి విడువగఁ జనిన
నాశ్చర్యచిత్తులై యఖిలమిత్రులు సాధ్విఁ
జేకొనుమంచును వాకొనంగ
పరునింటఁగాపురంబున్న లతాంగిని
నేనెట్లుఁగైకొందు నిఖిలజనులు

తే॥ గీ॥ నన్ను నిందింపరేయంచు నతడువలుక
సమయ విదులగుజనులు వైశ్వానరోగ్ర
శిఖలనుంచిన సత్యంబుఁ జిక్కఁగలదు
తత్ప్రయత్నంబుఁజేయుడు తథ్యముగను

సీ॥ అనపుడు భటులంత నగ్నినిఁబురికొల్ప
మంటలుదిశలెల్ల భగ్గురనగ
సీతామహాసాధ్వి చెలువుగ భర్తను
దలచి యగ్నినిఁజొచ్చె ధైర్యవృత్తి
భయపడియనలుండు పాపహారిణియైన
సీతనుగాల్చక సిగ్గుఁజెంది
హస్తయుగ్మంబున సతిననుగ్రహించి
రామునిచెంతఁజేరంగ నెల్ల

తే॥ గీ॥ వారు విస్మయమందగఁబలికె నిట్లుఁ
బుణ్యచరితను శంకనుబొందనేల
శుద్ధదేహంబుఁగలిగి సుశోభితముగ
నున్నదిప్పుడుఁ జేకొను సుతసనంద!

సీ॥ అనిరాముఁ బ్రార్థించి యనలుండు సీతనా
　　　తనిసన్నిధినిఁ బెట్టి తానునరుగఁ
హర్షపరిప్లుత యనురాగచేతనుం
　　　డై నాథుఁ గౌఁగిటనమరఁబట్టి
లాలించి నాయపరాధములు క్షమింప
　　　వే యన్న భర్తను విద్రుమోష్ఠి
జరిగినదానినిఁ జర్చసేయుట నేల
　　　నాకర్మమిట్టు లనంతవిధముఁ

తే॥ గీ॥ గాగయుండిన ననిపల్కఁ గమలహితత
నూజుడప్పుడు సకలసన్నుతచరిత్రు
నలవిభీషణు లంకకు నధిపుఁ జేయు
మంచు విన్నపమాడెను భక్తవరదు

సీ॥ మున్నుఁ దానిచ్చిన ముఖ్యవాక్యంబున
　　　రావణానుజునప్డు రాజుఁ జేయ
మనమున ఘనముగ బాగుగయోచించి
　　　వరచతుస్సంద్రంపు వారితతులఁ
గడగిఁ దేరఁ బనిచెఁ గరువలిసూను నం
　　　గదు లాదిగనునొప్పు ఘనబలులను
తక్కటిరాక్షస తండముల్గొల్వగ
　　　దేవేంద్రవైభవ దీప్తిఁ దనరి

తే॥ గీ॥ రామశరణుండు వివిధమాల్యానులేప
చందనంబుల ఘుమఘుమ చాలఁ గలిగి
యున్న నభిషేకవిధులన్ని యుక్తముగను
సరసఁ బల్కిరి క్షేమషీజనములంత

సీ॥ ఛత్రంబునీకని మణులకిరీటంబు
శిరమునను౦చెను సీతనుఱది
విజయోస్తుయంచని పీఠుండువాయుజుం
డాతపత్రమువట్టె నపుడుభక్తి
పాదరక్షలనిచ్చె బహుగుణ సంఘాత!
జయజయయని రమాజానియంత
రత్నసంయుక్త వరాంగుళీయంబును
భాసిల్లఁజేసెను వాలిసుతుఁడుఁ

తే॥ గీ॥ గామలోభాది విరహిత రామభక్త
యనుచు సింగఃపుఁబీఠిపై నమరనునిచి
శాశ్వతంబుగ జనులను సకలసుఖము
లందుఁ బేలించి దైతేయరాజ్యమునకు

సీ॥ ప్రభువుడవై చక్కఁగఁ బాలింపుమంచు నా
రాముండుదీవించి రాజ్యభార
మంతయునిచి ధర్మమార్గంబునేపట్టి
నడుపుము యంచని నవ్యపటిమ
సకలధర్మంబులు సకలశాస్త్రంబులు
బోధించి రిపులనుబోరగెల్చి
వర్ధిల్లు నామీఁది వఱలిన భక్తిచే
బ్రహ్మలోకముఁ గాంచుమని దశరథ

తే॥ గీ॥ తనయుడాడగ రావణుతమ్ముడప్డు
రామచంద్రునిఁగొనియాడి రాజితంబు
లైన హయముల గజముల రమణనిచ్చె
నతనిసాహాయ్యమునకుఁ దానాత్మ మెచ్చి

సీ॥ ధరణినిబాధించు దైతేయవర్యుల
  నిద్ధఱి రాముండు నీల్గఁజేసె
ననుచుమోదముఁజెంది నలువదొట్టి వివిధ
  సురలేగుదెంచి విశుద్ధచరితు
జనకజాధిపు రాము సంస్కృత పదముల
  ఘనముగ నిట్లని గములుఁగూడి
రావణాసురమార! రఘువంశతోయధి
  చంద్రమ! నుతగుణ! సారసాక్ష!

తే॥ గీ॥ దివిజసంపూజ్య! దేవ! యాదిత్యతేజ!
పతితపావన! రామ! పాపౌఘహరణ!
యనుచునుతియించి రందఱహర్నిశలును
నిటలతట ఘటితాంజలి పుటులనగుచు

సీ॥ మఱియును రఘురాము మహిమలు పొగడుచు
  భాషించిరిట్లు సుపర్వవరులు
నీబాహుబలమున నీచంబుగా దశ
  కంఠుడీల్గెను ఘోరకదనభూమి
లక్ష్మణనిశిత నారాచ పరంపర
  మిత్తిచెంతకుఁజేరె మేఘనాదు
అమరాధినేత నిర్విషలుడై ధ్యానించు
  సతతంబు భవదీయ సాయకమును

తే॥ గీ॥ మాదు ప్రార్థనఁజేసి నీభక్తతతిని
రక్షసేయుము వైరుల రణములందుఁ
దీవిరిచంపేము నిన్నును తింపఁదరమె
జనకజామాత! కోసలసార్వభౌమ!

సీ॥ సన్మునీశ్వరులచేఁ జక్కఁగఁజేయించి
స్థాపించె దానినిసలిలరాశి
తీరంబునందున దివిజులువొగడగ
నదియుఁబుణ్యక్షేత్ర మయ్యెనిపుడు
"రామేశ్వరంబన" లక్ష్మణాగ్రజుడంతఁ
గౌబేరమందునఁ గడుజవమునఁ
బోవుచుఁ గమనీయపుణ్యస్థలంబులుఁ
గాంచుచు ఋశ్యమూకంబుఁజేరి

తే॥ గీ॥ సీతకంతయునెఱిగించి సిరులుఁగులుకు
పంపతటమునుజేరి కబంధుఁదునిమి
నట్టి మొదలగుతావుల నన్నిజనక
జకనుజూవుచు దండకన్పరసఁజేరి

సీ॥ సలలితంబౌ వనచయములు సరసీచ
యంబులు నదులు విహంగతతులు
పరిపక్వఫలభార భాసురకుజములు
సెలయేటితంగము ల్చెలగుచుండ
సకలంబుఁజూచుచు వికవికల్చేయుచు
దండకన్నాటి యుద్దండలీలఁ
జనిచని పేరొందు సన్మునీశ్వరులగే
హములనుగాంచి యానందమొంది

ఆ॥ వె॥ నుతులఁదెన్కఁబొంది నూత్నవిధంబుగ
గడచి నందిపురము ఘనముఁగాగ
నేత్రపర్వమగుచు నెగడొందఁజూచి యా
దిత్యవరులుమెచ్చ దితిజహరుఁడు

సీ॥ రంభాదికంబులు రాజిల్ల నడుగడుఁ
దిన్నెలఁ గుడ్యముల్ దీప్తిఁజెంగ
బహురత్నమరకత భాసుర తోరణ
సక్తాంగణంబులు సరసలంబు
లై సరూపంబులు రాజితమార్గ సం
యుక్తమైఁదనరి మహోన్నతసిరిఁ
జెలువొందుగ్రామంబు సీతానిసెలతల
తో విభీషణ సలఘూర్జ్వహులతో

తే॥ గీ॥ వాయుసూనుతో జాంబవద్వరులకీశ
నివహమంతయురాగ దినేంద్రమునుగనిఁ
దేజరిల్లుచునుండె వితీర్ణసుఖులు
మందగమనలు నందఱు సుందరులతో

సీ॥ వచ్చెవేగమె రామువదనంబుఁజూడగ
భరతుండు మాండవీభర్త హితుఁడు
శ్రీరామభక్తుఁడు సీతామఱందియు
లక్ష్యసిద్ధుఁడు బహురాజితుండు
పాదుకాయుగ్మంబు భక్తిమీఱఁగఁదెచ్చి
నీరాజనంబిచ్చి నిఖిలజనులు
రావణసంహార ! లక్ష్మణాగ్రజ ! ధీర !
సురగణసన్నుత ! కోమలాంగ !

తే॥ గీ॥ కమలసన్నిభనేత్ర ! ముక్కంటివిల్లుఁ
ద్రుంచి సీతనుగైకొన్న దోర్బలాఢ్య !
యనుచు నుతియింప రామునియంఘ్రియుగ్మ
ములను యొత్తుచునుండె సమ్మదమునందుఁ

సీ॥ భరతుండు పాదుకల్ భక్తిమీఱఁగఁగొల్వ
శత్రుఘ్ను డన్నకుఁ జాపమివ్వ
సౌమిత్రి భృత్యుడై చనవుసూపుచునుండ
జలపాత్రఁ జేపట్టి జనకజయును
ఘనఛత్రమొక్కటి గాడ్పుపట్టియుఁబట్ట
రాక్షసరాజు పరాకులివ్వ
సబలుడై కపిపతి చామరంబులువీవ
ఖడ్గముత్కంఠ నంగదుఁడుమోవ

తే॥ గీ॥ సంతతానంద సౌభాగ్య సచ్చరిత్రు
డగుచు రఘురామదేవు డలంకృతుఁడయి
పురము వెలువడి జనులెల్లఁ బూర్ణతోషు
లగుచు నుతియింపఁ గోసలరాజ్యమునకు

సీ॥ పోఁబోవఁ దమ్ముఁడు బుద్ధిఁదర్కించియు
రామచంద్రుని యంతరంగమందు
నిలిసి పాదుకలను నేర్పొప్పఁదొడిగిన
రాజులందఱిలోన రాజుసగిది
రాజిల్లె రాముఁడు రమణతో నందఱి
సేమంబులడిగియు శీఘ్రముగను
కకుబంత విఖ్యాతిఁగాంచిన పురమును
జేరగ జనులు నిస్సీములగుచు

తే॥ గీ॥ రత్నతోరణ ముఖరాజ రాజితంబు
లొప్పఁ బురమును గైసేసి లుప్తదుఃఖు
లైరి యప్పుడుఁ దమనేతనందునిల్పి
దివ్యహారతులిచ్చి నుతించిమఱియు

సీ॥ రాజమార్గంబున లక్ష్మణాఖ్యుండును
వాతాత్మజుఁడు జాంబవంత ముఖ్య
కపులును రాక్షసగణనాయకుండును
భరతాది యనుజులు భక్తిఁగొలువ
నరుదెంచు నారాయణాంశజు రామునిఁ
దిలకించి నుతులను బలికిరంత
సౌధాగ్రములనుండి స్రక్చందనాదులఁ
గురియించి యశేషలోకాళిఁజల్లి

తే॥ గీ॥ మానవాకారమెత్తిన మా పతియని
జనకనందన హృత్పద్మ చంచరీక
రావణాటోప శైల పురందరయని
దివిజనన్నుత సుగుణాఢ్య దీక్ష యనుచు

సీ॥ సకలహితులుఁ బౌరసముదయంబంతయు
సంతోషమందిరి సంభ్రమముగ
బాంధవులందఱు బహువిధనుతులు సే
సిరి రామభూపరు సీతమగని
రామునిగాథలు రాజితంబుగఁ గోట
కుడ్యములందునుఁ గుంఫితముగఁ
జెక్కారి చిత్ర విచిత్రపురూపుల
మణిమంటపములు శుభప్రదముగ

తే॥ గీ॥ నుండెనప్పుడు వివిధ వినూత్నవస్త్ర
ములను ధరియించి యొప్పిరి భూసురులు
రాజభామలుఁ గోసలరాజ్యమంత
సకలసౌభాగ్య సుందర సక్తమయ్యె

సీ॥ కౌసల్య కైకేయి కమనీయ సౌమిత్రి
తల్లియుఁ దక్కిన తాపసులును
నెదురుగానరుదేర నీమంబుతో వారి
పాదపద్మములకుఁ బ్రణుతిసల్పి
సాదృశ్యజనముల సమయోచితంబుగ
నుపగూహనంబిచ్చి యుక్తముగను
పిన్నవయస్కులఁ బ్రేమాతిరేకత
నాశీర్వచనములు నమరఁజేసి

తే॥ గీ॥ ప్రజలనందఱి వేఱ్వేఱ భాషణంబుఁ
జేసి కులగురుపైన వసిష్ఠమునిగ
లట్టి తాపునకేతెంచె రమణతోడ
నెఱిగి కుశలంబుఁ బ్రశ్నించె నెయ్యముగను

సీ॥ దశరథమహీపుచేఁ దనరాజ్యపాలనం
బంతయుపోవగ భార్యకైక
కోరినవరములఁ గూర్మితో నీయంగ
వనజాతనేత్రుఁడు వనములకును
జనకజసోదరు ల్మనముగవెన్వెంట
రాగఁ బోయెను లుప్తరాజ్యమునకు
నిప్పుడు రాముని నేర్పొప్ప రాజ్యాభి
షిక్తుగాఁజేయ వసిష్ఠమునియు

తే॥ గీ॥ వానరానీకమంతటి వనధులకును
వేగిరమ్మనఁబోయి కుంభీంద్రవరదు
కార్యమునకు జలంబుల నార్యహితముఁ
గాగఁ దెమ్మనిబంచెను గడుజవమున

సీ॥ హనుమంత జాంబవంతాదులు ప్రాగ్దిక్కు
నలనీలముఖ్యులు నస్తదిక్కు
దశముఖానుజుడప్డు దక్షిణదిశకు న
య్యంగదాదులు నుత్తరంపుదిశకు
ననిలవేగంబున నాల్గుసయోధుల
నీరంబుఁ బాత్రల నెమ్మిఁదూర్ణ
ముగను దెచ్చి వసిష్ఠమునివర్యుచెంతను
బెట్టియుంచిరి యంతఁ బ్రేమమీఱఁ

తే॥ గీ॥ దల్లులందఱు రఘురాము ధర్మయుక్తి
ముగను మంగళసద్వనుల్ మ్రోగుచుండ
వివిధసౌరభ సంయుక్త విశద తైల
ములనుయంటిరి తలను సంకలము మెఱయ

సీ॥ మంత్రోక్తవిధులను మంగళస్నానంబుఁ
జేయించి పట్టసుల్ సింగరించి
భాసురభూషణ వ్రాతంబుఁ దొడిగియుఁ
బారాణి పాదపద్మములఁ బెట్టి
రంభాదితోరణా లంకృతంబుగ రాజ
నగరును గైసేసి నలువకులు
వేదమంత్రములన్ని వినిపింపఁ బట్టాభి
షేకవేదికయొప్పె శ్రీఘనతిని

తే॥ గీ॥ బలపరాక్రమయుక్తులు మంటపమున
భరత శత్రుఘ్న లక్ష్మణప్రముఖులంత
నంతనుండిరి ప్రజలును క్రాంతలందు
నిలిచిచూచుచునుండిరి నేర్పుమీఱ

సీ॥ సకల మునీంద్రుల సర్వమంత్రములును
గలకంఠకంఠుల గానరవము
సమరవిలాసినీ నాట్యరంగములును
భూసురవర్యుల భూరివాక్కు-
లత్యంతమోదము నావహిల్లఁగఁజేయ
శుభముహూర్తమున వసిష్ఠమునియుఁ
దత్కాలమంత్రముఁ దనరఁగఁబల్కుచు
మణికిరీటంబును మస్తకంబు

తే॥ గీ॥ నందుఁబెట్టగ నమరులు నలరువానఁ
గురియునట్లుగఁజేయ నక్కులగురుండు
నందజానందచిత్తులై యాడిపాడ
రామదేవున కాశీస్సు లమరఁజేసె

సీ॥ స్వస్త్యస్తునీకని సకలతాపసులాడ
మంగళంబని రమాభర్తయాడ
రావణజేతని లక్ష్మణుండునుబల్క-
నంగదుం డాహ్లాదమందుఁబలుక
విక్రమాదిత్య గంభీర పాలింపుము
తిరము నిద్ధరణిని దివిజులాడ
నీపాదభక్తిని నేమఱకేజేతు
ననుచు వాయుజుఁడును నమరఁజెప్ప

తే॥ గీ॥ లోకకంటకుఁదునిమి యీలోకమందు
శాంతిఁగలిగించి రక్షించి శరణమొసగి
తంచునుతియించె దశముఖుతమ్ముడప్డు
నిటలతటమందుఁ గరయుగపుటులునగుచు

సీ॥ సూర్యచంద్రాదులు సొక్కియుండుటమాని
తేజోధికంబుగఁ దీవ్రమయిరి
సామంతరాజులుఁ జాలభీతినిమాని
సంతోషవంతులై శ్రద్ధులైరి
అష్టదిక్పాలురు నణగియుండుటమాని
తమతమపనులను దప్పరైరి
సర్వలోకము దుఃఖసంతప్తతనుమాని
కార్యభారములందు ఘనతనైరి

తే॥ గీ॥ భక్తులెల్లను దమతమబంధములను
రామనామోచ్చరణచేత లంఘనంబుఁ
జేసి సుఖియించి రప్పుడుఁ జిన్మయుండు
రామచంద్రుండు ధరణీభారంబుఁదాల్ప

సీ॥ వర్షముల్ మూడును వత్సరంబునఁగల్గు
సస్యాధిఫలములు సర్వవృద్ధిఁ
గాంచును వనములుఁగ్రమంబుగానుండు
నిర్ఝరానీకంబు నింపుఁగులుకు
పతిభక్తిఁగలిగి యాభామలువొప్పుదు
రన్యోన్యఘర్షణా రహితులగుచుఁ
బ్రజలువర్తింతురు రాగాదిచోరభ
యంబులులేవు పుణ్యాదికార్య

తే॥ గీ॥ జాలమంతయు సతతమ్ము జరుగుచుండు
దైవభక్తినివిడువరు ధర్మజనము
పూర్వరాజుల పాలనాబుద్ధితోడ
ప్రజలు సుఖపడిరా రామరాజ్యమందు

సీ॥ కందర్పబాధిత గాఢమతినిఁజిక్కి
నలుగురుతమ్ములుఁ జెలులఁగూడి
సౌఖ్యానుభోక్తలై సరసలీలలఁదేలి
యాడగ వరుసగ నందఱికిని
పుత్త్రద్వయంబు జగత్త్రయప్రఖ్యాతి
గనుబుట్టి రప్పుడు ఘనతనొప్పి
వారిలోఁ గుశలవవరపుత్రులిద్దఱు
వాసిఁగాంచిరి వారిబహుళకార్య

తే॥ గీ॥ ములకు నంతటఁగొడుకుల ముద్దుముచ్చ
టలనునారసి తోషించి కులవరుండు
రాజ్యభారంబునంతను లవకుశులకు
నిచ్చి యాధ్యాత్మికాసక్తి నిచ్చగించి

సీ॥ పట్టాభిషేకంబు భాసురంబుగఁజేసి
రాజ్యమంతయుఁబెట్టి రమణతోడ
నుండిననొకనాడు దండధరుఁడును
రాముతోభాషింప లలినివచ్చి
యేకాంతవాసంబు నిచ్చగింపగ లక్ష్మ
ణుండప్పు డన్నకుద్యోగియయ్యె
సంభాషణామధ్య సమయంబునందున
డ్డంకులేర్పడ నష్ట డంబుగ రఘు

తే॥ గీ॥ రామదేవుడుఁ దమ్ముని ధీమహితునిఁ
జంపఁజాలక విడిచిపుచ్చగను సరయు
నదినిఁగ్రుంకియు శేషనిపదముఁజెందె
నంత రఘువీరుడందఱి వంతఁదీర్చి

సీ॥ సీతయుఁదనదైన చిరతరస్థానంబుఁ
దొల్లిఁజేరెను రామదూతపావ
నియును దక్కటివారునేగిరి తమతమ
నెలవులకప్పుడు నియమముగను
తమ్ములుమఁగ్గురు ఁదనకంటెముందుగ
వైకుంఠవాసులై వఱలిరనుచు
బ్రహ్మాదిసురల సంప్రార్థితుండై తన
జన్మకర్మంబులఁ జక్కఁదెలిసి

తే॥ గీ॥ యుగసమాప్తినిగుర్తించి యుక్తకార్య
ములను నన్నిటిఁజేసి సంపూర్ణమైన
పరమపావనశుభదంబు భద్రకరము
నైన "వైకుంఠము"నకుఁబో నపుడుఁదలచి

సీ॥ సకలబంధువులను సత్కారములఁజేసి
వారిచే మన్ననఁబడసి పుణ్య
కార్యములొనరించి ఘనసరయూతట
మందుఁజేరగ నద్భుమంగళముగ
సురగరుడోరగ సిద్ధాదిదేవతా
రావము లంతట రహినియొప్పె
గౌతమాత్రివసిష్ఠ కౌండిన్య శార్ఙ్గల
భరత విశ్వామిత్ర పరమమునులు

తే॥ గీ॥ వచ్చిరప్పుడు రఘువంశవనధిసోము
మోముఁగనుగొన ఢమరుకముఖ్యనాద
ములను విలసిల్లె నంబరమునను సర్వ
దిశలువెలుగొందె నంతట దశముఖారి

సీ॥ ధర్మమణిప్రదీప్తంబయి చెలువొందు
దివిజవిమానంబుఁ దేజరిల్ల
నారోహణముఁజేసి యమరాదిబృందంబు
లన్నియుఁబొగడగ రాఘవుండుఁ
బ్రజలనందటికిని పావనమౌముక్తి
నొసగియు రంభాదిసూత్నఖచిత
రత్ననిబద్ధమై రాజిల్లు మంటప
సముదయయుక్తమై గములుఁగలిగి

తే॥ గీ॥ నిత్యలక్ష్మినివాసమై భృత్యగణముఁ
గలిగివిలసిల్లు వైకుంఠఘనపురంబుఁ
జేరె మానవాకారంబుఁదీటి తనదు
మొదలినెలవును లోకాళి మోదమంద

## "యుద్ధకాండము - సంపూర్ణము"

# ఫలశ్రుతి

సీ॥ జలధిరక్కసుని మత్స్యావతారంబున
గురుతరశైలంబుఁ గూర్మరూపు
నను హిరణ్యాక్షుని ఘనవరాహంబున
పరహేమకశిపుని నరమృగేంద్ర
ముగను బలీంద్రుని మూడడుగులడిగి
వామనరూపున భార్గవాంశ
లోనజన్మించియు రూక్షేక్షణంబుల
సకలరాజులనెల్ల సంహరించి

తే॥ గీ॥ తండ్రియానతి వనముల ధర్మపత్ని
యుక్తముగఁబోయి కీర్తి మహోన్నతంబు
నందునార్జించి దుష్టులడిందువఱచి
రాముడొప్పారె రవికులసోముడగుచు

ఉ॥ నల్లనిదేహధారి రఘునాయకు డబ్జజుతండ్రి జానకీ
వల్లభు డార్తరక్షణ నవశ్యముఁజేయు సుధీరుడుం బ్రియం
బుల్లసిలంగ భక్తులసుబుద్ధినిఁబట్టెడువాడు నిచ్చలున్
చల్లనిచూపులుంచి మిము సర్వవిధంబుల నోముగావుతన్

చ॥ పరమపవిత్రయుక్తమగు భాసురరామచరిత్ర నెవ్వరై
న ధరిఁబఠింప విన్న నరనాయకు డాశ్రితపారిజాతుఁడున్
దురితలతాలవిత్రకుఁడుఁ దోషితభూజనుఁడున్ మనోహరుం
డరిజనభీముడాతడు మహత్పదమిచ్చి భరించువారినిన్

మ॥ ఒకమాఱెవ్వనిపేరు కర్ణములలో నూహించి భాషించినన్
సకలాఘంబులు లిప్తమాత్రముననే సంహారముంజెందు న
త్యకలంకస్థితిఁ గొల్చు భక్తులకు నిత్యానందముంగూర్చు న
త్సుకరుండౌ రఘురాముడిచ్చు సతతమున్ తూర్ణంబు కల్యాణముల్

శా॥ శ్రీరాజిల్ల నయోధ్యపట్టణమదీబీజాలముల్ పర్వ సీ
తారామామణి నంకపీఠమున మిత్రానీకము ల్గొల్వగా
భారద్వాజ వసిష్ఠ గౌతమమునుల్ వాతాత్మజుం డుండగన్
ధీరమ్యుండగు దేవుడిచ్చు విమలోద్దీప్తంబులౌ లౌకముల్

క॥ స్థిరముగ "రాముని చరితము"
నరయగఁ "గాశ్యపకులంబు" నందుద్భవమొం
ది రహినిరచియించిరి యీ
పురుషులు "శ్రీకృష్ణశర్మ" ముఖ్యులు దండిన్

శ్లో క ము

"మంగళమ్" కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్

"ఓంతత్సత్"

"నిర్వచన సంగ్రహరామాయణము సంపూర్ణము"

ఈమని వేంకటకృష్ణయ్య

యల్లయపాళెము